# "లేనార్డ్‌కు తోడు బ్లూస్టార్ పేరు. అంతకు మించిన భరోసా ఇంకెందులో ఉందంటారు?"





"ఏర్‌కండిషనింగ్, రిఫ్రిజిరేషన్‌లలో బ్లూ స్టార్ నేర్పునైపుణ్యాలు మా లేనార్డ్ వెనక ఉన్నాయి."

ఈ ఆఫీసు బిల్డింగు ఏర్‌కండిషనింగు మొత్తం బ్లూ స్టార్ వారి పనే! పదేళ్లనుంచీ ఒక్క పేచీ లేదు పనితనమంటే అదీ! మా లేనార్డ్ రిఫ్రిజిరేటరు కూడా అచ్చం అలాగే పని చేస్తోంది, పేచీ అన్నది లేకుండా!

"కంప్రెసర్ ఎంత నమ్మకమైనదంటే, దానికి జేజేలు పలకవలసిందే!"

మా లేనార్డ్‌లో ఉన్నది విశ్వస్థాయి కంప్రెసర్ రిఫ్రిజిరేషన్ సిస్టం కూడా సరైనదీ, ఖచ్చితమైనదీ కావడంచేత కుంటుపడకుండా నడవడమేకాక కరెంటు బిల్లు కూడా తక్కువగా వస్తుంది మా లేనార్డ్‌పై నాకు పూర్తి నమ్మకం ఉంది ఇక మూరేళ్లపైగా, 150 దేశాలలో లక్షలాది ప్రజలు కూడా దీనినే విశ్వసిస్తూ వస్తున్నారంటే ఆశ్చర్యమేముంది?

అవును, ఏడాది వెంట ఏడాది లేనార్డ్ తన వెలను మించిన సొమ్ము మిగలబెట్టగలదన్నది నిజం! అందుకు కారణం దాని కంప్రెసర్ గట్టితనమే!




"మా శ్రీమతికి లేనార్డ్ నచ్చడానికి మరికొన్ని కారణాలు కూడా!"

దీనిలోని ఆటోమాటిక్ డిఫ్రాస్ట్ సిస్టంతో ఎంత సౌకర్యమో ఆవిడకు అనుభవ పూర్వకంగా తెలుసు లోపలి పనితనం కూడా నిలవచేసుకునే జాగా పూర్తిగా వినియోగమయ్యేలా ఉంటుంది అంతేకాదు చేపలు, పచ్చి కూరగాయలు, మిగిలి పోయిన వంటకాలు—ఎవైనా ఉంచండి తాజాగా, రుచిగా ఉంటాయి, పైగా వాళ్లూ వీళ్లూ ఇంటికొచ్చినప్పుడల్లా లేనార్డ్ ఎంతో తోడుగా ఉంటుంది

"బ్లూ స్టార్ వారి సుపరిచిత సేవ."

మా లేనార్డ్ కిప్పుడు 5 ఏళ్లు నిండాయి, ఇన్నాళ్లగానూ ఒక్క ఇబ్బందీ రాలేదు, అయినా అవసరమంటూ కలిగితే ఫోన్ చేస్తే చాలు, బ్లూ స్టార్ సేవ తక్షణం హాజరవుతుందన్న భరోసా ఉండనే ఉంది!






లేనార్డ్ 5 సైజుల్లో దొరుకుతుంది—ఆటోమాటిక్ డిఫ్రాస్ట్‌తో 285, 165 లీటర్లు, 135, 90, 65 లీటర్లు 165 లీటర్ డబుల్ డోర్ మోడల్ కూడా లభిస్తుంది. వీటితో దేశవ్యాప్తంగా ఉన్న బ్లూస్టార్ సేవా సౌకర్యం




SIMOES/BS/6/83C/TL

ఫిలిప్స్ రేడియోలకు ప్రఖ్యాతిగాంచి
గత మూడు దశాబ్దాలుగా ఎనలేని మీ
ఆదరాభిమానములు చూరగొన్న మా షోరూములలో
ఇప్పుడు మీ సౌకర్యార్థం నాణ్యమైన
గృహోపకరణములు కూడా లభ్యమగుచున్నవి




| | | |
|---|---|---|
| **విజయ అండ్ కో.** | **విజయ అండ్ కో.** | **పద్మ అండ్ కో.** |
| ఏలూరు రోడ్, విజయవాడ | మెయిన్ రోడ్, గుంటూరు | మెయిన్ రోడ్, గుంటూరు |
| ఫోన్. 75153 | ఫోన్ 21956 | ఫోన్ 20911 |

TARA-343/84 TEL

## ముఖచిత్రం

సుజాత ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్రుల పత్రిక చాలా శోభాయమానంగా వున్నది.

కోట నాగరాజకుమారి,
కోట ఉమామహేశ్వరి, కంభం.

* * *

24–2–84 సంచికలో నటి "పూర్ణిమా జయరాం" ముఖచిత్రం చాలా బాగుంది. వెల 30 పైసలకు పెరిగినాసూ పర్వాలేదు పాఠకు లంతా గమనించి మా (మీ) అభిమాన వార పత్రికకు ఎప్పటిలాగానే చేయూతనివ్వ ప్రార్థన

ఎస్. పి. సోమన్న, ఆదోని

## చీకటి వెలుగులు

మా అభిమాన పత్రిక వెల 1–80పైసలకు పెంచారు గనుక నాకు చాలా బాధ కలిగించింది. కానీ పేజీలు శీర్షికలు చూస్తే రేటు పెంచడం మంచిదేననిపించింది.

అమిరినేని హరికిషన్, వేమూరు.

* * *

టి. సుజాతగారి "చీకటి వెలుగులు" చాలా బాగున్నది. కథను చదువుతూ వున్నంతసేపూ మాలో ఏదో మాకు తెలియని వేదన ప్రారంభమైంది. నీరజకు దైవంలాంటి భర్తను ప్రసాదించి, పూర్ణిమకు దెయ్యంలాంటి భర్తను ప్రసాదించడంలో దేవుని పక్షపాత బుద్ధిని కళ్ళకు కట్టినట్లు రచన సాగించారు సుజాతగారు.

నేడు వరకట్న పిశాచానికి గురియైపోతున్న సోదరీమణులవలె పూర్ణిమ పుట్టింటి గౌరవాన్ని నిలబెట్టేందుకు అత్తగారి, భర్తగారి అంపవు కోతలకు తలను వంచినా, ఫలితం శూన్యమే అయిననాడు యే స్త్రీయైనా ధైర్యంచేసి, ప్రాణాలను తీసుకొనక భర్తకు న్యాయంగా కోర్టు ద్వారా విడాకులను యిచ్చివేసి తన కాళ్ళపై తాను నిలబడి బ్రతకడం మంచిది అనే రచయిత్రి భావంతో మేము ఏకీభవిస్తున్నాము.

షేక్ మస్తాను, గాలిబీబి,
ముమ్మలనేనివారిపాలెం, రేపల్లె




## హరిద్వార్

శ్రీమతి గుండు అన్నపూర్ణగారి లేఖలోని ఆవేదన గ్రహింపుకు తీసికొనవలసి వుంది. వాస్తవం వ్రాశారు. కెప్టెన్‌గారి 'హరిద్వార్' వ్యాసం చాలా చాలా చక్కగా వుంది. జయ్‌దుబాషీగారి లేఖ విద్యావంతుల నాకర్షిస్తుంది.

ప్రద్యుమ్నావారి, ఆత్మకూరు

## ఎడారిలో ఒయాసిస్సు

"సీటు – నీరు" కథ మూస రచనల ఎడారిలో ఒయాసిస్సు అనడం అతిశయోక్తి కాదు. చక్కటి భాష, నాటకీయ శైలి కథకు ఎంతో వన్నె తెచ్చాయి అయితే బొమ్మను మరింత భావస్ఫోరకంగా వేసి వుండవలసింది. ఏమైనప్పటికీ ఒక్క 'అక్షరం'లోని భిన్నత్వం మానవ జాతిని కాపాడినట్లు రచయిత శ్రీ పురాణపండ రంగనాథ్ చేసిన కల్పన బాగుంది. మనిషి మానవత్వాన్ని మరిచిపోతే – మరమనుషులే మానవ జాతిని కాపాడగలవన్న రచయిత ఉద్దేశ్యం బాగుంది. ఇక ముందుకూడా సైన్స్ ఫిక్షన్ కథలతోపాటుగా – మంచి సైన్స్ సీరియల్‌ని కూడా ప్రచురించగలరని ఆశిస్తున్నాను.

ఆర్. ప్రసాదరావు తెనాలి.

## పరాగమాల

"పరాగమాల"లో రంగారావుగారు మాటిమాటికి బూతు బూతు అని వాపోవడం ఏమీ బాగాలేదు. అసలు యీ బూతు పాటలు కొని వినేవారు బహు తక్కువ. సినిమాహాళ్ళలోను, హోటళ్ళలోను, పెళ్లి పందిళ్లలోను, రేడియోలలోను యిటువంటి పాటలు విని ప్రజలు (అదికూడా కొన్ని వర్గాలవారు మాత్రమే) క్షణికానందాన్ని పొందుతారేమోగానీ, తమ కష్టార్జితంతో యిటువంటి బూతు రికార్డులు కొని తమ విలువైన సమయం వ్యర్థం చేసుకొని కుటుంబ సమేతంగా యింట్లో కూర్చొని వింటారని నేననుకోను. ఇక్కడ నేను క్షురకారు సంగతి ప్రస్తావించడంలేదు. ఈ 'గౌళ్లింగాళ్ల' అభిరుచికి ప్రాముఖ్యత యివ్వడం అనవసరం, అవివేకంకూడా! తన సంకలనాల్లో కొద్దిపాటి 'మసాలా' కూడా వుండాలనే వుద్దేశ్యంతోనే రంగారావుగారు "ఎన్ని ఎన్ని ముద్దులున్నవి", "ఆడించు ఆడించు జోరుగా", "జిల్లాయిలే జిల్లాయిలే" లాంటి 'ఎబ్బెట్టు' పాటలు ఎన్నిక చేసేరని నా అనుమానం!

బి. శ్రీనివాసరావు, నిజామాబాదు

## చెంపదెబ్బ!

24–2–84 నాటి సంచికలోని 13వ పేజీలో "బాబు"గారు వేసిన కార్టూన్ నాకెంతో నచ్చింది. ఈ రోజు కులమత అభిమానాలు హద్దుమీరి, వెర్రితలలు వేస్తున్న తరుణంలో, ఈ కార్టూన్ "చెంపదెబ్బ" లాంటిది. ఇటువంటి కార్టూన్ వేసిన "బాబు" గారికి హృదయ పూర్వక అభినందనలు.

విజాపురపు వెంకటరావు, గుడివాడ

## న్యూఢిల్లీ లేఖ

న్యూఢిల్లీ లేఖ [జయ్‌దుబాషీ] ప్రతీ వారము ఎంతో ఆసక్తితో చదువుతున్నాను. ఈ శీర్షిక మీ పత్రికకే మకుటాయమానం అనటంలో సందేహించను. దేశీయ, అంతర్జాతీయ విషయాలలోని వారి పరిజ్ఞానానికి నేను చాలా ముగ్ధుడ్నయ్యాను

సా. బాలసూర్యనారాయణరాజు, విస్సాకోడేరు.

(74వ పేజీ చూడండి)

త్వరలో ప్రారంభం!
సరికొత్త సీరియల్ నవల
ఈ రాగాని కదే తాళం
రచన:
చక్కిలం విజయలక్ష్మి

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :

**దేశోద్ధారక కాశీనాథుని**

**నాగేశ్వరరావు పంతులుగారు**

స్థాపితం : 1908

***శివలెంక శంభుప్రసాద్***

**సంపాదకుడు :**

[1938–1972]

శుక్రవారం : 16–3–'84

రుధిరోద్గారి నామ సం. ఫాల్గుణ శు చతుర్దశి

**సంపుటము 76 : సంచిక 27**

**సంపాదకుడు :**

***శివలెంక రాధాకృష్ణ***

విడి ప్రతి వెల రు. 1-80

ఆరు మాసాల చందా రు. 46-80

పోస్టులో ఏడాదిచందా రు. 101-40

**ఆంధ్రపత్రిక కార్యాలయము,**

గాంధీనగరం. విజయవాడ-520 003.


## విషయానుక్రమణిక

**ముఖచిత్రం :**

నటి శ్రీదేవి

(ఫోటో : కాజాస్)



## లోకం పోకడ



# తుపాకులు - రొట్టె - వెన్న




సోవియెట్ యూనియన్ అధ్యక్షుడు ఎవరు మరణించినా మన దూరదర్శనం మీద సుబ్బులక్ష్మి, మీరా పాటలు పాడుతున్నట్లు చూపించటం అలవాటయిపోయింది. ఆండ్రొపోవ్ అసలు ఒక పోలీసు అధికారి. చివరికి ఒక పోలీసు రాజ్యానికి అధిపతి అయ్యాడు. ఆయనకీ మీరాకీ లేదా సుబ్బులక్ష్మికీ సంబంధం ఏమిటి ? వీళ్లిద్దరూ భారతదేశంలో ప్రజల గౌరవాభిమానాలని చూరగొన్న వనితలు. దేశం అంతా శోకంలో మునిగి ఉందని (దేష్ షోక్ మేన్ డూబాహై) దూరదర్శనం ప్రకటనలు వేసే ఆవిడ అంది. ఈ ప్రకటన చేస్తూ ఆమె తన చిరునవ్వుని అపుకుంది కనుక ఆ మాటని నేను నమ్మలేక పోయాను. ఆండ్రొపోవ్ మీద భారతదేశంలో జనానికి అంత ప్రేమ లేదు. సోవియెట్ రష్యాలో మాత్రం ఆయన అంటే ఎందరికి ప్రేమ ? కమ్యూనిస్టులు ఈ లోకాన్ని వదిలి ఎక్కడికి వెడతారో నాకు తెలీదు కాని ఆ చోటుకి ఆండ్రోపోవని సాగనంపటానికి కొందరు వేల మంది మాస్కో బూరోక్రాట్‌లు క్రెమ్లిన్ బయట చలిలో నుంచుని ఉండాలి అది వేరే సంగతి.

రష్యాలో విప్లవం అన్నది జరిగి 60 సంవత్సరాలు దాటింది. కాని, రష్యామీద నమ్మకం కలవారు సయితం ఆ దేశాన్ని తలుచుకుని జడుసుకుంటూ ఉంటారు. రష్యా, ఇప్పుడు ప్రపంచంలోని రెండవ అగ్రరాజ్యం. అగ్రరాజ్యాలకి బలం ఉన్నంతమాత్రాన ఇతరులు వాటిని ప్రేమించరు. అమెరికాకూడా అగ్రరాజ్యమే. అమెరికా అంటే ఎవరికీ ప్రేమ ఉండదు. కాని భయమూ ఉండదు. రెండు దేశాలలోనూ విప్లవాలువచ్చాయి. రెండింటిలోనూ అంతర్యుద్ధాలుకూడా చెలరేగాయి. పోలికలు ఇంత మాత్రమే గత 5 దశాబ్దాలుగా అమెరికా ప్రపంచంలోకెల్లా సంపన్నమయిన దేశంగా ఉంటోంది. అమెరికాయే ప్రపంచంలోకెల్లా బలవంతమయిన దేశం. అమెరికాని "పాతేస్తాము" అని కీ. శే. క్రుశ్చేవ్ అన్నాడు. కమ్యూనిస్టులు ఎంత ప్రయత్నించినా ఈ పనిని సాధించలేక పోయారు

ఆయుధాలని ప్రమాణంగా తీసుకుంటే సోవియెట్ రష్యా ప్రపంచంలో ద్వితీయ స్థానంలో ఉంటుంది. క్షిపణులూ, అణ్వస్త్రాలూ — వీటికి కొదువలేదు ఆయుధ శక్తి ఇంత ఉంది ఆర్థిక శక్తి మాట ఏమిటి ? ఈ విషయంలో రష్యాది రెండవస్థానం కానేకాదు. యూరోపులో రష్యాకన్నా పేద దేశం ఏదయినా ఉంటే అది ఐర్‌లాండ్ కాని పోర్చుగల్ కాని అయి ఉండాలి. ఈ సంగతి సోవియెట్ నాయకులకి తెలుసు.

ఇంగ్లీషులో "తుపాకులూ — వెన్నా" (బ్రెడ్ ఎండ్ గన్స్) అనే నానుడి ఉంది. ఈ రెండింటినీ పుష్కలంగా ఎలాగ తయారు చెయ్యాలో అమెరికాకి తెలుసు. తుపాకులని తయారు చెయ్యటం ఎలాగో రష్యాకి తెలుసు. ఇక వెన్న సంగతి అంటారా ? ఒక్కొక్కసారి రష్యా వెన్న రాసేందుకు రొట్టెకూడా తయారు చెయ్యలేకపోతూ ఉంటుంది. విప్లవం జరిగిన 60 ఏళ్లు దాటిన తర్వాత సోవియెట్ యూనియన్ గోధుమని దిగుమతి చేసుకుంటూ ఉంటుంది. అది కూడా ఎవరి దగ్గిరనుంచి అంటారు ? ఇంకెవరి దగ్గిరనుంచోకాదు, రష్యా పరమ శత్రువు అమెరికా వద్దనుంచి. తక్కిన కమ్యూనిస్టు దేశాలూ అంతే. పోలాండు సంగతి అంతే అది వేరే చెప్పాలా ? కొన్ని సంవత్సరాల కింద ఈ దేశంలోనే కదా రొట్టెల తాలూకు అల్లరులు చెలరేగాయి ? ఇక చీనా ఏమో ఆస్ట్రేలియా, ఇంకా ఇతరదేశాల వద్ద కూడా గోధుమ కొంటూ ఉంటుంది.

నియంతృత్వానికీ, ఆకలికీ మధ్య ఏదయినా సంబంధం ఉందా ? అనుకుంటూ ఉంటారు. నిరంకుశ పరిపాలనకీ పేదరికానికీ మధ్య సయితం సంబంధం ఉందేమో ! ఆఫ్రికాలో ఎప్పుడూ దివాలా తీసిన పరిస్థితిలో ఉండే దేశాలు లేవూ ? పొట్టలో ఎక్కువగా రొట్టె, వెన్నా ఉన్న జనం తుపాకులని తయారు చెయ్యటానికి అంతగా ఇష్టపడరన్న సిద్ధాంతం ఉందేమో తెలీదు ! ఆ సిద్ధాంతాన్ని అనుసరించే కొందరు ఆహార పదార్థాలని తక్కువగా తయారు చేస్తారేమో..? రష్యాలో జనాన్ని ఇలాగే అదుపులో ఉంచుతూ ఉండాలి— ఇవాళ రొట్టె ఉంటే రేపు కాని మాంసం ఉండదు, రేపు మాంసం ఉంటే ఎల్లుండి కాని బంగాళదుంప ఉండదు, ఎల్లుండి బంగాళదుంప ఉంటే ఇంకేదో ఉండదు. ఇలాగే పోతూ ఉంటుందన్నమాట. ఒక అంచనా ప్రకారం రష్యావాళ్లు పదిలక్షల మందిని ఏదో ఒక రకం నిర్బంధంలో ఉంచుతున్నారు. నిర్బంధం అనే మాట వాళ్లు వాడకపోవచ్చు, విద్యాభ్యాస కేంద్రాలు, మానసిక ఆరోగ్య కేంద్రాలలో ఉంచుతున్నామంటారు— కాని ఉద్దేశం అదే. ఒక దేశంలో ఇన్ని లక్షల మంది మానసిక-రుగ్మత కలవారు ఉంటే ఏమనుకోవాలి ?

భారతదేశం ఉపగ్రహం కోసమూ, అంతరిక్ష నావల కోసమూ వందల కోట్లు ఖర్చు చేస్తోంది.



అయితే, బస్సులు కొనవలసి వచ్చినా, రోడ్డుమీద తారు వేయవలసి వచ్చినా భారతదేశం ప్రపంచ బాంకుని ఆశ్రయిస్తూ ఉంటుంది. ఆ బాంకు వాళ్ళు డబ్బు ఇవ్వమని అన్నా, ఏవయినా ప్రశ్నలు వేసినా ''మా అంతరంగిక వ్యవహారాలలో జోక్యం'' అని బాధపడుతూ ఉంటాము. రష్యాకి ప్రపంచ బాంకు అప్పులు అనవసరం. ఆ దేశానికి కావలసినంత బంగారం ఉంది. ఆ బంగారాన్ని ఏ జూరిక్‌లోనో, లండన్‌లోనో అమ్ముకుని తమకి కావలసిన నిధులని చేకూర్చుకుంటారు. భారతదేశానికి బంగారం లేదు. అందుకనే అంతర్జాతీయ ద్రవ్యనిధిని గాని, ఆసియా అభివృద్ధి బాంకుని గాని అప్పు కావాలని అడుగుతూ ఉంటాము.

భారతదేశం ప్రపంచంలోని పేద దేశాలలో ఒకటి. అయినాసరే, ఈ దేశం వందల కోట్లు ఖర్చుచేసి అంతర్జాతీయ సమావేశాలనీ, 5 – చుక్కల హోటళ్ళనీ, ఆసియాడ్ కార్యక్రమాలనీ నిర్వహిస్తూ ఉంటుంది ఇలాంటి దేశం భూగోళం మీద ఇంకొకటి లేదేమో !

రష్యా వాళ్ళు, చీనా వాళ్ళు ఇలాంటి పనులు చేస్తున్నారా ? పోనీ బ్రిటన్ చేస్తోందా ?

మన దగ్గిర తగలబెట్టేందుకు ధనం ఉంది కాబట్టి తగలబెడుతున్నాము. అది మన డబ్బు కూడా కాదు కదా !

సోవియెట్ రష్యా ఒక కమ్యూనిస్టు రాజ్యంకాదు, అదిఒక భూస్వామ్య రాజ్యం జారుల కాలంలో ఎలాగ భూస్వాముల పాలనలో ఉండేదో అదేవిధంగా నేడుకూడా అలాంటివాళ్ల పాలనలోనే ఉందనీ, ఆండ్రొపోవ్, చెర్నెంకోలలాంటివాళ్ళు ఆ రాజ్యాన్ని చేజిక్కించుకున్న అధికారులు మాత్రమేననీ అనేవాళ్ళు ఉన్నారు. లేకపోతే ఒక రహస్య పోలీసు సంస్థ (కె.జి.బి.) అధికారి ఎలాగ ఆ దేశానికి అధ్యక్షుడు కాగలిగాడు ? అమెరికా సంయుక్త రాష్ట్రాలలో అల్ కపోన్ అనే దొంగ ఉండేవాడు. అతను ఎందరినో చంపించి వేశాడు. అలాగే ఇంకా ఎందరినో చంపించివేసిన వాళ్ళు అత్యున్నత పదవులని అలంకరించటం గొప్ప విషయమేకదా! పోలాండ్‌లాంటి దేశాలలో, ఇంకా తక్కిన చోటులలో క్రెమ్లిన్‌కి వ్యతిరేకంగా తిరుగుబాటులువస్తే వాటిని అణిచివేసినవారిలో ప్రముఖుడు ఆండ్రొపోవ్. అందుకనే క్రెమ్లిన్ అతని కైవశం అయిపోయింది. ఆయన వారసుడి చరిత్ర వేరేగా ఉండవచ్చు కాని క్రెమ్లిన్ నాయకులుందరూ ఇలాంటి వ్యక్తులే. వాళ్ల అర్హత ప్రధానంగా ఒకటే – అదేమిటంటే సోవియట్ రాజ్యాన్ని నిలబెట్టటం. అలాంటి వాళ్ళు భారతదేశంలోనూ ఉన్నారు. ఇక్కడ ఎందరు ఆకలితో బాధపడినా వాళ్ళకి అనవసరం. రాజ్యం సుస్థిరంగా నిలవాలి, అంతే. అందుకనే దేశంలో ఇన్ని లక్షలమంది అర్ధాకలితో ఉన్నారు— భోజనం ఎక్కడ దొరుకుతుందా, అని ఆలోచించే వాళ్ళు నియంతలకి లొంగి ఉంటారు కదా !★




# ఇది మీకు చాలా ఉపయోగం

మీకు "వ్యవహారదర్శిని" అనే తెలుగు పుస్తకం చాలా ఉపయోగం అందులో ఆస్తికొన్నా అమ్మినా తీసుకోవలసిన జాగ్రత్తలు, వ్యాపార,పరిశ్రమలకెలాంటి లైసెన్సులు తీసుకోవాలి, అన్నిమతాల వివాహ, విడాకుల నిబంధనలు, స్త్రీ,పురుషుల ఆస్తిహక్కులు,పెద్దవారితో ప్రమాదం రాబోతే పోలీసురక్షణకు ఎవరికెలా వ్రాయాలి, ఇండ్లస్థలాలకెలా ధరఖాస్తు పంపాలి,లాడ్జింగుల్లో వ్యభిచార నిరోధ రూల్సు, వాటినుంచి రక్షణ వివరాలు,మీరు తెలుసుకోదగిన అనేక చట్టాల వివరాలు,నోట్లు,దస్తావేజులు,ఒప్పందాలు,పిటిషన్లు, ఫిర్యాదులు,ఉత్తరాలు,ఎలా వ్రాయాలి వాటి వివిధ నమూనాలు అందున్నాయి పుస్తకం ధర రూ12 వి.పి పోష్టు ఖర్చు రూ 3 అదనం. దేశసేవ ప్రచురణలు,

నెం 2 ఇందిరానగరు,వెంగళరావునగరు టాంకు సమీపాన హైదరాబాదు 500838కు. మీ ఉపయోగానికి వ్యవహారదర్శిని పుస్తకం ఒకటి వి పి పోష్టు ద్వారా పంపించమని నేడే ఉత్తరం వ్రాయండి ఇది మీ వ్యవహారాల సామర్థ్యాన్ని పెంచుతుంది



## నిరోధ్‌తో...
## తొలి బిడ్డ పుట్టేముందు, మధుర క్షణాల సుఖ, సంతోషాలను అనురాగంతో పంచుకోండి



మీకు అవశ్యంగా తోచినప్పుడు మీరు ఏకత్వంలో తన్మయం చెంద సహకరించగలదు నిరోధ్. తొలి బిడ్డ యీ మహత్తరమైన ప్రకృతి ప్రపంచంలో కనులు తెరచి కాలిడ, మీ కోరికకు అనువుగా తగిన కాల వ్యవధిని, అవకాశాన్ని సమకూర్చగలదు.




## నిరోధ్ వాడండి
సుఖప్రదమైన, నిశ్చింతయైన వైవాహిక జీవితానికి

డిస్ట్రిబ్యూటర్లు బ్రూక్ బాండ్, లిప్టన్ హిందూస్థాన్ లీవర్ ఐ టి సి, టాటా ఆయిల్ మిల్స్ యూనియన్ కార్బైడ్ ఐడిపిఎల్, స్మిత్ స్టానీ స్ట్రీట్ ఇండియన్ ఆయిల్ కార్పొరేషన్ భారత్ పెట్రోలియం మరియు అరసన్ మ్యాచ్ ఇండస్ట్రీస్

davp 83/221

# వ్యక్తిగతం



బంగళాదేశ్ విముక్తి సేన "ముక్తిబాహిని"కి సేనాధిపతిగా ఉన్న జనరల్ ఎమ్. ఎ. జి. ఉస్మానీ ఫిబ్రవరి 17నాడు లండన్‌లో ఒక ఆసుపత్రిలో మరణించారు. ఆయన వయసు 61 మాత్రమే...

సాహిత్యంలో నోబెల్ బహుమతి పొందిన సుప్రసిద్ధ సోవియట్ రచయిత మైకేల్ షోలొకోవ్ (78) ఫిబ్రవరి 21న మరణించారు.



ఈయన కే. శే. కృశ్చేవ్‌కి మంచి మిత్రుడు రష్యాలో అధికారంలో ఉన్నవారి అనుమతితో నోబెల్ బహుమతిని(1965) అందుకున్న మొదటి వ్యక్తి...



రాష్ట్ర కార్మిక మంత్రి శ్రీ ఎం. రామచంద్రరావు అవినీతి ఆరోపణ కారణంగా పదవిని కోల్పోయారు. ఒక ముఖ్యమంత్రి తమ మంత్రివర్గ సహచరుని నీతి నిజాయితీలని శంకించి అవినీతి ఆరోపణతో ఆయనని పదవినించి తొలగించవలసిందిగా గవర్నర్‌కి సిఫార్స్ చెయ్యడం అన్నది దేశంలో ఇంతకుముందు ఎక్కడా జరగని సంఘటన! తెలుగుదేశం పార్టీలో వర్గతత్వం బలపడుతున్నదనడానికి ఇది నిదర్శనమని కొందరి అభిప్రాయం.




**16-3-1984 శుక్రవారం మొదలు 22-3-1984 గురువారం వరకు**

**మేషం:** వ్యాపారం అనుకూలం. వ్యవహారం ఏదయినా ఉంటే అనుకూలంగా పరిష్కరింపబడగలదు. దూరప్రాంతాల నుండి బంధువులు యింటికి రానున్నారు. వారికి ఉపచరించుటయే గాక, అనుకోని విధంగా ఖర్చు కావటం గమనిస్తారు. స్త్రీలకు: వృత్తి ఉద్యోగాలందు పెంపు కనిపిస్తుంది.

**వృషభం:** గృహ విస్తరణ కార్యమందు కొందరు నిమగ్నులు కావటం, కొందరకు అధిక వ్యయం సంభవం కావటం, కొందరు భూసంపదను పెంచుకొనే యత్నం చేయటం గమనింపగలుగుతారు. స్త్రీలకు: ప్రత్యేకంగా సాహితీ రంగాను కూలత ఏర్పడగలదు.

**మిథునం:** బంధు విరోధం రాకుండా చూచుకోవాలి. కుటుంబ కలహం రాకుండా సర్దుబాటు చేసికోవాలి, భేదాభిప్రాయాలకు అనుకూల పరిస్థితులుంటాయి, జాగ్రత్త. స్త్రీలకు: చేసిన ఉద్యోగ ప్రయత్నాలు ఫలించనున్నవి. గ్రహించాలి.

**కర్కాటకం:** కోర్టు వ్యవహారాలు మీకు వ్యతిరేకంగా పరిణమించగలవనే భయం ఏర్పడుతుంది రాకపోకలందు వస్తువులో, ముఖ్య కాగితాలో, పోగొట్టుకొనే అవకాశం ఏర్పడుతుంది. ఎంత జాగ్రత్త వహిస్తే అంత మంచిది. స్త్రీలకు: ఉద్యోగావకాశాలు, స్వల్పాదాయం సంభవం.

**సింహం:** గనులందు, కార్ఖానాలందు, 'ఫాక్టరీ'లందు పనిపాటులు చేసికొనే వారికి గాని, యజమానులకు గాని సుఖదాయకం, లాభదాయకమైన వారం. కుటుంబానందం ఉంటుంది. స్త్రీలకు: నూతన వాంఛాలు తెలిపికోవటం, నూతనోద్యోగాలకు చేసే యత్నాలు ఫలదాయకం కావటం గ్రహిస్తారు.

**కన్య:** వస్తువులు సేకరించుకొనుటు, అందుమూలాన క్రయ విక్రయమందు ఆదాయం పొందటం గాని జరిగిపోతుంది. పత్రికా ప్రకటనమందు, లేఖనమందు ఈవారంలో కొందరకు అనుకూలత, నూతన వాంఛాలు గ్రహించుటకు అవకాశం లభించే సమయమే. స్త్రీలకు. ఉద్యోగమందు 'ప్రమోషన్' లభించే అవకాశమున్నది. ఆదాయమున్నది, గ్రహించాలి.

**తుల:** అవసరాలకు తగినంత ద్రవ్యం చేతికందుతుంది. పోయిన వస్తువులు దొరుకుతాయనే నమ్మకం కనిపిస్తుంది. భూమి కొనటం, ప్రాధాన్యమా? గృహమా అనే సంకటంలో పడుతారు. సాహితీపరంగా మీకు మేలు చేకూరుతుంది. స్త్రీలకు: దూర బంధువులను ఆదరించుటతో శ్రద్ధపోతుంది.

**వృశ్చికం:** 'వారం వారం యింతేనా' అనుకొని నిరుత్సాహపడ వద్దు. ఉత్తమ ఫలదాయకమైన దినాలే ఒకానొక విషయం సులభసుందరంగా నెరవేరుతుంది. మీ వృత్తి భాసించే దినాలు ఏతెంచాయి. స్త్రీలకు: శుభకార్య ప్రస్తావనలు, బంధువులు యింటికి రాకపోకలు సాగించటం కనిపించే అవకాశమున్నది.

**ధనుస్సు:** మీ యభీష్టం నెరవేరుతుంది. తోటివారి వలన చికాకులు రాకుండా చూచుకోవాలి. అధికారం అభివృద్ధి నందుతుంది గదా! ఉద్యోగం పోగొట్టుకొన్న బెంగతో సతమతమవటం ఏ విధంగా మేలో యోచించండి. స్త్రీలకు: దాయాది వర్గం వలన గాని, శత్రువర్గీయుల వలన గాని యిబ్బందులు రాగలవు, జాగ్రత్త!

**మకరం:** ఒకానొక వ్యవహారం చాల కాలంగా నెరవేర లేదు గదా! దాని విషయమై బెంగ పడరాదు. సాహితీరంగాన మీకు మేలున్నది. రచనా వ్యాసంగం ఫలిస్తుంది. గ్రహించి మెలగండి. కొందరకు అనుకోకుండా కొన్ని పనులు నెరవేరుతాయి. స్త్రీలకు: అప్రయత్న ధనలబ్ధి, అంతకు అంత వ్యయం గల వారమే.

**కుంభం:** ఆలోచనలు ఫలిస్తాయి. నలుగురిలో పెద్దరికం పోగొట్టుకొన్నందున బాధపడుతారు. ఏం ప్రయోజనమో, ఆలోచించండి. నాలుగు విధాలా ప్రగతి ఏర్పడుట గమనించగలుగుతారు. యత్న కార్యసిద్ధి, రాజకీయంగా అనుకూలత చేకూరగలదు. స్త్రీలకు: ఆభరణాలు చేయించుకొనుటకు, వస్త్ర సేకరణకు అనుకూల వారం.

**మీనం:** చాలమంది విదేశాలకు పోయే ప్రయత్నాలు జరుపగలరు. ప్రయాణం సాగుతుంది. నూతన వాంఛాలు గ్రహింపగలుగుతారు. ఉద్యోగయత్నాలు సమకూడుట నిశ్చయం, ఫలితం కూడా వారాంతంతో పొందగలుగుతారు. స్త్రీలకు: వ్యవహారరీత్యా మేలు సంభవం. కోర్టు వ్యవహారాలు అనుకూలమే. గృహ సంసిద్ధికి అనుకూలమే, గ్రహించాలి.

— విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి *

# బలహీన వర్గాలకు బంగారు బాట

శ్రీ ఎన్. టి. రామారావు నాయకత్వాన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం బలహీనవర్గాల ఆర్థిక సాంఘిక సముద్ధరణకు కంకణం కట్టుకొని దీక్షతో కృషి చేస్తున్నది. షెడ్యూల్డు కులాల సంక్షేమానికి సాంఘిక భద్రతా చర్యలకు, బడ్జెట్ కేటాయింపు 1982 - 83 లో రూ. 78.57 కోట్లు కాగా, 1983-84 లో రూ. 129.63 కోట్లు.

* రూ. 2 లకు కిలో బియ్యం :

108 లక్షల పేదకుటుంబాలకు ప్రయోజనం.
రూ. 108 కోట్ల సబ్సిడీ.

* పేదలకు వసతి గృహాలు :

శాశ్వతమైన పక్కా ఇళ్ల నిర్మాణం గుడిసెల కార్యక్రమం రద్దు.
సుమారు 70,000 పక్కా ఇళ్లు పూర్తి.
మొదటి దశలో రూ. 88 కోట్ల ఖర్చుతో 1.4 లక్షల ఇళ్ల నిర్మాణం మొత్తం 2.2 లక్షల ఇళ్లు నిర్మించాలని సంకల్పం.
పేద కుటుంబాలకు 1 లక్ష ఇళ్ల స్థలాలు పంపిణీ.

* విద్య :

37.45 లక్షల పేద విద్యార్థులకు మధ్యాహ్న భోజనం.
13.52 లక్షల హరిజన గిరిజన వెనుకబడిన తరగతుల విద్యార్థులకు మెట్రిక్ కు ముందు తర్వాత యిచ్చే ఉపకార వేతనాల కోసం రూ. 23 74 కోట్ల కేటాయింపు.

* ఆర్థిక సహాయ పథకాలు :

3 లక్షల హరిజన గిరిజన కుటుంబాల సంక్షేమ పథకాలకోసం రూ. 225 కోట్ల కేటాయింపు.

2.88 లక్షల వెనుకబడిన తరగతుల కుటుంబాల కోసం మార్జిన్ మనీ క్రింద రూ. 14.81 కోట్లు.

వృద్ధాప్య పించనులకోసం రూ. 7.99 కోట్లు

* మహిళా సంక్షేమం :

ఆస్తులలో స్త్రీలకు సమాన భాగం కోసం శాసనపరమైన చర్య ప్రారంభం.

బడ్జెట్ కేటాయింపు 1982 - 83 లో రూ. 7.11 కోట్లు కాగా, 1983-84 లో రూ. 13.52 కోట్లకు హెచ్చింపు.

* వికలాంగులు :

ప్రత్యేక డైరెక్టరేట్ ఏర్పాటు.
తిరుపతిలోనూ, విశాఖపట్టణంలోనూ, శిక్షణతో పాటు ఉత్పత్తి కేంద్రాల స్థాపన.

బలహీన వర్గాల సంక్షేమమే ప్రభుత్వ లక్ష్యం.

---

DIPR No. 3/PDL Advt C4/84 సమాచార, పౌర సంబంధ శాఖ, హైదరాబాదు.

# మీకో దణ్ణం!

## మానేపల్లి

మంచి నిద్రలోంచి తుళ్లిపడి లేచింది కృష్ణవేణి.

గుండెలు దడదడలాడిపోయేయి.

కంగారుగా మంచంమీద లేచి కూచుని ఆ చప్పుడు జాగ్రత్తగా విన్నది. పక్కవాటాలో పిల్లల అల్లరి. నిద్రమత్తు వొదిలిపోయింది. వళ్లు మండిపోయింది. గబగబా యివతలికి వచ్చింది.

ఒక పెద్ద ఇత్తడి పళ్ళెంమీద విరిగిపోయిన గరిటెతో కొడుతూ అల్లరిచేస్తున్నారు పొరుగింటి పిల్లలు.

"ఏయ్ ఎందుకలా అల్లరిచేస్తారూ ?" అని ఒక్క కేక వేసింది.

పళ్లెంమీద కొడుతున్నవాడు ఒక నిముషం కృష్ణవేణివేపు చూశాడు. ఆగిపోయాడు. మరో నిముషంలో మళ్లీ ప్రారంభించాడు. చుట్టు పక్కల గుంటలు గంతులు వేస్తున్నారు.

ఈసారి శక్తంతా కూడదీసుకుని "మిక్కాదూ చెప్తుంట గోల చెయ్యకండి" అని అరిచింది. కళ్లు ఎర్రజేసి మింగేసేలా చూసింది.

ఏమీ ఎరగనివాళ్లలా తలకాయలు వంచుకుని నుంచున్నారు.

"అల్లరి చెయ్యకుండా ఆడుకోండి — అయినా మధ్యాహ్నం రెండు గంటలవేళ ఆట ఏమిటీ ? ఇంట్లోకి పోండి. సాయంత్రం ఆడుకుందురుగాని —" అని గసిరింది.

వాళ్లు ఒక్క అడుగు వెనక్కి తగ్గారు.

వెధవ పిల్లలు, వెధవ పిల్లలు — అని విసుక్కుంటూ లోపలికొచ్చింది.

పక్కవాటాలో నలుగురు పిల్లలున్నారు. ముగ్గురు మొగపిల్లలు, ఒక ఆడపిల్ల. పెద్దవాడి వయసు ఆరేళ్లు. రెండోవాడికి నాలుగున్నరేళ్లు. మూడోవాడి వయసు మూడేళ్లు. ఆఖరిది ఆడపిల్ల. రెండేళ్లు ఒకళ్ళా బళ్లోకి వెళ్లడం లేదు.

'మంచి నిద్ర పాడుచేశారు మాయదారి మూకా పిల్లలు' అనుకుని పాత పత్రిక తీసింది కృష్ణవేణి.

ఆమెకు రోజూ మధ్యాహ్నం ఒకగంట నిద్ర తియ్యడం అలవాటు. పనులన్నీ చేసుకుని ఒక్క గంట నిద్ర తీస్తే వొళ్ళు తేలికగా వుంటుంది. తరవాత మళ్ళీ ఎంతపనయినా చేసుకోవచ్చు.

కావ్ కావ్ కావ్ — అవి కేకలు.

వొళ్లు కంపరం ఎత్తిపోయింది.

విసురుగా ఇవతలికి వచ్చి — "మీకేమన్నా బుద్ధుందా లేదా ? ఆ కాకి గోలేమిటీ ?" అని గట్టిగా గసిరింది.

ఆ కేకకు ఆమెకే నీరసం వచ్చింది గాని ఒక్కడూ బెదరలేదు.

"పళ్లెంమీద కొట్టొద్దన్నారుగా — కాకాట ఆడుకుంటున్నాం. కదురా —" అన్నాడు జగన్నాధం తమ్ముడితో.

జగన్నాధం అందరిలోనూ పెద్దవాడు. ముగ్గురూ చింపిజుట్టు వేసుకుని ముక్కు ఎగదీసు కుంటూ చూస్తున్నారు. ఎవ్వరికీ వొంటిమీద సరయిన బట్టల్లేవు. చెడ్డీలు మాత్రం వున్నాయి. మాపుకుంటారనీ, ఆటల్లో చింపేస్తారని వాళ్లమ్మ బట్టలు వెయ్యరు. ఎక్కడికైనా వెళ్లేటప్పుడే వాళ్లకి బట్టలు,

ఒకక్షణం ఆలోచించి— 'మేడమీదికి పొండి, కింద అల్లరి చెయ్యకండి—" అన్నది.

'పదరా—పోదాం--' అనుకుంటూ నలుగురూ మేడమీదికి వెళ్లారు.

రక్షించారు— అనుకుని యింట్లోకి వచ్చింది

ఏమీ తోచడంలేదు.

పాత పత్రికలో సినిమా బొమ్మలు తిరగేస్తూ కూచుంది.

సత్యమూర్తి కలక్టరాఫీసులో సెక్షన్ హెడ్డు. ఇద్దరు మగపిల్లలు. ఇద్దర్నీ ఉదయం తొమ్మిదయ్యేసరికి భోజనాలు పెట్టి, కారియర్లు కట్టి రిక్షామీద కాన్వెంటుకు పంపేస్తుంది సత్యమూర్తి కూడా భోజనంచేసి, టిఫిన్ బాక్సు పట్టుకుని పది గంటలకు సైకిలుమీద ఆఫీసుకు వెళ్లిపోతాడు. అతను ఆరు గంటలకుకాని రాడు. పిల్లలు అయిదు గంటలకు వస్తారు. కృష్ణవేణి పది గంటలకే మొగుడితోపాటు భోజనం చేసేస్తుంది. తరువాత ఇంట్లో చిల్లరపనులు చేస్తుంది. ఒక గంట నిద్రపోతుంది. అప్పుడు లేచి ఇంత కాఫీ పెట్టుకుని తాగి, తాపీగా సాయంత్రం వంట ప్రారంభిస్తుంది. ఇదీ ఆమె దైనందిన కార్యక్రమం.

వీక్లీలూ, నవలలూ చదువుతుంది. రేడియో పెట్టుకుంటుంది. ఎప్పి చేసినా పలకరించే మనిషి లేకపోతే ఎలా తోస్తుంది ? ఇరుగు పొరుగుల్లో సభ్యత లేకపోతే ఎంత యిబ్బంది ?

పక్కవాటాలో వున్నతని పేరు కృష్ణవేణికి తెలీదు. వూళ్లో చాలామందికి తెలీదు. మల్లిపువ్వునే పిలుస్తారందరూను. మనిషి తెల్లగా పాలిపోయినట్టుంటాడు. దీనికితోడు ఎల్లప్పుడూ తెల్లనిబట్టలే వేసుకుంటాడు. పళ్లు కొంచెం ఎత్తు. బట్టతల. అతని భార్య పేరు సుభద్ర. పీటా కామ్పులే. తడికలా వుంటుంది. దానికితోడు పూజలూ ఉపవాసాలూ జాస్తి. ఎప్పుడు చూసినా పది లంకణాలు చేసినదానిలా వుంటుంది. రెండు నెలల క్రితం గావును పిల్లలు పుట్టకుండా ఆపరేషను చేయించుకుంది. పనిపాటలు చెయ్యడానికి ముసలితల్లి ఎప్పుడూ యింట్లోనే వుంటుంది.

మల్లిపువ్వు ఆ పట్నంలోని అతి పెద్ద బ్రాందీ షాపు మేనేజర్. ప్రొప్రయిటరు అన్నీ అతనికే అప్పగించేశాడు. హోల్‌సేల్ షాపు. అతను రాత్రి పదకొండుకో పన్నెండుకో యింటికి వస్తాడు. ఉదయం ఎనిమిది గంటలకు లేస్తాడు. గంటసేపు మొహం కడిగి, నూతిదగ్గిరే స్నానం చేసి — రెండు డజన్ల యిడ్లీలో, డజను పెసరట్లో తిని — పెద్ద గాజుగ్లాసునిండా కాఫీ తాగి — మూరెడు పొడుగున్న లంకపుగాకు చుట్ట ముట్టించి, పదిగంటలకు షాపుకు వెళతాడు. ఒంటిగంట రెండుగంటల మధ్యన వచ్చి భోజనం చేసి మళ్లీ వెంటనే వెళిపోతాడు. పిల్లల సంగతి, పెళ్లాం సంగతీ ఏమీ పట్టించుకోడు.

మేడమీద గంతులు ప్రారంభించారు గుంటలు.

ఏం చేస్తుంది ? ఎంతకని గసురుతుంది ?

ముసలమ్మా సుభద్రా లోపల గదిలో తలుపులు వేసుకుని ఫ్యాన్ పెట్టుకుని పడుకుంటారు. కటకటాల తాళం లోపలినుంచి వేసేసి గుంటల్ని మాత్రం ఇవతలే వొదిలేస్తారు. ఇంట్లో చాలా పెద్ద వేపచెట్టుంది. అది ఎక్కడానికి వీలుగాలేదుగాని, వీలుంటే కోతుల్లా ఎప్పుడూ ఆ చెట్టుమీదే వుండేవాళ్లు. ఆ చెట్టు కింద కుళాయి వుంది.

ఆ కుళాయి మూతివిరిచేసింది ఈ గుంటలే.

పెద్దవాడు వీధిదీపం పగలగొట్టేస్తాడు. వాడు మహకానివాడు. ఎవ్వరూ బుద్ధిచెప్పరు.

"జాంపళ్లు జాంపళ్లా — అనకాపల్లి జాంపళ్లా —"

ఒక ముసలమ్మ జాంపళ్లబుట్ట నెత్తిమీద పెట్టుకుని — కేకలేస్తూ ఆ వీధిలోకి వచ్చింది.

బిలబిలాడుతూ కోతిమేళం మేడదిగింది.

"ఏయ్ ముసలమ్మా ఇలారా — బుట్ట దింపు — ఒరేయ్ నారిగా నువ్వు అమ్మని లేపరా" అని ఆజ్ఞ జారీచేశాడు పెద్దవాడు, జుట్టు ఎగదీసుకుని, ముక్కు చీదుకుంటూ.

కటకటాల దగ్గిర గోలగోల చేశారు. ముసలమ్మ యివతలికి వచ్చింది.

"ఎందుకురా అలామిడిసిరాలిపోతున్నారూ" అన్నది అవలిమ్మ్త.

ఆ వెనకవే సుభద్రకూడా వచ్చింది.

"జాంపళ్లా లేవ్వూ దిబ్బపళ్లా లేవు. నువ్వెళ్లిపో ముసలమ్మా" అని ఒక్క గసురు గసిరింది సుభద్ర తల్లి.

చిన్న పిల్లలు ఏడుపు లంకించుకున్నారు.

పెద్దవాడు కొంటావా కొనవా అని కేకలు ప్రారంభించాడు.

ఆడపిల్ల! నిండా రెండేళ్లుంటాయో ఉండవోకాని ఏడవడంలో మహా దిట్ట. ఊరూ నాడా ఎగిరిపోయేలా ఏడుస్తోంది. పిట్టకొంచెం కూత ఘనం. ముఖం అంతా నోరు చేసుకుని చెవులు పగిలిపోయేంత గట్టిగా ఏడుస్తోంది.

జాంపళ్లు తెచ్చిన ముసల్దానికి ఏమీ పాలు పోయిందికాదు.

పెద్దవాడు జగన్నాథం ఓ జాంపండు తియ్యనేతీశాడు.

రెండోవాడు చిందులుతొక్కుతూ ఏడుస్తున్నాడు. మూడోవాడు నేలపడి దొర్లేసి ఏడుస్తున్నాడు.

"జాంపళ్లా – జాంపళ్లు కొనూ" అని యమగోల చేసేస్తున్నారు.

"ఎలా యిచ్చేవు జాంపళ్లా" – అన్నది సుభద్ర యిక తప్పక.

"రూపాయికైదూ–" చూడండి ఎంతలేసి పళ్లున్నాయో – గొప్ప రుచిగల పళ్లు" అన్నది జాంపళ్ల ముసలమ్మ.

"రూపాయికైదా ? హవ్వ –" అన్నది సుభద్ర తల్లి.

"అయిదేనా – నాలుగియ్యి" అన్నాడు మూడోవాడు, వాడు ఎప్పుడు లేచాడో నేలమీంచి వాడికి మూడేళ్లేగాని గడుగ్గాయి.

"నోరు ముయ్యరా నారిగా –" అన్నది సుభద్ర.

వాడి పేరు శ్రీమన్నారాయణ. మల్లిపువ్వుకి వాడంటె వల్లమాలిన ఆపేక్ష. సుభద్రకు మంట వాడంటే.

"ఇచ్చేమాట చెప్పూ –"

"ఆరు తీసుకోండి – పెద్ద పళ్లు."

"రూపాయికారు–" అన్నాడు పెద్దవాడు.

"రూపాయికారు రూపాయికారు" అని గోల ప్రారంభించారు.

"చివరాకి నాలుగియ్యి–" అన్నది సుభద్ర.

జాంపళ్ల ముసల్ది సర్రునలేచి గంప నెత్తికెత్తుకుంది. జగన్నాథం చేతిలోని జాంకాయి కూడా లాక్కుంది.

"చాలు చాలులేమ్మా బేరవాడినావు మాగొప్ప. ఎప్పుడైనా జాంపళ్లు తిన్న మొఖమేనా ?" అని జాడించేసింది.

ఈ రెల్లివాళ్లతో వేట్లోనోరు పెట్టలేం– అని మనసులోనే పణుక్కుని "అగయితే



వెళ్లిపోకూ—ఎలా యిస్తావో మరోమాట చెప్పు—'' అన్నది సుభద్ర.

ముసల్ది గంప దించింది. సుభద్ర పండ్లు చూసింది.

''రూపాయి కెనిమిదిస్తాను. నీకు బోదపడితే పుచ్చుకో. నేకపోతే ఒగ్గి–'' అన్నది రెల్లిముసల్ది.

''నాలుగియ్యి మంచివి చూసి —'' అని లోపలికి వెళ్లి రూపాయినోటు తెచ్చింది సుభద్ర.

''రూపాయి పళ్ళు పుచ్చుకోండి—'' అన్నది ముసల్ది.

''వొద్దులే—'' అనేసింది సుభద్ర.

నలుగురూ నాలుగు జాంపళ్లు తియ్యనే తీశారు.

నోటు ఆకాశంవేపు పెట్టి చూసింది జాంపళ్ల ముసల్ది.

''జల్లిడనాగున్నాది. అన్నీ బొక్కలే. మరుకో లోటియ్యమ్మా —'' అని నోటు విసిరేసింది.

ఎంతపొగరు ఎంతపొగరు అనుకుని లోపలికి వెళ్లి అర్ధరూపాయిబిళ్ల తెచ్చి యిచ్చింది. ముసల్ది ''శాన మంచి బేరమే'' అనుకుంటూ వెళ్లిపోయింది.

నలుగురూ నాలుగు పళ్ళూ తింటున్నారు.

ముసల్ది అల్లంత దూరం వెళ్ళేక, పెద్దవాడు నిక్కరు జేబులోంచి పెద్ద జామకాయ తీశాడు. దోరగా ముగ్గింది.

''ఇందా —'' అని తల్లి చేతికిచ్చాడు, వజ్రమో వైఢూర్యమో తల్లికి కానుకగా యిస్తున్నంత గర్వంతో తల ఎగరేసి.

''ఓరి వెధవా యిదెక్కడిదిరా —'' అన్నది సుభద్ర నవ్వు మొహంతో.

''నీకెందుకూ తిను—''అన్నాడు జగన్నాథం.

''ముసల్దిగాని చూస్తే వీపు వాయిగొట్టేసును. నా నాయనే —'' అంటూ కొడుకు హస్తలాఘవానికి మెచ్చుకుని దోర జాంకాయ పుచ్చుకుంది.

* * *

''మా అమ్మ నాలుగు వెల్లుల్లిపాయలుంటే ఇమ్మన్నాది —'' అనుకుంటూ చెడ్డీ ఎగదీసుకుంటూ లోపలి గడపలోకి వచ్చాడు పెద్దవాడు

పది రోజుల క్రితం గ్లాసుడు పెసరపప్పు పట్టుకెళ్లి యిచ్చేరుకాదు. ఆమధ్య డబ్బాతో డబ్బాడు పంచదార. అంతకుముందు .. లాభం లేదు వీళ్లతో —

''వెల్లుల్లిపాయలు లేవని చెప్పు —'' అని పంపించేసింది కృష్ణవేణి.

ఆ వెనక సుభద్ర తల్లి — ముసలమ్మ వచ్చింది.

''ఒక్కపాయుంటే పెట్టుతల్లి తల్లి రేపు తెప్పించి యిచ్చేస్తానూ''

''లేవు మామ్మగారూ —''

## మీకో దణ్ణం

''పోపుంపెట్టి మరోసారి చూడు. అడుగున ఒక్క పాయ ఉండకపోదు.''

చచ్చినట్టు తెచ్చిచ్చింది కృష్ణవేణి. అప్పటిగ్గాని కదిలిందికాదు ముసలమ్మ.

ఇది అడుగుతారు ఇది అడగరూ అనిలేదు— అన్నీ అప్పే. మరి తీర్చరు సాధారణంగా. అడిగితే చిరాకు, అడగకపోతే పరాకు. ఎలా చావడం వీళ్లతో ? తలకాయి పట్టుకుకూచుంది.

ఒకసారి సుభద్రా వాళ్లింటికి చుట్టాలొచ్చారు. స్టీలుగ్లాసుతో స్టీలుగ్లాసుడు కందిపప్పు పట్టుకెళ్లారు. నెల్లాళ్లయింది. ఇవ్వలేదు. చివరికిక తప్పక నిజంగానే అవసరం వచ్చింది అడిగింది కృష్ణవేణి.

''ఇచ్చేస్తాంలే అమ్మా —అప్పు తీసుకున్నాక తప్పుతుందా ? వుంచేసుకోం యిచ్చేస్తాం'' అని దీర్ఘాలు తీసింది ముసలమ్మ.

మర్నాడు మరోసారి జ్ఞాపకం చేస్తే, తెప్పించి యిచ్చింది.

మాది మాకిచ్చుటే మడిమాన్యాలిచ్చుట !

ఒకసారి యిప్పుడే యిచ్చేస్తామని కత్తెర పట్టుకెళ్లి విరిచేసి యిచ్చారు.

''పిల్లలున్న యిల్లు తల్లీ— ఏమీ అనుకోకు. కొనిచ్చేస్తాంలే'' అన్నది ముసలమ్మ.

''వాళ్లు కొనిచ్చారూ మనం పుచ్చుకున్నాము. రెండూ నిజమే. పోన్లే'' అన్నాడు సత్యమూర్తి.

నోరు మూసుకుని వూరుకుంది కృష్ణవేణి. ఏం చేస్తుంది.

బియ్యం, కిరసనాయిలు, కూరగాయలు, గాజుగ్లాసులు, కత్తెర, మాది, పప్పులు అప్ప

డప్పుడు చిల్లర డబ్బులు — ప్రతీదీ అప్పే. ఎలా అడుగుతారో తెలీదు కృష్ణవేణికి. ఆమె మాత్రం ఎన్నడూ ఇంకో యింటికి అప్పుకు వెళ్లదు. అన్నీ యింట్లోనే అమర్చుకుంటుంది. సత్యమూర్తి కూడా ఎన్నడూ ఎవర్నీ అప్పు అడగడు. కొట్లో మీద పద్దులు పెట్టడు. ఉన్నంతలోనే జాగ్రత్తగా కాలక్షేపం చేస్తాడు.

మేడమీద బట్టలారేస్తే తొక్కేస్తారు. తాడుమీద ఆరేసి ఓ కంట కనిపెట్టవలసిందే. లేకపోతే ఆరేసిన బట్టల్లో ముక్కలు చీదేస్తారు.

ఒడియాలుగాని. అప్పడాలుగాని ఎండబెడితే పచ్చివే తినేస్తారు. కాకుల భయం కంటే ఈ పిల్లకాకుల భయమే ఎక్కువ కాపలా కూచోవలసిందే.

మల్లిపువ్వు రాత్రి వచ్చేటప్పుడు నలుగురికీ నాలుగు పొట్లాలు తెస్తాడు. పకోడీలో, కారప్పూసో, స్వీటో — లేకపోతే నాలుగు ముకిరీ అరటిపళ్లో - ఏవో తెస్తాడు. అర్ధరాత్రివేళ గోల చేసుకుంటూ తింటారు.

ఆ గోలకి కృష్ణవేణికి నిద్ర మెలుకువ వొచ్చేస్తుంది. ఒకోసారి మరి నిద్ర పట్టదు.

పిల్లల్ని పాడుచేస్తున్నది పెద్దవాళ్లు కాదూ ?

* * *

మల్లిపువ్వు బాగా ఎండెక్కి లేస్తాడు. మనిషి దగ్గర అదోకరకం గబ్బువాసన. అంత దూరం కొడుతుంది. దానికితోడు ఎప్పుడూ మట్టలు. బ్రషునిండా పేస్టు పెట్టుకుని గంటన్నరసేపు నురగ కార్చుకుంటూ మొహం కడుక్కుంటాడు. నోట్లో నీళ్లు పోసుకుని ఖ్యాఖ్యాఖ్యా ఓక్ ఓక్ అని భూమి ఆకాశం దద్దరిల్లిపోయేలాగ చప్పుడు చేస్తాడు

కృష్ణవేణి అతను పెరట్లోకి వస్తే ఇంట్లోకి వచ్చేసి తలుపు చేరేసుకుంటు ఆ ఘోరమైన చప్పుడూ, గబ్బువాసనా అస్సలు భరించలేదు.

బకెట్లు, తడిపిన బట్టలు, చెంబూ, సబ్బూ అన్న మాతిదగ్గరే వొదిలేసి పోతారు.

మొదట్లో ఒకటి రెండుసార్లు చెప్పి చూసింది ''పక్కకి తియ్యండి బక్కెట్టూ చెంబునూ'' అని. వినిపించుకుంటేగా ?

చచ్చినట్టు — అసహ్యించుకుంటూనే అవన్నీ పక్కకిసర్ది, రెండు చేదల నీళ్లు నూతి పళ్లెం మీద పోసి కడగకపోతే — అడుగుపెట్టడానికి కంపరంగా వుంటుంది.

ఒకోసారి అంట్లు కూడా నూతి దగ్గిర తోమేస్తారు. నీళ్లు పొయ్యరు. ఆ ఎంగిలి మెతుకులన్నీ ఎలా కడుగుతుంది. ముక్కు మూసుకుని బక్కెట్టుతో నీళ్లుకొట్టి బాగు చేస్తుంది.

''ఇదెక్కడ పారుగండీ బాబూ — యిల్లు మార్చేద్దురూ— మరో యిల్లు చూడండి'' అంటుంది కృష్ణవేణి భర్తతో.

## బంతీ ! చామంతీ !

కన్నీటిచుక్క  
బంతిపువ్వు గుండెల్లో దూరి  
వెచ్చగా  
పలకరించింది —  
మంచుబిందువు  
చామంతి మనసులోకి  
మెల్లగా జారి  
చల్లగా పలకరించింది —  
పలకరింతకి  
పులకరించిన బంతీ చామంతీ  
నవ్వి  
వికసించటం నేర్చుకొమ్మన్నై —  
కన్నీటిచుక్క  
రగిలి చైతన్యంగా వికసించింది  
మంచుబిందువు  
కరిగి కిరణమై భాసించింది !!!

— రామసూరి

"బజారుకు దగ్గిర. సినిమాహాళ్లు రెండూ ఈ దగ్గిరలోనే వున్నాయి. పోస్టాఫీసు కూడా పక్కనే వుంది. ఇంత అనుకూలమైన యిల్లు నూటఆరవై రూపాయల అద్దెకు ఈ మహా పట్నంలో దొరకదు. ఎలాగో సర్దుకుపోవాలి." అని నచ్చజెబుతుంటాడు సత్యమూర్తి. ఏం చేస్తాడూ ? మరింకో యిల్లు చూడ్డం అంటే సామాన్యమా ?

సుభద్ర కొకసారి జబ్బు చేసింది. వారం రోజులు లంకణాలు చేసింది. డాక్టరుకు చూపించి టానిక్కులు కొన్నారు. ఆ సీసా చాలా అందంగా వుంది. ఎలా తీసేరో ఆ సీసా తీసేసి మేడమీదికి పట్టుకుపోయేరు పిల్లలు.

"ఎంత బావుందో చూడ్రా సీసా" అన్నాడు జగన్నాధం.

"ఏముందిరా యిందులోనూ ?"

"తేనె అయి వుండొచ్చున్రా."

"తేనె! తేనె భలే బావుంటుందిరా. నాక్కొంచెం పెట్టవురా? అన్నయ్యా—నాక్కొంచెం పెట్టవురా —"

"గొడవ చెయ్యకండి. అందరికీ పెడతాను."

సీసా మూత కొరికేసి వూడదీసేశాడు. కొంచెం నోట్లో వేసుకు చూశాడు. బలే తియ్యగా వుంది.

సీసా వెదుక్కుంటూ — పిల్లలే తీసి వుంటారని నిర్ధారణ చేసుకుని యింట్లో ఎక్కడా కనపడక మేడ మెట్లెక్కిందిసుభద్ర.

తలాకాస్త నాకనే నాకేశారు. సీసా సగానికే వుంది టానిక్కు.

"పోరంబోకు వెధవల్లారా — మీకేం పోయీ కాలంరా. మీ అమ్మ కడుపు కాలిపోనూ — రౌడీ వెధవల్లారా. సీసా ఎందుకు తీశార్రా ఏం పాడు బుద్ధులు పుడుతున్నాయిరా మీకు — ఎలాగమ్మా వీళ్లతోనూ" అని అరుచుకుంటూ నలుగుర్నీ చేతికొచ్చినట్టు బాదింది. వాళ్లు మేడంతా పరుగెత్తించేరు సుభద్రని. ఆ గోలలో సీసాలో వున్న తక్కిన టానిక్కుకూడా ఒలికిపోయింది. నలుగురూ ఒకేసారి ఏడుపు లంకించుకున్నారు. వాళ్లని తన్నుకుంటూ మేడ దించింది. ఏడుపు మానరే ? ఏడుపు ... ఒకటే ఏడుపు — ఏడుపంటే ఏడుపుకాదు—ఊరూ వాడా దద్దరిల్లి పోతోంది. ఆ గోలకి వీధిలో జనంకూడా చేరారు.

సుభద్రకు సిగ్గేసిపోయింది.

"మాయదారి సంతానం — మాయదారి సంతానం."

ఆవిడకి ఏడుపొచ్చేస్తోంది. కళ్ల నీళ్లు గిర్రున తిరిగేయి. అసలే జబ్బుపడిలేచి నీరసంగా కూడా వుంది. నేలమీద చతికిలబడిపోయింది.

ముసలమ్మ వచ్చి పిల్లల్ని వూరుకోబెట్ట బోయింది.

ఆ సమయంలో ఆపద్బాంధవుడిలాగ ఐసు బండివాడు గంటవాయించుకుంటూ వచ్చాడు.

తలా ఒక ఐసూ యిప్పించేసరికి నలుగురి నోళ్లూ మూతపడ్డాయి.

"హమయ్య — ఈనాటికిలా నా ప్రాణం కాపాడేవ్రా నాయిన్నారా" అనుకుని స్థిమిత పడింది సుభద్ర.

అదంతా పక్కవాటాలోంచి చూస్తూ — నవ్వాలో ఏడవాలోకూడా తెలీలేదు కృష్ణవేణికి.

కృష్ణవేణి కొడుకులిద్దరూ బుద్ధిమంతులు. పెద్దవాడు హరి. చిన్నవాడు గిరి. ఎర్రగా ముచ్చటగా వుంటారు.

ఇద్దరితోనూ ఆపరేషన్ చేయించేసుకుంటా నన్నాడు సత్యమూర్తి.

"ఆడపిల్ల పుట్టేక చేయించుకుందురు గాని ఆ ఒక్క ముచ్చటా తీరనివ్వండి" అన్నది.

"సరే కానిమ్మ"న్నాడు.

ఆమె ఇంటర్మీడియట్ ఇంగ్లీషు మీడియంలో పాసయింది. పిల్లలిద్దరికీ తనే చదువు చెప్పుకుంటుంది. ఇప్పుడేకాదు టెన్త్ క్లాసుకు వచ్చేవరకూ కూడా తనే చెప్పగలదు. వాళ్లది చాలా ఆదర్శవంతమైన సంసారం.

సత్యమూర్తి అదృష్టవంతుడే. ముప్ఫయి ఆరేళ్లకు సెక్షన్ హెడ్ అయికూచున్నాడు. పన్నెండు వందలు జీతం.

* * *

ఆఫీసుకు బయలుదేరుతున్నాడు సత్యమూర్తి.

సైకిలు తీశాడు. వెనక చక్రానికి గాలి లేదు. పక్కింటి గుంటలు గోడవార చేరి నవ్వుతున్నారు.

గాలి తీసేశారు.

సత్యమూర్తికి వెర్రికోపం వచ్చింది. చేతి కందలేదుగాని, లేకపోతే చితక్కొట్టేసిపోను.

"మీకేం బుద్ధీ జ్ఞానం వుందా లేదా ? సైకిలుజోలికి ఎందుకు వచ్చేరు. ఈసారి వచ్చేరంటే చూడండి. ఏం చేస్తానో —" అని కళ్లెర్రజేసి కేకలు వేశాడు. అంతటితో కోపం అణుచుకున్నాడు.

ఉసూరుమని సైకిలు జంక్షనుదాకా నడిపించుకుని వెళ్లి గాలి కొట్టించి ఆఫీసుకు వెళ్లాడు. పదకొండయింది. తానే సెక్షన్ హెడ్డు కాబట్టి సరిపోయిందిగాని లేకపోతే చాలా చిక్కునచ్చి పడిపోను.

సత్యమూర్తి అలా వెళ్లగానే నలుగురు పిల్లల్నీ ఇంట్లో పెట్టి మెత్తగా చితగ్గొట్టేసింది సుభద్ర.

"అయ్యయ్యో— ఇహ చాల్లే వూరుకోండి" అన్నది కృష్ణవేణి, కటకటాలయివతలనించే.

"ఈ పిల్లల్తో నాకు చావొచ్చిందికాదూ పోనీ ఏదో పిల్లలుకదా అని వూరుకున్నారా ? యివ్వాళ మీవారు ఎంతమేసి మాటలన్నారూ—" అని మొదలు పెట్టింది సుభద్ర.

సత్యమూర్తి కేకల్ని వుద్దేశించి ఆమె మాట్లాడుతోంది.

"ఆయనేమన్నారూ ? కాని మాటలేమీ అనలేదే. సైకిలుజోలికి ఎందుకొచ్చారూ బుద్ధి లేదా అన్నారు. అంతేగా. ఏమన్నా చెయ్యి చేసుకున్నారా బూతులు తిట్టారా ?" అని లేచింది కృష్ణవేణి. ఆమెకు వొళ్లు మండిపోతోంది. తగువు రావడం మంచిదే.

"ఇంకా బూతులుకూడా తిట్టాలా ? ఆ మాటలు చాలదూ ? పిల్లలన్న తరవాత ఏదో






## ఇవేమన పద్యాలు




పుస్తకములు జడలు పులితోలు బెత్తంబు
కక్షపాలలు పది లక్షలైన
మోత చేతేగాని మోక్షంబు లేదయా
విశ్వదాభిరామ వినుర వేమ.

అల్లరి చేస్తారు. దానికే అంతలేసి మాటలనె య్యాలా —'' అని రెట్టించింది సుభద్ర.

కృష్ణవేణి కూడా వూరుకోలేదు. పిల్లలెంత అల్లరి చేస్తున్నారో చెప్పింది. వెనకటి వచ్చి తప్పింది. ఒకసారి సత్యమూర్తికి జ్వరం వచ్చి పడుకుంటే ఎంత అల్లరి చేశారో. కొత్త నవ్వారు పట్టీ కోసేసి ఆ ముక్కలో గుర్రపు కళ్ళెంచేసి ఎలా ఆటలాడారో చెప్పింది.

తగువు ముదిరిపోయింది.

## మీకో దణ్ణం

చివరికి సుభద్ర పిల్లన్ని తీసుకుని యింట్లోకి వెళ్ళిపోయింది. సాయంత్రం వరకూ ఇవతలికి రానివ్వలేదు వాళ్ళని.

మరీ మంచిదనుకుంది కృష్ణవేణి.

*       *       *

ఇది జరిగి నెల్లాళ్ళయింది.

మళ్ళీ మామూలు పాటే.

సుభద్ర ఎప్పుడైన వెళితే సినిమాకి వెళ్తుంది తప్ప, మరెక్కడికీ వెళ్ళదు. ఇరుగింటికీ పొరుగింటికీ కూడా వెళ్ళదు — కొంత వరకూ పిల్లలకు భయపడే.

ఒకోసారి పిల్లల అల్లరి గురించి ఆలోచిస్తుంది కృష్ణవేణి. తల్లిదండ్రులు బుద్ధి చెప్పక పోవడం కొంత కారణం. పిల్లలకు ఆడుకుందుకు స్థలం ఏదీ ? ప్రతి పేటలోనూ, ప్రతి కాలనీ లోనూ పిల్లలకు కొంత ఆటస్థలం వుండాలి. ఇది ఎప్పటికీ జరిగే పని కాదు.

కృష్ణవేణి మాట్లాడినా తగువాడినా సుభద్రతోనే.

ఒక పక్క సుభద్రా వాళ్ళింటే, రెండో పక్క సగం సగం కట్టి వదిలేసిన పెద్ద బిల్డింగు వుంది. ముందు ముళ్ళకంచెలు వేసేశారు. ఆ పక్కనే పోస్టాఫీసు. ఇంటి ఎదురుగా కాపురాలుండే యిళ్ళులేవు. అవేవో గోడౌన్లు. అప్పుడప్పుడు లారీలు వస్తుంటాయి. ఇహ ఎవరింటికి వెళ్తుంది కృష్ణవేణి ?

ఎదురుగా అద్దం పెట్టుకుని తీరుబడిగా తలచిక్కు తీసుకుంటూ కూచుంది. సుభద్ర వచ్చింది. రాకరాక వచ్చింది. ఇద్దరూ కాసేపు కబుర్లలోకి దిగారు. ఇంతలోకి వచ్చేసింది వానర సైన్యం. తలుపులు బార్లా తీసే వున్నాయి. యింట్లోనే ఆటలూ, పరుగులూ ప్రారంభించేరు.

"కొంచెం కొబ్బరిమానె పొయ్యి తల్లీ—" అని ముసలమ్మ వచ్చి కొబ్బరిమానె పోయించుకు వెళ్ళింది. ఎదురుగా సీసావుంది. లేదని ఎలా అంటుంది ?

చిన్నపిల్ల అద్దంలో అందాలు చూసు కుంటూ అద్దంకాస్త జారబెట్టింది నిలువునా బీటతీసింది. ఎంతమంచి అద్దం !

"ఎంతపని చేసేవే కోతిముండా'' అని ఆ పిల్లని నాలుగుబాది, యింట్లోకి లాక్కుపోయింది సుభద్ర.

కాస్సేపటికి ముసలమ్మ వచ్చి — "అద్దం ఎంతో చెప్పండి. కొనిపించి యిచ్చేస్తుందట'' అన్నది.

"వొద్దులెండి'' ఆపేసింది కృష్ణవేణి. ముసలమ్మ మాట్లాడకుండా వెళ్ళిపోయింది. ఇంతకు ఎన్ని పగులగొట్టి ఎన్ని కొనిచ్చారూ ?

నిజంగా ఏ రోగిష్టి మనిషో, గుండె నీరసం మనిషోగాని వుంటే ఈ గోలకి వెంటనే చచ్చివూరుకుంటాడు — అనుకుంది కృష్ణవేణి, మనసులోనే.

మేడమీద పిల్లలు గోల ప్రారంభించేరు. గోలంటే, గోలకాదు. గంతులూ కేకలూను.

వాళ్ళని కోప్పడి ఏం లాభం తల్లిదండ్రీ వొదిలేసినప్పుడు ?

"మీకో దణ్ణం. నా వల్లకాదు ఈ గోల భరించడం'' అని కళ్ళు మూసుకుని రెండు చేతులూ జోడించింది కృష్ణవేణి. ★

# సర్వమతాలకు స్వాగతాలయం!



శ్రీ భంభం స్వాముల ఆశ్రమ పీఠ ముద్రిక

సర్వ మతాల కలయికకు నిలయమైన ఆశ్రమం, సర్వ మతాలకు స్వాగతాలయంగా రూపుదిద్దుకొంటున్న ఆశ్రమం అనంతపురం జిల్లాలోని రాయదుర్గంలో జూనియర్ కళాశాలకు ఒక కిలో మీటరు దూరంలో వుంది అదే శ్రీ భంభం స్వాములవారి ఆశ్రమం గత మూడు సం॥ల నుండి ఈ ఆశ్రమం ప్రగతిపథంలో పయనించడం ముదావహం ఇది దరగా అయినా సర్వ మతాలవారు ఇచ్చట పరస్పరం ప్రేమానురాగాలతో తమ తమ పద్ధతులలో ప్రార్థనలు జరుపుతారు సర్వసాధారణంగా దరగా పద్ధతులయితే పూజలు, కుంకుమధారణ, యుండదు కాని ఇక్కడ హిందువులు టెంకాయలిస్తారు ముస్లింలు ''ఫాతేహా''లు చదివిస్తారు ఈ సమాధి భంషేక్ అబ్దుల్ వహాబ్ సాహెబ్‌గారి దంపతులది ఈ ఆశ్రమంలో హూండీలేదు మంగళారతిలో దక్షిణలు స్వీకరించరు ఇచ్చట ప్రతి పూర్ణిమ రోజున వందలాది భక్తాదులు రాతిరంతా శ్రీ స్వామివారి తత్వాలు చెబుతూ భజనలు చేస్తారు ఇటీవల భక్తిరసప్రదమైన చలనచిత్రాన్ని చూపుచున్నారు (పూర్ణిమ రోజున మాత్రమే) శ్రీ స్వామివారి సమాధి వెనుక వారి ఫొటో స్పష్టంగా కనబడుతుంది ప్రతి సోమ, గురువారాల్లో వందలాది భక్తులు, పూర్ణిమ రోజు వేలాది భక్తాదులు శ్రీ భంభం స్వాముల ఆశ్రయాన్ని సందర్శిస్తున్నారు

అబ్దుల్ వహాబ్ సాహెబ్‌గారి గురువులు శ్రీ సయ్యద్ సుల్తాన్ మొహిద్దీన్ ఖాదర్‌గారు వీరికి హిందూ ధర్మముపై మక్కువ ఎక్కువగా యుండెడిది వీరు 'భంభం' అంటూ వీధులలో తిరిగి ఎన్నో మహిమలను చూపించారట వీరి సమాధి చిప్పగిరి గ్రామములో నున్నది ఖాదర్‌గారి వరపుత్రులు, శిష్యులు అయిన అబ్దుల్ వహాబ్‌గారు హిందూ ధర్మముపట్ల ఆసక్తిని చూపించి, సర్వమత సహనానికై కృషి చేసారు వీరు కూడా కొన్ని మహిమలను చూపించారు అబ్దుల్ వహాబ్‌గారు జమేదార్ పోలీసు ఉద్యోగాన్ని నిర్వహిస్తూ, – అధ్యాత్మిక తత్వాలు వ్రాసి, సాధారణమైన జీవనం గడిపారు వీరు 1969లో రాయదుర్గంలో సమాధి చెందారు ఈ భంభం స్వాములవారి మహిమలను భక్తాదులు కోకొల్లలుగా చెబుతూంటారు

ప్రస్తుతం ఈ ఆశ్రమ పీఠాధికారులు శ్రీ అన్వర్–భాషాగారు వీరు తత్వశాస్త్రంలో ఎం ఎ పాసయ్యి, కర్నాటక రాష్ట్రంలోని బళ్ళారి జిల్లాలో లెక్చరర్‌గా పని చేస్తున్నారు వీరు పదిమతాల చిహ్నాలను కలిపి, ఈ ఆశ్రమ పీఠముద్రికను తయారు చేసారు ఈ ఆశ్రమ ఆవరణములో ఫలకములపై పదిమతముల సారము, బైబిలు, ఖురాను సూక్తులు, భగవద్గీత శ్లోకాలు వ్రాయబడి యున్నవి ఉద్యోగం చేస్తున్నందువల్ల వీరు తరచుగా ఆశ్రమానికొస్తూ వుంటారు వీరు వీనుల విందైన ఉపన్యాసములివ్వడంలో ఉద్దండ పండితులు, స్వయంకృషితో వీరు ఈ ఆశ్రమాన్ని సర్వమతాలకు స్వాగతాలయంగా రూపొందించుచున్నారు

ప్రతి సంవత్సరం ఫాల్గుణ శుద్ధ దశమి నుండి ఫాల్గుణ శుద్ధ పౌర్ణమి వరకు ఇచ్చట శ్రీ స్వామివారి ఆరాధన, బ్రహ్మోత్సవాలు జరుగుతాయి 1984 ఈ సంవత్సరం మార్చి 12 నుండి 17వ తేది వరకు ఉత్సవాలు జరుగుతాయి ఈ సమయాన కర్నాటక మహారాష్ట్ర, తమిళనాడు తదితర సుదూర ప్రాంతములనుండి వేలాది భక్తాదులు విచ్చేస్తారు అపుడు శ్రీ స్వామివారు (అన్వర్ భాషా) ఊరేగింపులో పాల్గొంటారు సర్వ మతాలకు చెందిన ప్రార్థనలు, తత్వాలు, భక్తి గీతాలు, మిమిక్రీ మొదలయిన కార్యక్రమాలు జరుపుతారు ఈ రోజున వరకట్న రహితమైన వివాహాలు వారివారి మతాల పద్ధతుల అనుసారం పీఠాధికారులు, తమ స్వయార్జితమైన సంపాదనతో జరుపుతారు

సర్వమానవ కళ్యాణం, నవసమాజ నిర్మాణం తమ ఆశ్రమధ్యేయమని అంటారు ఆయన ప్రతి సం॥రం ఉగాదప్పుడు 41 రోజులు వీరు 'తపోనిలయం'లో యోగ సమాధిలో యుంటారు అపుడు పాలు తప్ప మరేమీ తీసుకోరు కులమతాల కతీతమైన ఇలాంటి ఆశ్రమంలో భక్తులకు నిర్మలమైన శాంతి లభిస్తుందంటే అతిశయోక్తి కాదు గదా!

ఫొటో, వ్యాసం → జయసుమన్

రాయదుర్గంలోని శ్రీ భంభం స్వాముల ఆశ్రమం



సీరియల్

# కర్మయోగి

డా॥ కె.వి. కృష్ణకుమారి

*(గత సంచిక తరువాయి)*

మేనమామ తత్వం తెల్సున్న కృష్ణారావు పట్టించుకోలేదు.

గంగాజలం పట్టుకుని రామకృష్ణయ్య దగ్గర కూర్చున్నాడు.

ఎముకల గూటిలో జీవం వున్నట్టు గుండె భారంగా కదులుతోంది.

శుష్కించినా ఆ వదనం కాంతి పుంజంలా మెరుస్తోంది.

కాంతి విహీనమైన ఆ కళ్లల్లో మిణుగురుల గుంపులు కన్పిస్తున్నాయి.

పచ్చగా పాలిపోయిన ఆ చెక్కిళ్లు కూడా వింత అందాన్ని సంతరించుకున్నట్టున్నాయి.

''అన్నయ్యా !''

కృష్ణారావు గొంతు పీలగా వొణికింది.

''అన్నయ్యా...''

పలుకుతాడన్న ఆశలేదు.

ఐనా ధైర్యాన్ని కూడగట్టుకున్నాడు.

అన్నయ్య లాంటి వ్యక్తికి ఆఖరి దశలో ఇటువంటి చావు రాకూడదు. మనిషి స్మారకంలోకి రాకూడదా ?

ఆయన కోరిక ప్రకారమే — కృష్ణధ్యానంలోనే ప్రాణం పోకూడదా ? ఇంతటి తపస్సుకి ఆ మాత్రం వరం దొరకరానిదా ?

ఎదురుగా పూజామందిరం.

అందులో గోలోకాన్ని అమర్చుకున్నాడు రామకృష్ణయ్య.

ఆ మందిరం విచిత్రంగా వుంది.

గోలోకంలో — రాధాకృష్ణుల రాసక్రీడల కోసం — మహాద్భుతంగా మలచిన పవిత్ర మందిరంలా వుంది.

శ్రీకృష్ణ వదనం కాంతి పుంజాలను వెదజల్లుతోంది. రాధాదేవి చిత్ర విచిత్రమైన కళలతో అత్యద్భుత సౌందర్య రాసిగా విరాజిల్లుతోంది. రాధిక కళలతో విలసిల్లుతున్న గోపికా మణులలో చిద్విలాసంగా కన్పిస్తున్న శ్యామసుందరుని విగ్రహం చూసిన కొద్దీ మైమరపు కలిగిస్తోంది.

పీతాంబర ధారియై — చేత మురళితో, శ్రీవత్సాంకము, కౌస్తుభహారమూ, వనమాలికలతో, కోటి సూర్యప్రభాతమానుడైన ఆ దివ్య శ్యామసుందరమూర్తి — రాధతో—చుట్టుముట్టిన గోపికలతో — క్షణకాలం కళ్ళముందు నిలిచారు.

తన్మయతతో తన ఉనికినే మర్చిపోయాడు కృష్ణారావు.

''అరె ..చూస్తున్నాడు...చూస్తున్నాడు''

తృళ్ళిపడ్డాడు.

ఆశ్చర్యంతో కళ్ళు వెడల్పయాయి.

విస్మయతను మించిన ఆనందంతో వెలుగును నింపుతున్నాయి.

అవును. అన్నయ్య చూస్తున్నాడు ...

ఆర్తితో చూస్తున్నాడు.

ఆరాటంతో చూస్తున్నాడు.

తపనతో చూస్తున్నాడు.

**జరిగిన కథ—2 :** తులసమ్మ కుమారులు రామకృష్ణయ్య, కృష్ణారావు. రామకృష్ణయ్య కృష్ణ భక్తుడు. భార్య కళ్లలోకూడ ఆయనకు నీలమేఘశ్యాముని దివ్యరూపమే కన్పిస్తుంది. కృష్ణారావుకి సంగీతం అంటే ప్రాణం. వీరిద్దరి ప్రవర్తన చూసి తల్లి తులసమ్మ తమవారిపై పెంచుకొన్న ఆశలు తీరవేమో అని భయపడింది. తులసమ్మ కృష్ణారావుని వంశం నిలపమని వేడుకొంటుంది. తల్లి కోరిక అన్నతోచెప్పి ఆయన సలహా అడుగుతాడు కృష్ణ. అడిగిన వాళ్లకు రాధ మాధవుల తత్వం బోధించమని కృష్ణను కోరుతాడు రామకృష్ణయ్య. అన్న పరిస్థితి బాగలేదని తల్లిని, వదినను వచ్చి చూడమంటాడు కృష్ణ.

రెట్టించిన తన్మయతతో చూస్తున్నాడు.

సంభవమా ? మామూలుగా అయితే ఇది సంభవమేనా ?

కాంతి విహీనమైన ఆ కళ్ళల్లో ఇంత కాంతి ఎక్కడ్నుంచి వచ్చింది ? జీవాన్ని కోల్పోయేటట్టున్న ఆ కళ్ళల్లో ఇంత వెలుగేమిటి ?

ఇదంతా దైవ కృపేనా ?

అన్నయ్య కోరిక నెరవేరబోతోందా ?

ఎందుకు నెరవేరదు ???

''కృ .. ష్ణా ''

''కృష్ణా—''

ఆనందంలో ఉక్కిరిబిక్కిరయాడు కృష్ణారావు.

అన్నయ్య మాట పోలేదు. ఆఖరి క్షణం దాకా పోదు ఆ ధైర్యం—ఆ తృప్తీ కొండంత బలాన్నిచ్చాయి.

''కృష్ణా .''

ఈసారి రామకృష్ణయ్య పెదాలు స్పష్టంగా కదులుతున్నాయి.

''నా రాధాకృష్ణులు కనిపించారు కదూ. వారి రాసలీలలు నువ్వు స్పష్టంగా చూశావు కదూ... అవునా ?— అందుకేనా, నా రాధాకృష్ణుల్ని వొళ్ళు మరచి స్తుతించావు. కృష్ణా నీ పిలుపు పోతున్న నా ప్రాణాల్ని మళ్ళీ లాక్కు వచ్చిందా ? నాలోంచి ఆత్మ వేరు కాలేదా ? నా దైవంలో కల్సిపోలేదా ? ఈ అస్థిపంజరంలో ఇంకా ఊపిరి వుందా ?''

రామకృష్ణయ్య స్పష్టంగా మాట్లాడుతున్నాడనీ ఇంకా ప్రాణం పోనందుకు విచారిస్తున్నాడనీ . గుండెలు పగిలేలా ఏడుస్తున్నాడనీ క్షణాలమీద ఇంటా బయటా పాకిపోయింది.

'చావు తెలివిలో కూడా ఇంత తెలివుంటుందా ?' అన్న ఆశ్చర్యార్థకం మిగిలిపోయింది.

ఆ గదంతా తీర్థ ప్రజలా నిండిపోయారు.

పైకి అనలేకపోతున్నారుగానీ ప్రతీ ఒక్కరి మనసులోనూ అద్భుతమైన స్పందన ఎవరికి వారికే స్పష్టంగా తెలుస్తోంది.

పవిత్ర దేవాలయంలో— దైవసన్నిధిముందు భక్తిపారవశ్యంతో మూర్ఛపోయిన అగ్నిశిఖలాగే కన్పిస్తున్నాడు రామకృష్ణయ్య.

'జబ్బుతో తీసుకుంటూ— ఏ క్షణానో కన్ను మూయబోయే కళేబరాకారంలా కన్పించడంలేదు.

రామకృష్ణయ్య కన్నీళ్ళు ధారాపాతంగా కురుస్తున్నాయి

గంగకున్న పవిత్రతను సంతరించుకున్నట్టుంది.

కృష్ణనామామృతంతో పునీతమయే ! ఆ పెదాలు చిన్నగా విచ్చుకున్నాయి.

నిశ్శబ్దతకూడా ఆత్రంగా గాలిని స్తంభింప జేసినట్టుంది.



రామకృష్ణయ్య పెదాలు అందంగా వొంకర్లు తిరిగాయి.

"ఎన్నాళ్లో గతియించె ఎన్నోజన్మలు పోయె
ఏమి సాధించితి గోపాలకృష్ణా!
పలుకైన పలుకవా, కులుకైన చూపవా
గోపాలకృష్ణా! శాస్త్రంబు లెరగరు
వేదంబు లెరుగరు ఛందంబు లెరుగరు
యోగంబు లెరుగరు దానంబు లెరుగరు
గోప బాలురతోడ గూడి వల్కితివేర
పలుకైన పలుకవా గోపాలకృష్ణ
ఎన్నాళ్ళూ గతియించె ఏమి సాధించితి
పాండిత్య మదమునా గోపాలకృష్ణా!
శాస్త్ర వాసనచేత గోవింద కృష్ణా!
నిన్ గూర్చి తలపోయ...నిన్ గూర్చి చింతింప
మాతృగర్భము చొచ్చి క్రుగ్గి యుండగలేను.
ఎట్లు రక్షించెదవో... ఎట్లు శిక్షించెదవో
ఎట్లు పోషించెదవో గోపాలకృష్ణా..."

ఆవేదన ఒక్క కృష్ణారావుకే అర్థమౌతుంది.

ఆయన్లో వేదన ఒక్క కృష్ణారావునే కలచివేస్తోంది.

అలిసి కళ్ళముందు అన్నయ్య రూపం కన్పించటంలేదు.

రామకృష్ణయ్యలో విచిత్రంగా కృష్ణ చైతన్యస్వామి దివ్య మంగళరూపం ముగ్ధమోహనంగా, ఆర్తితో — ఆవేదనతో — ఆరాటంతో — విరహాన్ని ఆపుకోలేని బేలతనంతో తమకంతో శ్రీకృష్ణుని కోసం పరితపిస్తున్నట్టు కన్పిస్తోంది.

ఆ దివ్యవాణి స్పష్టంగా విన్పిస్తున్నట్లు అన్పిస్తోంది.

రామకృష్ణయ్య పెదాలు కదులుతూనే వున్నాయి.

కొన్ని వందల సంవత్సరాలకు పూర్వం బంగాళా దేశంలో వున్న నవదీప పట్టణం ఆధ్యాత్మికంగా పూర్తిగా నేలమట్టమైన సమయంలో — నాస్తికత్వం వెర్రితలలు వేస్తున్న సమయంలో—

'యదాయదాహి ధర్మస్య గ్లానిర్భవతి
భారత...'

అన్న వేదవాక్కు ననుసరించి మోక్ష ధర్మాలకు హాని కల్గించే ఆ పట్టణంలో ఆ ప్రమాద సమయంలో గౌరంగా బాలుడై — శ్రీకృష్ణ చైతన్య స్వామియై — కృష్ణతత్వాన్ని బోధించి — నాస్తికత్వాన్ని దూరం చెయ్యటానికి అవతారం దాల్చిన పరబ్రహ్మ స్వరూపం కృష్ణ చైతన్యుడిది.

జీవిత పరమార్థాన్ని — జీవికి కావల్సిన ఆస్థినీ — ఆస్తికత్వాన్నీ ప్రబోధించి — ప్రత్యక్ష నిదర్శనంగా నిల్చి — అవతారం చాలించిన ఆ మహానుభావుడే కన్పిస్తున్నాడు కృష్ణారావుకి—

కృష్ణారావు వంక ఆరమోడ్పుగా చూస్తున్నాడు రామకృష్ణయ్య.

ఆ కళ్ళు మూతలు పడుతుంటే —

గాభరాగా త్వరపడ్డాడు కృష్ణారావు.

తడబడుతూనే గంగాజలం అందుకున్నాడు..

అందులో పవిత్రంగా తేలుతున్నాయి తులసీదళాలు.

"అ— న్న— య్యా— "

కృష్ణారావు అబ్యర్థనను ఆఖరిసారి మన్నించటానికే అన్నట్టు కొద్దిగా నోరు తెరిచాడు రామకృష్ణయ్య.

" కృష్ణ ... కృష్ణ ... — "

అప్రయత్నంగా కృష్ణారావుతో గొంతు కలిపింది అక్కడున్న జనసందోహం. కృష్ణనామం ఆఘ్రాణిస్తూ—కృష్ణనామాన్నే ఉచ్ఛరిస్తూ కృష్ణనామాన్నే గుటక వెయ్యబోతూ— మరో

గుటకకీ — మరో చూపుకీ నోచుకొని రామకృష్ణయ్య ఆత్మ — అనంతంలో కల్సిపోయింది.

అతని కోరిక ఆరాటంలోనే తీరిపోయింది.

కన్నతల్లి కడుపుశోకం ఉప్పెనలా తన్నుకు వచ్చింది.

కృష్ణారావు కన్నీళ్ళు — నిర్విరామంగా — నిర్వికారంగా — అన్నయ్య శరీరాన్ని అభిషేకిస్తున్నాయి.

కళ్ళల్లో తడి పూర్తిగా ఇంకిపోయింది ఒక్క లక్ష్మికే.

జరగవలసిన తంతూ— తతంగం— యధా విధిగా— శాస్త్ర ప్రకారం చాలా ఘనంగానే జరిగిపోయింది.

* * *

"కృష్ణా.. లక్ష్మి పిచ్చిదైపోతుందేమోరా పాపం —"

"ఎందుకని ?"

సూటిగా చూశాడు కృష్ణారావు.

అడిగిన వాళ్ళు తడబడ్డారు. సమాధానం తోచలేదు వాళ్ళకి. ఎందుకో చెప్పగలరు. కానీ పరిష్కారాన్ని చూపించగలరా ?

చూపించలేరని తెల్సు కృష్ణారావుకి.

లేకపోతే వాళ్ళల్లో అన్నయ్యమీద కసి విపరీతంగా పేరుకు పోతుంది అది లక్ష్మంటే ప్రేమవల్లా ? కాదు.

జాలివల్లా ? ఏమో కావచ్చు ఐతే ఆ జాలి మటుకు స్థిరమైందా ? కొన్ని రోజులు కాలక్షేపంగా పనికి వచ్చేది.

లక్ష్మికేదో జరిగిపోయిందని బాధపడిపోతే — నలుగుర్లోనూ వాళ్ళకదోతృప్తి. రామకృష్ణయ్య పూర్తిగా ద్రోహం చేశాడని చెప్పకుంటే — వాళ్ళకేదో వాళ్ళ వాళ్ళకి న్యాయం చేస్తున్నంత తృప్తి.

"కష్ణా ఏమంటావు ?—"

"వదిన్నడగండి"

# కర్మయోగి

"అయ్యో ఆ వెర్రిబాగుల్దానికి ఆ మాత్రం సమాధానం చెప్పే శక్తే వుంటే — ఈనాడు పరిస్థితులిలా వుండేవా ? ఈ స్థితి కొచ్చేదా ? బ్రతకనేర్చిందే ఐతే మొగుడ్ని కొంగునే కట్టేసుకుని వుండేది."

కాస్త చనువున్న వాళ్ళెవరో అతి చనువుతో అంటే కృష్ణారావు మనసు చివుక్కుమంది. ఐనా వీళ్లతో మాటలు పొడిగించటం పూర్తిగా ఇష్టంలేదు.

"కృష్ణా నీ మనసు మంచిదే అవచ్చు. అన్నయ్యకి ద్రోహం చేద్దామనే ఉద్దేశ్యం..."

కృష్ణారావు మొహం ఎర్రబడింది.

"ఏమిటి మీరనేది ?"

అతను లక్ష్మికి అన్న వరస. రామకృష్ణయ్య పోయినప్పట్నుంచీ లక్ష్మికి తను తప్ప ఇంకెవరూ లేనట్టు — కల్పించుకుని మరీ వోదారుస్తున్న మనిషి వెళ్ళేముందు అంత తేలిగ్గా ఈ గుమ్మం కదలడనీ—తన వాళ్ళని కదలనివ్వడనీ తెల్సు—ఐనా ఇదేమిటి ?

కృష్ణారావుని చూసి తడబడ్డాడతను.

తను ఏదో అనాలని ఏదో అనేసినట్టున్నాడు. చటుక్కున నాలిక కొరుక్కున్నాడు.

"నేననేది...ఆస్తిపాస్తుల విషయం... ఈ విషయంలోనైనా— లక్ష్మికి న్యాయం జరగాలి ఎందుకంటే .. ప్రస్తుతం ఏకైక వారసుడివి నువ్వేకాబట్టి—"

కృష్ణారావు మొహం వివర్ణమైంది.

"మీరనేది.."

"ఇప్పుడర్థంకాదు నిజమే. కానీ రేపు నీకు పెళ్ళై పిల్లలు పుట్టాక ఆ పిల్లలతో బాటు స్వార్థం కూడా పుడుతుంది. ఈ వెర్రిబాగుల మనిషికి న్యాయం చెయ్యటం మాకు న్యాయమన్పిస్తోంది. ఆస్తిపాస్తుల విషయం తేలుస్తే లక్ష్మిని మాతో తీసుకుపోతాం— ఇక్కడేముందని వుంటుంది? ఎవరున్నారని వుంటుందీ—పుట్టింటి వాళ్ళం మా బాధ్యత మాకు తెల్సు ఇంక నీ బాధ్యత నువ్వు—"

కృష్ణారావు అదోలా నవ్వాడు.

"చూడండీ. మీకు చెప్పదగ్గవాణ్ని కాదు, ఆస్తిపాస్తుల విషయంలో లోటు లేనట్టే ప్రేమాభిమానాల విషయంలోనూ ఈ ఇంట్లో లోటులేదు. అమ్మెంతో — నాకు వదినా అంతే. వదిన కన్యాయం జరిగిందనీ జరుగుతుందనీ మీరెందుకనుకుంటున్నారు ? అన్నయ్య వ్యక్తిత్వాన్ని అర్థం చేసుకుని ఆరాధించింది వదిన. ఆయన అడుగు జాడల్లో నడవటం తన ధర్మమనుకుంది. చివరిదాకా తన ధర్మాన్ని తను నిర్వర్తించింది. అన్నయ్య అన్యాయం చేశాడనీ— వదిన అనాధైపోయిందనీ — మీ ద్వారానే వింటున్నాను నేను. అలా అనుకోవాల్సిన అవసరం లేదే ! వదిన ఉత్తమ ఇల్లాలు. అన్నయ్యకి తగ్గ ఇల్లాలు. ఈ ఇంటికి గర్వించతగ్గ కోడలు. సర్వాధికారిణి కూడా. వదినా నాకు తల్లేనని మళ్ళామళ్ళా చెప్తున్నాను ... ఇద్దరు తల్లుల కొడుకుగా నా బాధ్యతలు నాకు తెల్సు."

లక్ష్మిని కూడా అడగాలనే వాళ్ల ఉద్దేశ్యం కనిపెడుతూనే నిక్కచ్చిగా అన్నాడు కృష్ణారావు ఏనాడూ ఇంతసేపు మాట్లాడగా చూడనివాళ్ళకి ఆశ్చర్యంగానే వుంది.

"అమ్మా లక్ష్మి.. నీ భవిష్యత్ మాటేమిటి ?"

"నా భవిష్యత్ ఇలాగే వుంటుందని మీ అందరికన్నా ముందే తెల్సుకున్నాను. వారు సామాన్యులు కారు. కృష్ణ చైతన్య డంతటి మహా భక్తులు. వంశం నిలవాలనీ— ధర్మం తప్పకూడదని, ఆయన ఇష్టంతో ప్రమేయం లేకుండానే ఒక విధంగానే పెళ్ళిచేశారు. ఆ విషయం పెళ్ళయాక తెల్సింది నాకు. ఐనా బాధపడలేదు...

వారూ భగవంతుని స్వరూపమే. ఉన్నప్పుడూ ఆయన్ని అలాగే చూశాను. ఇప్పుడూ లేరన్న భావన నాకు కలగటంలేదు... ఆయన తిరిగిన ఈ ఇంట్లోనే పూలను కట్టిన దారంలాంటి అదృష్టంతో. . ఆయన సహవాస దోషంతో— ఈ కృష్ణవిగ్రహంలోనే ఆయన్ని చూసుకు బ్రతుకుతాను..."

కృష్ణారావు కళ్ళల్లో నీటిపొర మెరిసింది.

వదిన సరికొత్త వ్యక్తిత్వంతో కన్పిస్తోంది.

"కృష్ణ నా కొడుకులాంటివాడు. ఆవిడ నా తల్లి. ఇక్కడుండటమే నాకు క్షేమం. గౌరవం."

మళ్ళా నోరెత్తలేదు వాళ్ళు.

* * *

"కృష్ణా"

"అమ్మా—"



# షర్టింగులు: పాలియెస్టర్, పాలియెస్టర్ బ్లెండ్ మరియు కాటన్

# ఎన్‌లైవ్®

మంచి అభిరుచి.
తగిన ధరలు.

నాషనల్ టెక్స్‌టైల్ కార్పొరేషన్



(తమిళనాడు మరియు పాండిచెరి) లి
భారత సర్కారువు ఒక ఉద్యోగ సంస్థ

10/64 సోమసుందరం మిల్స్ రోడు, కొయమత్తూరు-641009

ఇండెంటింగ్ ఏజెంట్లు : ఆంధ్ర ప్రదేశ్ బాలాజీ టెక్స్‌టైల్ ఏజెన్సీస్, 3-4-394, టొబ్యాకో బజారు, సికింద్రాబాద్-500 003 (ఏ పి ). సంగం టెక్స్‌టైల్స్ ఏజెన్సీస్, 230, మొదటి అంతస్థు, డి.బి. రోడ్డు, కొయమత్తూరు-641 002. ఆర్. పి. డిస్ట్రిబ్యూటర్స్, 3-4-394, టొబ్యాకో బజారు, సికింద్రాబాద్-500 003 (ఏ.పి.).

MCA/NTC/87 TEL

# కర్మయోగి

నిశ్చలంగా చూశాడు తల్లివంక.

తడబడిందావిడ.

''చెప్పమ్మా—''

ప్రశాంతంగా వున్న కొడుకుని చూడగానే కొండంత ధైర్యం వచ్చిందావిడకి.

''చూడు బాబూ... నా అదృష్టమో ... దురదృష్టమో...నిన్ను కంటితో చూడకుండానే సన్యాసుల్లో కలిసిపోయారు మీ నాన్నగారు మిగిలిన మీ యిద్దర్నీ పెట్టుకుని అగ్నిపర్వతాన్ని గుండెల్లో పెట్టుకుని . ఇంతకాలం బ్రతికాను... ఎందుకు ? ఎవర్ని చూసుకుని ? మీ కోసం కదూ.. ''

అన్నీ తనేగా పెంచి కంటికి రెప్పలా కాపాడుకొచ్చిన తల్లిని 'కాదూ' అనగల స్థోమత లేదు కృష్ణారావులో.

కాని అతి విచిత్రంగా— అతి సామాన్య రాల్లా— అందర్లా మాట్లాడే తల్లి మాటలు 'కాదూ' అనదగ్గా అన్పిస్తాయి. కానీ— తల్లి హృదయం అన్నిటికీ అతీతమైంది. పరవరాల నాటుకున్న సాంప్రదాయాన్ని ఛేదించగలదు. హృదయపు పొరల్లో నిష్టతో తిష్టవేసుకున్న దైవాన్ని కూడా దూరం చేసుకోగలదు. కన్నతీపి చెయ్యలేనిది లేదు. కడుపు మంటకు అనకూడని మాటంటూ వుండదు—అందుకే తల్లి వ్యక్తిత్వం విచిత్రంగా అన్పిస్తుంది అప్పుడప్పుడు. ఆ వ్యక్తిత్వం వెనకే వున్న అసలు వ్యక్తిని అర్థం చేసుకోగలడు కనుక— ఆ బాధను కూడా అర్థం చేసుకోటానికి ప్రయత్నిస్తున్నాడు.

''... కృష్ణుడు కర్మ చెయ్యమన్నాడు కానీ — ఐనవాళ్ళని బాధపెట్టి వాళ్ళ ఖర్మకి వదిలి పెట్టమని చెప్పాడా కృష్ణా —''

''నన్నేం చెయ్యమంటావో చెప్పమ్మా—''

అదే ప్రశాంతతతో అడుగుతున్నా కళ్ళు ఆలోచనగా ఎటో చూస్తున్నాయి.

''ఎప్పుడూ అడిగే మాటే --పెళ్ళి చేసుకోమని —''

ఈసారి ధైర్యంగానే కొడుకు వంక చూసిందావిడ.

''మనింట్లో పెళ్ళిళ్ళు అచ్చిరాలేదమ్మా—''

శూలంతో పొడిచినంత బాధ కలిగిందావిడకి.

''ఎందుకంటున్నావలా ?''

''ఇందులో నీకు తెలియనిదంటూ ఏముందమ్మా —''

''తెలియకపోవటం కాదురా ఇదంతా నా ప్రారబ్ధం. ఆ కృష్ణ భక్తి మనింట్లోనే ఎందుకింతగా రావాలి ? అన్నీవుండీ కన్నీళ్ళతోనే మనం కాపురం చెయ్యాలా ? ఎంత దరిద్రుడికైనా రేపటిమీద ఆశ వుంటుంది. అదేమనకుండకూడదా కృష్ణా — మనమేం పాపం చేశామురా... ఈ వైరాగ్యం — కన్నీళ్ళూతప్ప మనకేం మిగిలాయిరా —''

కుళ్ళి కుళ్ళి ఏడుస్తోంది తల్లి.

కృష్ణారావు మందంగా నవ్వాడు.

''కృష్ణభక్తిని ఉగ్గుపాలతో పట్టించింది నువ్వేకదమ్మా. అందర్లా అన్ని వున్నకాబూ చదవనివ్వకుండా కృష్ణ తత్వాన్నే చిన్నతనంలో మాచేత చదివించేదానివి. ఆధ్యాత్మిక తత్వాన్ని మాలో వ్రేళ్ళు నాటుకుపోయే విధంగా చేసిందీ నువ్వే. నాన్నగారు సన్యసించి వెళ్ళిపోయాక నువ్వు బాధపడింది కొన్నాళ్ళే. కానీ జన్మంటూ లేని పరమ పదానికి దారి వెతుక్కున్న మహానుభావుడని నువ్వే అందర్లో గర్వంగా చెప్పకోలేదా? మీలాంటి భక్తులకి పుట్టిన మేము భిన్నంగా వుంటామని ఎలా అనుకున్నావమ్మా ?...''

అమ్మ కన్నీళ్ళు చూడలేక తల దించుకున్నాడు కృష్ణారావు.

''నీ బాధ అర్థం చేసుకోగలనమ్మా. కానీ నా బాధమకూడా అర్థం చేసుకోమంటున్నాను.

> **అమ్మ**
>
> దేవకీ నందనుడైనా
> జానకీ వల్లభుడైనా
> అమ్మ గుండెలపై ఆడుకున్నవాళ్ళే
> ఆ ప్రత్యక్ష దైవం పాత్రిళ్ళలో
> ఒళ్ళు విరుచుకున్నవాళ్ళే
> అందుకే అంటుంటా —
> అమ్మకి అమ్మే అర్చమని !!
>
> — అడబాల

నన్ను, అన్నయ్యనూ అల్లారు ముద్దుగా పెంచావు. కృష్ణ బలరాముల వేషాలువేసి నీ ముచ్చట్లన్నీ తీర్చుకున్నావు. యశోదంత అదృష్టవంతురాల్నని పొంగిపోయే దానవి. కాదా అమ్మా — నువ్వు తీర్చుకోవాలనుకున్న ముచ్చట్లన్నీ మేము పసివాళ్ళంగా వున్నప్పుడే తీర్చుకున్నావు. ఈ వయసులో నీకు తేవల్సిందీ భవబంధాల తాలూకు బాధలు కావమ్మా. నిశ్చలత హృదయ నైర్మల్యం— ఏకాగ్రత — జన్మ సంస్కార ఫలంగా వచ్చిన దైవ భక్తి మీద ఏకాగ్రత. అందుకు క్రొత్త బంధాలేవీ ప్రతిబంధకాలు కాకూడదమ్మా. అటువంటి బంధాల మీదా బాంధవ్యాలమీదా నాకూ ఎందుకో కోరిక కలగటం లేదు. అన్నయ్య బలవంతంమీద ... బలహీనత వల్ల వివాహం చేసుకున్నాడు. నీ ముందు ఒద్దన లేని బలహీనత ... చివరకేమైందమ్మా ...''

తల్లి మొహం కళ తప్పింది.

గమనించని కృష్ణారావు ఇంకా చెప్పకు పోతూనేవున్నాడు.

''బాబా ... ఎటువంటి సమయంలో ఏం మాట్లాడాలి ? ఇటువంటి సమయంలో ఏం మాట్లాడుతున్నావు నువ్వు ... ''

వదిన మందలింపు వినపడింది.

అయోమయంగా చూశాడు.

అమ్మ స్పృహ తప్పినట్టుంది.

వదిన ... వదిన వొళ్ళో అత్తగారు ... కన్నతల్లి వొళ్ళో పసిపాపలా కన్పిస్తోంది. ఐతే నిశ్చింతగాకాదు.

ఆ నిశ్చింతను కల్గించాల్సిన బాధ్యత తన మీదవుంది.

తనమీదే వుందా ?

దగ్గరగా రాబోయి ఆగిపోయాడు.

వదిన చూపుల్లో తనకా అధికారం లేదని నిలేసే అర్హత కన్పిస్తోంది.

తనకా అర్హత లేదని చెప్పే అధికారమూ కన్పిస్తోంది.

''కృష్ణా ... మీ అన్నయ్య బలవంతం వల్లే వివాహం చేసుకున్నాడు. కన్నతల్లిని బాధ పెట్టలేని బలహీనత వల్లే .వివాహం చేసుకున్నారు. నిజమే. కానీ ఆ విషయాన్ని అత్తయ్య దగ్గర తేవల్సిన సమయం ఇదా ? అసలు ఆ విషయాన్ని ప్రస్తావించవల్సిన అవసరం వుందా? ఆవిడ బలవంతంవల్లే — నా జీవితం నాశనమైపోయిందన్న భావన ఆవిడకెందు క్కల్గించాలి ? అసలే గర్భశోకంతో కుమిలిపోతున్న ఆవిడక్కావల్సింది వోదార్పు. మామగారు లేకపోయినా— రత్నాల్లాంటి మీ ఇద్దరూ వున్నారు. మీ ఇద్దరి వల్లా ... మీలాంటి ప్రయోజకులే — మీలాంటి దైవభక్తులే — మీలాంటి ఉత్తములే — మళ్ళా ఈ ఇంట్లో పుట్టాలి ... అదే ఆవిడ తపన. అదే ఆవిడ ఆవేదన . . అందుకే అన్నీ మరిచి సామాన్యరాల్లా మీ ముందున్నదికూడా .

లక్ష్మి కళ్ళల్లో నీళ్ళు మెరిశాయి.

''కృష్ణా ... నువ్వు మీ అన్నయ్య స్థాయికి వెళ్ళలేదు ... అందుకే చెప్తున్నా ... ఆయన పిచ్చి తిని ఎప్పుడో దాటిపోయారు ... నువ్వు చెప్ప ... ఆవిడకు మిగిలిన ఆశ నువ్వే, ఆ అమాయకురాలి కోరిక తీర్చినంత మాత్రాన నీ దేముడికి కోపం వస్తుందా ? నువ్వు వంట పట్టించుకున్న 'గీత'లో కర్మయోగమే కన్పించకుండాపోటం దురదృష్టం.''

ఛెళ్ళున పీవు చరిచినట్లైంది.

వదిననే అవాక్కై చూస్తూ వుండిపోయాడు.

చాలాకాలం తరువాత వదిన మాట్లాడింది.

వదిన మాట్లాడింది ...

'కాని ఏమని ???'

తన్లో తనే గొణుక్కున్నాడు కృష్ణారావు.

(ఇంకా వుంది)




## ఎస్. పి. ఎస్. — కాకినాడ

అబ్బబ్బ! ఈ మధ్య ప్రశ్నావళి శీర్షిక నాకు విపరీతమైన బోరు కొట్టేస్తోంది— ప్రేమ—పెళ్లి—విరహం—వ్రాసేవారికి ఎలా వున్నా మీరు జవాబులు ఎలా యివ్వగల్గుతున్నారు? కొంచెం సామాజిక స్పృహ కల్గిన ప్రశ్నలకి సమాధానాలు యిస్తూండమని నా సలహా.

★ సలహాలకేం? ఎవరేనా యివ్వవచ్చు. అట్లాంటి స్పృహ వున్న ప్రశ్న ఎందుకు వేయలేదు మీరు? బోరు కొట్టాంటే — సవాలక్ష యితర విషయాలున్నాయే — చదువుకుందువా! వ్రాసే విషయం ఒకటే అయినా రాసేవాళ్లు వేరు వేరు. అది మీరు గ్రహించలేకపోవడం—నిజంగా సామాజిక స్పృహ లేకపోవడంగా నేను భావిస్తాను! మీరనే ఆ స్పృహ మీ చుట్టూ వున్నవారి పట్ల మీరు ప్రదర్శిస్తున్నారా? లేక—నైలునది పొడవు— లెనిన్ గ్రాడ్ జనాభాలే—సామాజిక స్పృహ కల్గిన ప్రశ్నలా?! ఐదోక్లాసు వాడికీ,అర్థికశాస్త్రంలో ఎం.ఏ. పట్టా ఉన్న వాడినీ ఈరోజు పీడిస్తూన్న జాడ్యం ప్రేమేలావుంది. అందుకే—అవే ఎక్కువ అడుగుతారు. నేను అది తప్పనుకోడంలేదు. తెలివితేటలు ప్రదర్శించే ఊకదంపుడు ప్రశ్నలనే నేను —పట్టించుకోను క్షమించండి మీ ఉచిత సలహా పాటించలేకపోతున్నందుకు. అయినవారికే ఉత్తరం ముక్క రాయడానికి బద్ధకించే మనం —ప్రశ్నావళికి పనికట్టుకుని రాయాలని తాపత్రయపడేవారిని — మెచ్చుకోవాలి. మీరూ కాస్త 'ఇజాల' దృష్టిని మనిషికి మళ్లించండి—అప్పుడు —నా దృక్పథం అర్థం అవుతుంది.

## కె. వి. ఎస్. — అనకాపల్లి

మీ పొద్దుతిరుగుడు పూలు సినిమాగా తీస్తున్నారని విన్నాము. ఎంతవరకు నిజం?

★ నిజమే.

## ఆర్.ఎస్. ఆర్. — మాచర్ల

లంచం తినే పందికొక్కులను ఏ బోనులో పట్టాలి?

★ లంచం యివ్వడం తెలిసినవాళ్లే కద — వారిని పెట్టకల్గినా, పని చేయించుకోకల్గినా!

## హెచ్. కె. పి. — విజయనగరం

కవి పండితుడు కాలేడు — పండితుడు కవి కాలేడు. అని కొందరంటారు. ఎందుకు?

★ లిటరరీమయోపియా జబ్బు ఉంటుంది —కొందరికి, అందుకే అలా అంటారు.

## కె. డి. బి. — మచిలీపట్నం

ఆడవాళ్లు పాంట్లు షర్టు వేసుకుంటున్నారు. కాని మగవాళ్లు ఆడ వేషధారణ చేయరెందుకు?

★ వాళ్ల కది నప్పదు!

## పి. యు. ఎమ్. — విశాఖపట్నం

పురుషులు అడిగే ప్రతి ప్రశ్నకు జవాబులో దెప్పిపొడుస్తూనే వుంటారు. అంటే స్త్రీలంతా అంత మంచి వారని వెనకేసుకుని వస్తున్నారన్న మాట. మీలో ఈ పార్శియాలిటీ పోయేది ఎప్పుడో చెప్తే — అప్పటి నుండి నేను మిమ్మల్ని మనస్ఫూర్తిగా అభిమానిస్తాను. ఏమంటారు?

★ నీ అభిమానం నాకొద్దు!

## డి. సి. హెచ్. — అత్తిలి

పెళ్లి చేసుకోకపోవడం పిరికితనం అవుతుందా?

★ కాదు, కాని పెళ్లి వద్దని— అడ్డదార్లు తొక్కడం—తప్పవుతుంది. స్త్రీ సుఖం కావాలి— పెళ్లి బాధ్యత ఒద్దు అనుకోవడం — పొరపాటు ధోరణి అవుతుంది

## స్వర్ణలత — పామూరు

రామలక్ష్మిగారూ, వీడియో చిత్రములపై మీ అభిప్రాయం ఏమిటి?

★ అవి గొప్పవాళ్లకి కొత్త సరదాలు. ఉన్నవారికి అవి స్టేటస్ సింబల్స్ సామాన్యుడికిలాంటివి అందుబాటులోనూ వుండవు. అతనికా సరదాలూ వుండవు. అటువంటి వారిని మభ్యపెట్టి డబ్బు చేసుకోవడాన్ని — అరికట్టాలి.

## జి.ఎస్. — ఆలూరు

ప్రతి కవి, కవయిత్రి ఒక నాయికను వర్ణించేటప్పుడు ముఖం చంద్రబింబం అనీ కళ్లు కలువరేకులనీ పొగుడుతూనే వుంటారు. ప్రతి స్త్రీ కవులు వర్ణించే విధంగానే వుంటుందా? ఎన్నోరకాలుగా వుంటారు. అలాంటప్పుడు కవితలెందుకిలా అల్లుతారు? చెప్పండి. ఉదాహరణకు మీ భర్త గారిని తీసుకుని మరీ చెప్పండి.

★ ఇంకా చంద్రబింబా అనెవరంటున్నారయ్యా స్వామి — చంద్రుడిమీద మనిషి పాదముద్ర పడ్డాకకూడా. కాకిపిల్ల కాకికి ముద్దన్నట్టు ఎవరి నాయిక వారికలా కన్పిస్తే నీదేంపోయింది చెప్పు? ఇక మావారా? మీటనొక్కి చిరుగాలిని చంద్రుణ్ని వెర్లించారు! పైగా ఆ ఊహా ప్రేయసి(!) నైనా బొత్తిగా గొంగళీ పురుగుతో పోల్చి "జీవిత వృత్తంమీద గూడు కట్టుకుని" — రూపాంతరం చెందమన్నట్టు జ్ఞాపకం! ఈ మధ్యకాలంలో ఎక్కడా కొత్త ప్రేయసిని గురించి రాసినట్టు లేదు!!

## ఎస్. ఎస్. ఆర్. — ఒంగోలు

కలంలో కలకాలం నిలచే నవలోకం సృష్టిద్దామనే యువకులకు మీ సలహా ఏమిటి?

★ కలం కోటలు — పేకమేడల్లాంటివే, శ్రమ దండగ నమ్మిన వాటిని గురించి రాయండి. కాని అది లోకాన్ని మార్చేస్తాయని అనకండి...

## ఎం. ఆర్. ఆర్. — ఉరవకొండ

కలం స్నేహంవల్ల మనిషికి విశాల దృక్పథం అలవడుతుందని నా అభిప్రాయం.

★ చుట్టూరా ఉన్న మనుషులతో మాట్లాడి పెంచుకోలేని దృక్పథం— ముక్కు ముఖం తెలియనివారికి రాస్తే వస్తుందంటారా? నాకు లేదా నమ్మకం. ★






# ఎదురు గాలి

శంఖవరం సరోజా సింధూరి

సంధ్య వచ్చింది. చల్లగాలి వచ్చింది పక్షులు గూళ్ళు చేరాయి. ఆలమందలు ఇళ్లకు మళ్ళాయి.

కానీ. . మధుసూదన్ మాత్రం యింకా రాలేదు.

సంధ్య దీపం వెలిగించి గూటిలో పెట్టింది చంద్రావతి. వీధి గుమ్మం వరకు వచ్చి తొంగి చూసింది. ఆమె చూపు ఆనినంత మేరా మధుసూదన్ జాడలేదు.

"అమ్మాయ్ అమరా! పొద్దుపొడుపుతో వెళ్లినవాడు పొద్దువాలిపోతున్నా అంతులేడేమిటే ?"

చంద్రావతి గొంతులో భయముంది ముఖంలో ఆదుర్దా వుంది

"వస్తార్లే అత్తయ్యా మీరు మరీ కంగారు పడిపోతుంటారు" పెరట్లోంచి వినవచ్చింది అమరేశ్వరి స్వరం.

"కంగారు కాక మరేమిటే ? పిల్లవాడి జాడే లేకుంటేనూ ! అయినా నేను చెబుతూనే వున్నాను. . అబ్బాయికి అలమేలు ఎదురొచ్చిందే ...వాడ్ని వెళ్లనివ్వకే అని. వింటేనా ఒక్కరైనా? ఆ శనిగ్రహం ఎదురొచ్చిందంటే ఖచ్చితంగా ఏదో ఒక కీడు జరిగి తీరుతుంది." చంద్రావతి కంఠం ఖంగుమంటోంది.

రెండేళ్ల పాపకు స్నానం చేయించి వళ్లు తుడుస్తున్న అమరేశ్వరి ఉలిక్కిపడింది. "అలాగ అరుస్తారేమిటి ? అలమేలు ఇల్లు ప్రక్కనే అని మర్చిపోతే ఎలాగ ? విన్నా వినగలదు."

"విననీ, వింటే నాకేం భయమా ? తలగొట్టి మొలవేస్తుందా ఈ వీధంతా తెలుసు దాని శకునం మంచిది కాదని." చంద్రావతి స్థాయి యింకా పెంచింది

"తలగొట్టి మొలవేస్తుందని కాదండీ. వింటే బాధపడుతుందని అనవసరంగా ఎదుటి మనిషి మనసుని నొప్పించటం తప్పని." అమర పిల్ల ముఖాన పొదుచుక్క పెడుతూ అంది.

"తప్పొప్పులు నువ్వు చెప్పొచ్చేదేమిటి ... గుడ్డువచ్చి పిల్లను వెక్కిరించినట్టు. దానికేం గాని పిల్ల బుగ్గన అగరు చుక్క పెట్టు. నా తల్లి బొమ్మలా వుంటుందని వూరివాళ్ల కళ్లు కుట్టిపోతున్నాయి. అవును కదే చంటీ ?" చంద్రావతి పాప బుగ్గలు పుణికి ముద్దాడింది.

"ఈ పెద్దవాళ్ల చాదస్తాలతో ప్రాణం పోతోంది బాబూ." అమర సణుగుడు చంద్రావతి చెవిన పడనే పడింది.

"ఆహా... మీ కుర్రకారు తిరుగుబాటుతో మా ప్రాణాలు పోవట్లేదూ ! అబ్బాయి రాలేదని పొద్దుట్నుంచీ అల్లాడుతున్నాను. ఎవరికైనా చీమకుట్టినట్టు వుందా ?"

చంద్రావతి మాటలకు మనసు చివుక్కుమంది అమరకు. 'ఆ దిగులుతో మధ్యాహ్నం నుంచి పరిగ్గా భోజనం కూడా చెయ్యనిది తను. ఆవిడ మాత్రం సుష్టుగా భోంచేసి మళ్లీ మూడు గంటలకు పావుకిలో ఉప్మా, కంచులోటా కాఫీ ఖాళీచేసి అత్తమీద కోపం దుత్తమీదన్నట్టు అలమేలునీ, తననూ తిడుతూ కూర్చుంది. ఇదెక్కడి న్యాయం ?'

అమరకు వళ్లు మండిపోయింది. అత్తవంక రుసరుసలాడుతూ చూసి ఏదో అనబోయేలోగా గుమ్మంలో అలికిడయింది. ఆత్రుతగా తలెత్తి చూసింది. మధుసూదన్ కాలికి చిన్న బేండేజ్‌తో కుంటుతూ వచ్చి నీరసంగా మంచం మీద వాలిపోయాడు

అతడ్నిచూస్తూనే చంద్రావతి గుండె గుభిల్లుమంది. "ఇదేమిట్రా నాయనా ? ఈ కట్టేమిటి... ఈ అవతారమేమిటి ?" లబలబలాడుతూ అడిగింది

అతను చెప్పబోయేది వింటానికి అమర ఆత్రంగా చూస్తోంది. ఆమె కళ్లలో అప్పుడే నీటిపొర అలుముకుంటోంది

"అమరా ! కాస్త మంచినీళ్లివ్వు" అతను అలసటగా నుదురు రాచుకున్నాడు. అమర ఒక్క అంగలో వెళ్లి చెంబునిండా నీళ్లు తెచ్చింది. అతను నీళ్లు గటగట తాగేసి రెండు నిముషాలాగి తల్లిదెశ తిరిగి అన్నాడు. "చిన్న యాక్సిడెంట్ అయిందే. రిక్షాచక్రం కాలిమీదుగా వెళ్లింది."

"అయ్యో ... అయ్యో ... వాడి నోట్లో మట్టిపడ. ఎంతపని చేశాడు...దుర్మార్గుడు !" చంద్రావతి కొడుకు కాలు పట్టి చూస్తూ రిక్షావాడ్ని తిట్టసాగింది.

"మీరంత నిర్లక్ష్యంగా రోడ్డుమీద ఎందుకు నడుస్తారు ? జాగ్రత్తగా వెళ్లకూడదూ !" అమర కాస్త చిరాగ్గా అన్నది.

"జాగ్రత్తగానే వెళుతున్నా. రిక్షావెధవ తాగినట్టున్నాడు. ముందూవెనకా చూడకుండా పోతున్నాడు."

"వెధవ సినిమా కోసమని మీరా పట్నం వెళతారు. వచ్చేవరకు ప్రాణం కడబట్టి పోతుంటుంది. ఏముంటాయి ఆ సినిమాల్లో ... మన పొలాలకన్నా అందమైన సీన్లుంటాయా ? అవునూ... యింతకీ డాక్టరేమన్నారు ?" అమర బాండేజి వత్తిచూస్తూ అన్నది.

"చాల చిన్న దెబ్బ అమరా. డాక్టర్ ఇంజెక్షనిచ్చి బేండేజ్ చేశారు. ఏంపర్లేదిక. స్నానానికి నీళ్లుపెట్టు." లేచి తుండు భుజంమీద వేసుకుని పెరటివైపు వెళ్లారు.

"ఏమే అమరా ! ఇప్పటికైనా తెలిసిందా ! అలమేలు ముఖం ఎలాటిదో. దానంత అపశకునపు ముండ ఇంకోటి లేదు" చంద్రావతి అమరను సవాలుగా చూసింది.

అమర అత్తవంక నిరసనగా చూసి భర్త వెనకాలే నడిచింది. బావిలో చేద వేస్తుంటే గోడమీదుగా పలకరించింది అలమేలు. "ఏవమ్మోయ్ అమరేశ్వరీ ! మీ ఆయనేంటో కాలికి కట్టుతో వచ్చాడు. ఏమిటి విషయం ?"

"కాలిమీదుగా రిక్షా పోయిందిటండీ."

"అయ్యోరామా ! ఎంతపని జరిగింది." అలమేలు కళ్లలో స్పష్టంగా కన్పించింది ఏదో బాధ

ఆ కళ్లలోకి చూస్తున్న అమరకు గుండె కలుక్కుమంది. "పిచ్చిదానా ! ఎందుకలాగ బాధపడతావ్ ? ఇది జరిగింది నువ్వెదురు రావడం వల్లనే అని మా అత్తగారి ఉవాచ. ఈ నీలాపనింద వింటే నీ గుండె భగ్గుమనదూ ?" మౌనంగా అనుకుని నిశ్శబ్దంగా నిట్టూర్చింది అమరేశ్వరి.

* * *

వెండిగిన్నెలో పాలబువ్వ కలిపి చంటిపాపకు తినిపిస్తోంది అమర. చంద్రావతి చాపమీద కూర్చుని వత్తులు చేసుకుంటోంది

"ఏం చేస్తున్నావు చంద్రావతమ్మా" అలమేలు వచ్చింది.

"ఎవరూ ! అలమేలా ? రామ్మా రా కూర్చో." ఆప్యాయంగా నవ్వింది చంద్రావతి.

"అబ్బ ! ఎండలు మండిపోతున్నాయి" అలమేలు పవిటతో విసురుకుంటూ అంది.

"అమరా ! అలమేలుగారికి విసరకర్రయివ్వు." కోడలికి పురమాయించి అలమేలుతో లోకాభిరామాయణంలో పడింది.

అమరేశ్వరి గడపమీద కూర్చొని చంటితల్లికి గోరుముద్దలు పెడుతోంది. పాప వద్దని మారాం చేస్తోంది.

"చూడు... నువ్వు బువ్వ తినకుంటే ఆమె పట్టుకెళుతుంది నిన్ను." అంది అమర అలమేలు వంక వేలుపెట్టి చూపుతూ.

"అవున్రోయ్ చంటిగాడా ... నిన్ను పట్టుకెళతా...ఊఁ...బుద్ధిగా బువ్వతిను." అలమేలు కళ్లతో బెదిరిస్తూ అంది.

చంటిపాప భయపడుతూ అలమేలు వంక బిక్కుబిక్కున చూస్తూ అన్నం తినేసింది. ఆ పిల్ల తినేవరకు అలమేలు బెదిరిస్తూనే వుంది.

అమర నవ్వుకుంటూ ఖాళీ అయిన గిన్నెను పాపను తీసుకుని పెరట్లోకి వెళ్లింది.

మరికాసేపు కబుర్లాడి అలమేలు వెళ్లిపోయింది. మంచం మీద నడుమువాల్చిన అమర దగ్గరకు రివ్వున వచ్చింది చంద్రావతి.

"నీ కసలు బుద్ధుందటే అమరా ?" చంద్రావతి అభియోగానికి అమర అదిరిపడింది.

"ఏదీ... వంటలేక్కడ ? కాసిన్ని మిరపకాయలూ, ఉప్పూ పట్రా. చూర్లో చిక్కు వెంట్రుకలున్నాయేమో చూడు." చంద్రావతి హడావుడిగా అంటోంది.

అమరకు చప్పున అర్థమైంది అత్తగారి కోపానికారణం.

"మీది మరీ చాదస్తం. చంటి నిద్ర పోతోంది. పడుకోనివ్వండి." అంది అసహనంగా.

"హోరుమయ్యావే. ఆ పిల్లకు అన్నం పెడుతున్నంతసేపూ ఆ అలమేలుకు మిడిగుడ్లు పడిపోయాయనుకో. పసిపిల్లకు ఎంత దిష్టి తగిలిందో. దానెదురుగా పెట్టినందుకు నిన్ననుకోవాలి."

అమర మారు మాటాడకుండా లేచి చంటి పాపను నిద్రలేపి ఒళ్లో వేసుకుంది. మధ్యలో నిద్ర చెడినందుకు నిరసనగా చంటితల్లి అరున్నొక్కరాగం ఆలపించింది. చంద్రావతి ఎడంచేతి గుప్పిటలో మిరపకాయలూ, ఉప్పూ, వెంట్రుకలూ బిగించి పట్టుకుని "ఇరుగుదృష్టి ...పొరుగుదృష్టి ... ఇంట్లోదృష్టి ...వీధిలో దృష్టి ... అష్టదివర్ణం దృష్టి... ఛీపో ..." అంటూ పాపచుట్టూ చేయి తిప్పుతుంటే అమరకు నవ్వాగలేదు.

తరువాత పాపను బుజ్జగిస్తుంటే అమరకు అలమేలే గుర్తొచ్చింది. 'ఎంత నిక్కృష్టులైనా చంటిబిడ్డల అన్నానికి ఆశపడతారా ? చంటి బువ్వతినాలనేకదూ ఆమె బూచాడులా నటించి , ఓ చంటిపాపగా మారి ఆడించింది. ఛీ . . తన అత్తగారి మనసెంత సంకుచితమైంది !'' అమర ఏవగింపుగా చూసింది అత్తగారి వైపు.

అది గమనించిన చంద్రావతి వేదాంతిలా నవ్వి అన్నది "నీకు తెలీదే అమరా. మీ కుర్రకారుకి మా పెద్దవాళ్ల మాటలన్నీ చాదస్తాలుగానే కన్పిస్తాయి. మా పద్ధతులన్నీ పిచ్చివనే అన్పిస్తాయి. ఈ నమ్మకాలు ఈనాటివి కావు. జీవితానుభవాల్ని కాచి వడబోసిన మన పూర్వీకులు ఇవన్నీ పెట్టారు. మనం అంత తేలిగ్గా వాటిని తీసివెయ్యకూడదు. ఇంతెందుకు ... మంచి చీర కట్టుకుని మల్లెపూలు పెట్టుకుని అలమేలు ఇంటికి వెళ్లిరా. సాయంత్రానికే నీకు తలనొప్పి



రాకుంటే నన్నడుగు. అలమేలనే కాదు ...చాలా మంది కళ్ళు మంచివి కావు.''

''అలమేలు యింటికెళితే తలనొప్పి వస్తుందోలేదోగాని ... మీ మాటలు వింటుంటే మాత్రం యిప్పుడే తలనొప్పి వస్తోంది నాకు.'' పెడసరంగా అని మంచం మీద బోర్లా పడుకుంది.

''అనుభవమైతేగాని అర్థంకాదు నీలాంటి వాళ్ళకు'' చంద్రావతి సణుక్కుంటూ భగవద్గీత పుచ్చుకుని అక్కడ్నుంచి వెళ్లిపోయింది.

ఆ రాత్రి చంటిది ససేమిరా అన్నం ముట్టలేదు. ఆఖరికి మధుసూదన్ కూడా పాపను బుజ్జగించి, బెదిరించి చూశాడు. లాభం లేకపోయింది.

''చూశావుటే అమరా ? ఇప్పటికైనా అర్థమైందా దిష్టి ప్రభావం'' చంద్రావతి విజయగర్వంతో చూసింది.

అమరకు కూడో ఒక్కక్షణం అవునేమో అన్పించింది. మళ్లీ వెంటనే ''ఛీ... తనేమిటి ఇలాగ అయిపోతోంది !'' అనుకుంది.

''దిష్టేమిటే నీ ముఖం. దానికి ఒంట్లో బాగున్నట్టులేదు.'' మధుసూదన్ పాప ఒళ్ళు పట్టుకు చూశాడు.

''నెప్పగా వుందా ?'' ఆదుర్దాగా అడిగింది అమర.

''వ్వ్...లేదు. మరి ఎందుకు తిన్లేదబ్బా!''

''ఏమోనండీ . పాలు కూడా తాగలేదు.'' అమర దిగాలుగా అంది.

''ఇక నోళ్ళు మూసుకుని కాస్త ఉప్పూ... మిరపకాయా...'' చంద్రావతి మాట ముగించే లోపలే అమర అందుకుంది ''ఇదిగోండత్తయ్యా! రోగానికి మందు వెయ్యాలిగాని ఇలాగ మిరపకాయలూ,ఉప్పూ ఒలకబోసుకుంటూకూర్చుంటే లాభంలేదు. ఈరోజు దానికి ఆకల్లేదు...తిన్లేదు అంతే. ఆ అలమేలు ఏం పాపం చేసుకుందోగాని మీ నోట్లో నువ్వుగింజలా నానిపోతోంది. ఛ...ఛ...తోటిమనిషిని పట్టుకుని మరీ అంతలా అవమానం చెయ్యగూడదు. ఏముందీ ఆ అలమేలు ముఖంలో ... మీకూ నాకూ వున్నట్టే ...రెండు కళ్ళూ, ఒక ముక్కూ, నోరు వుంది. అంతే...మరింకేం విపరీతం లేదు.''

అమరకు ఆవేశం కట్టులు తెంచుకుంది.

చంద్రావతి ముఖం చిన్నబోయింది.

''అమరా ! ఊరుకో. పెద్దవాళ్ల మాటలు మరీ అంతలా తీసెయ్యకూడదు. ఎవరిచూపు ఎలాంటిదో ఎవరుచెప్పగలరు ?'' మధుసూదన్ తల్లికి సపోర్ట్ యిచ్చాడు.

''మగవారై వుండి మీరు కూడా అలా గంటారేమిటండీ ? ఆడవాళ్ల కబుర్లూ ... అమ్మలక్కల విసుర్లూ సమర్థిస్తున్నారా ?'' అమర చిత్రంగా చూసిందతన్ని.

''బాబోయ్... నాకెందుకొచ్చిన గొడవలు ! ముందు నాకు భోజనం వడ్డించు. నా మానాన నేను తినిపోతాను.'' మధుసూదన్ భయపడు తున్నట్టూ చేతులు జోడించాడు.

*　　*　　*

'' చంటి బొత్తిగా చిక్కిపోతోందండీ '' నిదురపోతున్న పాప వంక జాలిగా చూస్తూ అంది అమరేశ్వరి.

''అవును అమరా. నేనూ గమనించాను'' మధుసూదన్ పాప వళ్ళు నిమిరాడు.

ముద్దుగా బొద్దుగా రబ్బరు బొమ్మ లాగుండే పాప సన్నగా అయిపోయింది. సిమ్లా యాపిల్స్‌లా నిగనిగలాడే బుగ్గలు తమలపాకుల్లా అయిపోయాయి. పాలుగారే చెక్కిళ్లు పాలిపోయాయి. కళ్లలో కళ తగ్గిపోయింది.

''డాక్టర్ దగ్గరకు తీసికెళ్దామండీ. అలమేలుగారు కూడా అదే అన్నారు.

''అసలు చేసిన నిర్వాకమంతా ఆ ముండదే. దాని దిష్టికొట్టే నా తల్లి యిలాగైపోయింది.'' చంద్రావతి అందుకుంది.

అమర చురుక్కున ఆమె వంక చూసింది



''కానీ అదే నిజమనుకున్నా మీరు రోజూ గుప్పెడు మిరపకాయలు పీధిపాలు చేస్తున్నారు కదా ! ఆ దిష్టేమిటో తొలగిపోకూడదూ ? ''

''ఎలాపోతుందే ? దాని కళ్ళు అలాటిలాటివి కావు. దాని కళ్లలో కొరివిమంటలున్నాయి. అమ్మో ఇది సామాన్యమైన దిష్టి కాదు.''

''ఇకచాల్లే వూరుకోండి. వింటే నవ్వుతా రెవరైనా.'' అమర ఆ మాటలని భర్తవంక తిరిగి అంది ''చూడండి . రేపు ఉదయం పాపను పట్నం తీసికెళదాం. ఉపేక్షిస్తుందే కుదిరేట్టు లేదు, నాకేమిటో భయంగా వుంది. ఆ రామరాజుగారి మనుమరాలు కూడా ఈ మధ్య ఇలాగే తిండీ తిప్పలు మానేసి చిక్కిపోతున్నదట డాక్టర్‌కిచూపిస్తే ''తెల్లకామెర్లు''అనిచెప్పారట. పిళ్ళు సకాలంలో కనుక్కోక అవి ముదిరిపోయి ఆ పిల్ల చచ్చిపోయింది – అలమేలుగారు చెప్పారీ విషయం.''

''ఆ అలమేలు నోరుపడ. అవేం మాయదారి మాటలు !'' చంద్రావతి దురుసుగా అన్నది.

''ముందు జాగ్రత్తకోసం ఆవిడ సలహా యిస్తే అవెలా మాయదారి మాటలవుతాయి ? చూడండీ... ఈ గొడవంతా ఎందుకు ? రేపు చంటిని పట్నం తీసుకువెళుతున్నాం. అవునా?'. మధుసూదన్ వంకే చూస్తూ అంది.

''అలాగే... అలాగే. నేనలా పొలం వరకు వెళ్ళొస్తాను. గింజ రాల్పిస్తున్నాంగదా. కాస్త ఏమారినా కూలీలు గింజ మాయం చేస్తారు.'' మధుసూదన్ లేచి వెళ్లడానికి ఉద్యుక్తుడయ్యాడు.

*　　*　　*

ఉదయాన్నే చంటిని తీసుకుని బయలు దేరుతుంటే చంద్రావతి తనుకూడా వస్తానంది. వద్దంటే మనసు కష్టపెట్టుకుంటుందని ఇంటికి తాళం పెట్టి అందరూ బయలుదేరారు

అమర చంటిని చంకవేసుకుని గుమ్మం దిగిందో లేదో అలమేలు నవ్వుతూ ఎదురొచ్చింది. తనుకూడా ఎక్కడికో బయలుదేరినట్టుంది.

చంద్రావతి గుండె గతుక్కుంది. ముఖం ముటముటలాడింది. ''ఎక్కడికండీ ?'' అమర నవ్వుతూ అడిగింది.

కాసేపు అలమేలు ఎందుకోగాని సమాధానం చెప్పలేదు. తరువాత మెల్లని స్వరాన అంది ''పట్నానికే నేనూ వస్తూంట. పదండి. నేను వెనక వస్తాను'' ఎందుకో మళ్ళీ యింటికి పెట్టిన తాళంతీసి ఇంట్లో కెళ్లింది అలమేలు. ఆమె ముఖం మ్లానమై వుండటం అమర చూపు దాటిపోలేదు.

అమర దీర్ఘంగా నిశ్వసించి వాకిట్లో నిలిచిన ఒంటెద్దు బండిలోకి ఎక్కింది. తరువాత మధుసూదన్, చంద్రావతి ఎక్కారు. మువ్వలు గలగలలాడించుకుంటూ కదిలింది బండి.

# సంపూర్ణ పోషకాహారంలో అన్ని పోషక పదార్థాలు సరియైన పాళ్లలో వుండాలి...



ప్రొటీనులు
పెరుగుదలకి ముఖ్యం
పిండి పదార్థాలు మరియు క్రొవ్వు పదార్థాలు
శక్తికి
విటమిన్ ఎ
కళ్ళలో కాంతులకి
విటమిన్‌లు బి గ్రూప్
అన్ని ఇతర పోషక పదార్థాలని జీర్ణించుకోడానికి
విటమిన్ సి
రోగ నిరోధక శక్తి పెంపొందించడానికి
విటమిన్ డి
కాల్షియం మరియు పాస్ఫరస్‌లని గ్రహించేటట్లు చేయడానికి
ఐరన్
ఆరోగ్యవంతమైన రక్తానికి
కాల్షియమ్ మరియు ఫాస్ఫరస్
దృఢమైన ఎముకలు మరియు పండ్ల కోసం

# సిరిలాక్ సంపూర్ణ పోషకాహారాన్ని రుచికరమైన విధంగా అందజేస్తుంది

సిరిలాక్‌లో అయిదు రకాల పోషకాలు అన్నీ వున్నాయి—ప్రొటీన్లు, క్రొవ్వు పదార్థాలు, పిండి పదార్థాలు, ఖనిజాలు మరియు విటమిన్లు మీ పాపకి ప్రతి పర్యాయమూ సిరిలాక్‌తో తయారు చేసిన ఆహారం మీరు యిచ్చినప్పుడు ఈ పోషకాలన్నీ సరియైన పాళ్ళలో చేరి వుంటాయి.




కలసికట్టుగా పని చేయడం వలన ఈ పోషకాలన్నీ హెచ్చు తగ్గులు లేకుండా ముఖ్యమైనవే అందుకే అన్ని పోషకాలు 'సంపూర్ణం'గా వున్న సిరియల్ ఆహారం మీ పాప ఆరోగ్యానికి అత్యావసరం. ప్రతి సిరిలాక్ ఆహారం మీ పాపకి ఒక రోజుకి కావలసిన పోషక పదార్థాలలో సొల్లవ వంతుని అందచేస్తుంది ఈ ఆహారం యిస్తున్నప్పుడు పోషక పదార్థాల కోసం మరొకటి మీరు యివ్వవలసిన అవసరం లేదు.

మీ పాపకి చనుపాలే తగినవి అయితే పాపకి నాలుగు నెలలు వచ్చి ఘన పదార్థాలు తీసుకోడానికి సిద్ధంగా వున్నప్పుడు, మీ డాక్టర్‌ని సంప్రదించి సిరిలాక్ యివ్వడం ప్రారంభించండి.

## సిరిలాక్®
పాలు వుండనే వున్నాయి




SAA/FSL/C/3151 TEL



"ఈ శని ఎదురొచ్చిందేమిటే...శుభమాని డాక్టరుగారి దగ్గరకెళుతుంటే. ఏం చెప్పి కొంపలు ముంచుతాడో ఏమో ఆ డాక్టరు." చంద్రావతి చంటిని తన ఒళ్ళో వేసుకుంటూ అంది.

చంటి కెవ్వుమని మొరాయించి మళ్ళీ తల్లి ఒళ్ళోకి మారింది. "మీ అనుమానాలతో నన్ను భయపెట్టకండత్తయ్యా" అంది అమర ముఖం అసహనంగా పెట్టి.

సుమారుముప్పావుగంటతరువాత హాస్పిటల్ చేరుకున్నారు. పేషెంట్స్ ఎక్కువేం లేరు. నలుగురైదుగురు మాత్రం వరండాలో బెంచీ మీద కూర్చుని వున్నారు. అట్టే ఆలస్యంలేకుండా మధుసూదన్‌కి పిలుపొచ్చింది. అమర చంటిని తీసుకుని మధుసూదన్ వెనకే కన్సల్టింగ్ రూమ్‌లోకి నడిచింది.

"ఏమిటమ్మా కంప్లెయింట్ ?" డాక్టర్ అడిగాడు.

"పాపకి నెల్లాళ్ళనుంచి ఆకలి బొత్తిగా పోయిందండీ !'

"ఊఁ... పాప పేరు ?" పేపర్‌మీద పెన్నుంచుతూ అడిగాడు.

"ఇంకా పెట్టలేదు. చంటి అంటాం మేమంతా." మధుసూదన్ చెప్పాడు.

డాక్టర్ ఆ పేరే వ్రాసుకున్నాడు. పాప పొట్టనొక్కి చూశాడు. నాలుక తెరవమన్నాడు కళ్ళు పరీక్షిస్తూ డాక్టర్ అనుమానంగా ఆగి పోయాడు.

"పాపకు జాండిస్ అని అనుమానంగా వుంది. బ్లడ్ టెస్ట్...- యూరిన్ టెస్ట్ చెయ్యాలి. తెల్లకామెర్లు కావటాన మీరు గమనించలేక పోయుంటారు. అయినా ఆకలి మందగించినప్పుడే నా దగ్గరకు రావల్సింది." డాక్టర్‌గారి మాటలు వింటున్న అమరకు తల తిరిగిపోయింది. "జాండిస్... కామెర్లు..." ఆమె గుండె కొట్టుకుంది. వెంటనే రామరాజు గారి పాప కళ్ళముందు మెదిలి వణికిపోయిందామె మనసు.

మధుసూదన్ పాపను బయటకు తీసుకెళ్ళి యూరిన్ తెచ్చిచ్చాడు. నర్సు పాప చేతిమీద పిన్ గుచ్చి రక్తంతీసుకుంది. చంటి కెవ్వుమంటుంటే అమర హృదయం విలవిల్లాడింది.

"సాయంత్రం... ఏ విషయం చెబుతాను" డాక్టరు అన్నాడు.

"మాది ప్రక్క పల్లె డాక్టర్ ఇప్పుడువెళ్ళి మళ్ళీ రావాలంటే కష్టం. ఓ గంట బయట కూర్చుంటాం. మీ రిపోర్ట్స్ యివ్వలేరా ?" అడిగాడు మధుసూదన్.

డాక్టర్ ఒక్క క్షణం ఆలోచించాడు. "ఆల్‌రైట్... వరండాలో కూర్చోండి." ఆయన లేచి ప్రక్కరూమ్‌లోకి వెళ్ళాడు.

# ఎదురుగాలి

"ఏమన్నారే డాక్టర్ ?" కన్సల్టింగ్ రూమ్‌లోంచి బయటికి వస్తున్న కోడలని ఆదుర్దాగా అడిగింది చంద్రావతి.

"దిష్టి తగిలిందన్నారు. ప్రిస్క్రిప్షన్‌కూడా వ్రాశారు. ఓ వీశెడు మిరపకాయలూ... పావుకిలో ఉప్పు."

అమర మాటలకు అంత బాధలోనూ పక్కున నవ్వొచ్చింది మధుసూదన్‌కి. చంద్రావతి అయోమయంగా చూసింది ఇద్దరివైపు.

"అవున్లెండి నా బిడ్డకు బాగా లేకుంటే మీకు నవ్వొస్తోంది." అమర చంటితల్లి మధుసూదన్‌కి కూడా కూతురేనని మర్చిపోయిందా క్షణం.

ఆమె కళ్ళలో కన్నీరు చివ్వున వూరింది, చంటిపాపను గట్టిగా హృదయానికి హత్తుకుంది

"ఒక్కరూ చెప్పరేమ్రా ?" చంద్రావతి ఆరాటంగా చూసింది.

"పాపకు కామెర్లంటున్నారమ్మా." మధుసూదన్ బాధగా తల విదిల్చాడు.

"అయ్యో .. నిజమేనటే ?" చంద్రావతి చంటిని చేతుల్లోకి లాక్కుంది.

"నిజమే" నీరసంగా వుంది అమర స్వరం.

చంద్రావతి కాసేపేదో ఆలోచనలో మునిగి పోయి చటుక్కున తలెత్తి మధువంక చూస్తూ అంది "అబ్బాయ్ మధూ... కామెర్లకి ఈ ఇంగ్లీషు మందులూ అవీ వాడకూడదురా. దీనికి వేరే వైద్యముంది. పసరుపోసి దండవేయించాలి. మనవూళ్ళో రాంబాయమ్మ కామెర్లకి మందిస్తుందే."

అమరకు అరికాలిమంట నెత్తికెక్కింది చంద్రావతిని చూస్తుంటే. 'అత్తయ్యా! అసలు మీవల్లనే పాపకు జబ్బొచ్చింది. దానికి ఆకలి తగ్గిన మొదట్లోనే డాక్టర్‌కి చూపించి వుంటే ఇంతవరకూ రాకపోను. దిష్టితగిలిందంటూ చాదస్తంగా మాటాడి అనవసర కాలయాపన చెయ్యటంతో దాని వ్యాధి ముదిరిపోయింది. పైగా ఇప్పుడేమో మందులన్నా వాడనీకుండా దండలూ హారాలూ అంటూ మొదలెట్టారు. రాంబాయమ్మలూ, చేదబాయమ్మలూ ఏంచెయ్య గలరు? మీరు అట్టే మాటాడక మెదలకుండా కూర్చోండి మా పాట్లేవో మేం పడతాం" అమర వళ్ళు మరిచిపోయింది.

"చిన్నా పెద్దా లేకుండా ఏమిటా దూకుడు ?" చంద్రావతి అహం దెబ్బతిన్నది.

"మిరవటంలేదూ... వూర్లోవాళ్ళందర్నీ ఎంతమాటంటే అంతమాటా. అసలు నన్నడిగితే ఆ అలమేలు ఉసురే తగిలింది మన కొంపకు. అస్తమానం ఆవిడను ఆడిపోసుకోబట్టే యిలా గయ్యింది."

చంద్రావతి ముఖం మలినమైంది. ఇద్దరి వాదనలూ వినలేకపోతున్నాడు మధుసూదన్.

"ఇది ఇల్లుకాదు... హాస్పిటల్. గుర్తుందా ఇద్దరిలో ఒక్కరికైనా ?" కోపంగా అన్నాడు.

అమర మౌనంగా తల దించుకుంది. గంట ఓ యుగంలా గడిచింది. డాక్టర్ రమ్మన్నాడు.

"పాపకు ఖచ్చితంగా జాండీసే. ఏమంతగా ముదరలేదు. సరైన సమయానికే వచ్చారు." డాక్టర్ ప్రిస్క్రిప్షన్ వ్రాస్తూ అన్నాడు.

అమర గుండెలు తేలికపడ్డాయి.

"చూడండి... ఈ మందులన్నీ శ్రద్ధగా వాడండి. పాపను రెండు రోజులకోసారి నాకు చూపిస్తుండండి."

"అలాగే డాక్టర్" మధుసూదన్ తలా డించాడు అతనికిప్పుడు మనసు కుదుటపడింది.

డాక్టర్ దగ్గరనుంచి వెళ్ళి బజార్లో మందులు కొనుక్కుని ఇంటికి బయలుదేరారు దార్లో చంద్రావతి ఏం మాటాడలేదు. ఆమె ముఖం చిన్నబోయే వుంది. అమర అత్తగారి వాలకం గ్రహించక పోలేదు. 'ప్చ్... పాపం ఏదో పెద్దది. తనేమైనా అతిగా మాటాడిందేమో !' మౌనంగా నిట్టూర్చింది.'

మళ్ళీ అంతలోనే అలమేలు ముఖం గుర్తు కొచ్చి అత్తగారిమీద జాలి ఎగిరిపోయింది. 'అలమేలు స్వతహాగా చాలా కలివిడి మనిషి. అందర్నీ నోరారా పలకరిస్తుంది. అలాంటి మనిషిని పట్టుకుని ఎంత ఎద్దేవాగా మాటాడు తుంది అత్తయ్య !'

ఆలోచనల్లోనే ఇల్లొచ్చేసింది. చంటితల్లి భుజంమీదే నిదురపోయింది. మెల్లగా పాపను ఊయల్లో పడుకోబెట్టింది అమర. చంద్రావతి అలసటగా మంచంమీద కూర్చుంది. మధుసూదన్ బయటనుంచే పొలంవేపు వెళ్ళాడు.

"అత్తయ్యా! కాళ్ళుకడుక్కుందాం రండి" అమర అత్తగారిని పలకరిస్తూ పెరట్లోకి నడిచింది.

బావిమీద చేదవేస్తుంటే ప్రక్కపెరట్లోంచి అలమేలు గొంతు మరో గొంతు పెద్దగా వినిపించాయి.

"ఏవమ్మా అలమేలూ ! ఉదయం పట్నానికి బయలు దేరినట్టున్నావు... వెళ్ళ లేదేమిటి ?"

"అయ్యో నారాతా ! వెళదామనే ఇంటికి తాళం కూడా పెట్టానొదినా. అలా గుమ్మం దాటానో లేదో శనిగ్రహంలా ఎదురొచ్చింది అమరేశ్వరి. దాని ముఖం మండ... ఏ నక్షత్రంలో పుట్టిందోగాని... అది ఎదురొచ్చిందంటే ఎలాటి పనయినా ఖాళీ అంతేనా ! ఏదో కీడు జరిగితీరుతుంది. నీకు తెలియకేం వదినా ! మొన్నటికి మొన్న ఓసారిలాగే పట్నంవెళుతుంటే ఈ జ్యేష్ఠాదేవతే ఎదురొచ్చింది. ఆఁ... కాని లెమ్మని వెళ్ళినా... బొడ్లోని వందరూపాయలు పోయాయి. కారుకింద పడబోయి క్షణంలో తప్పించుకున్నాను. వెధవ పని ఈరోజు కాకుంటే

### కీర్తిశేషులైన

# రెంటాల వేంకట సుబ్బారావు గారు



పురుషుల మహత్వమునకు సాధనంబులనేకములు. త్యాగము విజ్ఞానము వినయము ధైర్యము సాహసము దయ శౌచము వితరణము అహంకారము మహత్వమునకు సాధనంబులు. సత్త్వశీలమువలె రాజసశీలమును మహత్వమునకు సాధనంబగుచున్నది దశావతార చరిత్రములందు రాజసగుణము ప్రముఖము. సర్వేశ్వరునకు నిగ్రహానుగ్రహములు సమాన ధర్మములు శిష్టరక్షణమువలె దుష్టశిక్షణమును పరను ధర్మము మానవులందు రాజసభావరహితులైన దైవసంపన్నులు దుర్లభులు సకల సద్గుణ సంపన్నతకు సర్వేశ్వరుడే ప్రమాణము. ఒక భావమునైనను సంపూర్ణముగ వికసింపజేయగలిగిన మానవుడు ధన్యుడు కర్ణుడహంకార ప్రేరితుడైనను దానశీలము శాశ్వతమైన కీర్తిని గణించినది. మానవుల యౌన్నత్యమును పరిశీలించునపుడు వారి జీవితములందలి పరమార్థమును గ్రహించుట భావ్యము. ఇతర విషయాధారమున మూలభావమును మాటు పరచుట యనుచితము ప్రతిభావంతుల జీవితములందొక విధమైన గుణశీల సంఘర్షణము సహజము. ప్రతిభావంతులకు సామాన్యాచార వ్యవహారములు కష్టసుఖములు జీవవికాసమునకు ప్రతిబంధకములుగావు. అన్ని దశలయందును ప్రతిభావంతులు జీవమాహాత్మ్యమును గనుకొనుచుందురు.

రెంటాల సుబ్బారావు పంతులుగారాంధ్రపుత్రులందు ప్రతిభావంతులని వారి జీవితచరిత్రమును విమర్శించినవారలకు విదితము గాగలదు. సుబ్బారావుపంతులుగారి ప్రతిభకు వారి ఆత్మగౌరవము ఆత్మవిశ్వాసము మేధాశక్తి చిత్తస్థైర్యము ఔదార్యము గాఢానురాగము ముఖ్యకారణములు ఈ సుగుణములు వారి వ్యక్తిత్వమును స్థాపించుచున్నవి. ధనముపోయినను నాప్తబంధువులు గతించినను చిత్తస్థైర్యమును గలిగి యుండుట కష్టసాధ్యము సుబ్బారావు పంతులుగారు ఆరువేల నియోగులు. గుడివాడ తాలూకాయందలి చెన్నూరు జన్మస్థానము. చెన్నూరు కరణము శేషయ్యగారు జనకులు. ఆరంభ విద్యను మందపాడునందు నివసించుచు గుడివాడ యందభ్యసించిరి మచిలీ బందరునందు ఎఫ్. ఏ. పరీక్షకు చదివి కృతార్థులైరి తల్లి బాల్యమునందే పరలోకమునకేగుటవలనను బందరునందు విద్యాభ్యాసము చేసెడి కాలమునందు మాకర్లవారి సత్రమునందు తండ్రికి రెండు పూటలను అన్నము వండిపెట్టుచు రాత్రులందు తాటాకు పొయ్యి మంట యెదుటను పాఠములను చదివినటులు పంతులుగారు వారి యాప్తులకు చెప్పుచుండిరి. విద్యార్థి వేతనమునుబడసి చెన్నపురి క్రైస్తవ కళాశాలయందు బి. ఏ. పరీక్షను చదివి కృతార్థులైరి చెన్నపురియందలి సింక్లరు పాఠశాలయందును గుంటూరునందలి అమెరికను మిషను పాఠశాలయందును ప్రధానోపాధ్యాయులుగ నుండి విద్యా శిక్షణమునందు మంచి సామర్థ్యమును జూపిరి. ఉపాధ్యాయ వృత్తి యందున్నపుడె 1880వ సంవత్సరమునందు సులభ గ్రాహ్య గ్రంథమాలా రచనకు (మేడ్ ఈజీ సీరీస్) బూనుకొనిరి. ఆ కాలమునందు విద్యార్థులకు గ్రంథమాల వరదాయినిగ నుండెను. ఏ పుస్తకమును చదువకున్నను సుబ్బారావుపంతులుగారి గ్రంథమాలను జదివిన వారలకు గెలుపు సాధ్యముగనుండెను. ఆ గ్రంథమాలయందు సాధ్యమైన ప్రశ్నలుత్తర సమేతముగా వ్రాయబడియుండెను. ఈ గ్రంథమాల వలనను నెలకు అయిదారు వందల రూప్యముల లబ్ధి కలుగుచుండెను. కాని గుంటూరు విడిచి చెన్నపురికి వచ్చునపుడు అప్పు చేయవలసిన స్థితి గలిగినదని తెలియుచున్నది. చెన్నపురి యందు పరీక్షను నుపాధ్యాయులుగ నుండి చదివి కృతార్థులై హైకోర్టు వకీలుగ జేరిరి. ఆ కాలమునందు చెన్నపురికి గమనాగమనములకు సులభమైన రైలు మార్గములు లేవు. చెన్నపురి రాకపోకలకు సముద్రము కాలువలు సాధనములుగ నుండెను ఉత్తరాదివారికి చెన్నపురియందాంధ్రుల సాహచర్యము దుర్లభముగనుండెను అయినను పంతులుగారు సాహసించి చెన్నపురినందు నివాసమును గైకొని ప్రతిభను గడించెను కాని ఉత్తర మండలముల యభిమానము మాత్రము వారి జీవితాంతము వరకును పోలేదు. ★

**ఆంధ్రపత్రిక**
**1918 మార్చి 27**
**సంచిక నుంచి**

రేపవుతుంది. ఆ అమ్మతల్లి ముఖం అలాటిదని తెలిసీ వెళ్ళాలంటే కాళ్ళాడలేదు సుమా!" అలమేలు స్వరం గంటకొట్టినట్టు విన్పిస్తోంది.

"అరవకమ్మోయ్ అలమేలూ. వింటుందేమో!" గుసగుసగా అంది ఆవిడ

"ఆఁ... లేదులే. పాపం తగలడింది." అలమేలు ఈసడింపుగా అన్నది.

అమరేశ్వరికి కాళ్ళు తూలినట్టు అన్పించింది. చెయ్యి వణికింది. చేతిలోని తాడు జారి చేద చటుక్కున బావిలో పడింది

"అయ్యయ్యో! అదేమిటే అమరా. చేద బావిలో వేశావ్" చంద్రావతి కంగారుగా వచ్చింది.

"చెయ్యి జారిందత్తయ్యా." అమర వంగి బావిలోకి చూసింది.

"బావిలోని నీళ్ళు నల్లగా మెరుస్తున్నాయి. ఇప్పటిది కాదీ బావి. తరతరాల నుంచి ఈ మూఢనమ్మకాలలాగే నిశ్చలంగా సుస్థిరంగా వుంది. తనలాంటి వాళ్ల ఆదర్శాలు బావిమీద వేసిన చేదలే. ఎంత తోడిపోసినా ఆ జల తరగదు. చివరికి ఈ చేదలాగే ఆదర్శాలు కూడా ఎప్పుడో... ఎక్కడో... పుటుక్కున తెగి అగాధంలో ఆనవాలు లేకుండా మునిగిపోక తప్పదేమో!!" అమర కళ్ళనుంచి రెండు వెచ్చటి కన్నీటి చుక్కలు చప్పున రాలి బావిలోని నీటిలో కలిసిపోయాయి.






**తె**ల్లవారి లేచి అతి ముభావంగా తమ పనులన్నీ చేసుకుంటూ వెడులోందే గాని— నవీన్‌తో గాని— ప్రవీణ్‌తో గాని ఒక్కమాట మాట్లాడ లేదు సింహళ.

నవీన్ ఒకటి రెండుసార్లు ఆమె తనని పలకరిస్తుందేమోనని చూశాడు.

సింహళేనా అంత పౌరుషం లేనిది ! అసలు పలకరించలేదు— తనతో మాట్లాడకపోతేమానె ప్రవీణ్‌తో ఏమన్నా మాట్లాడుతుందేమోనని రంధ్రాన్వేషణ ప్రారంభించాడు.

అది కూడా సులభంగానే పసిగట్టిన సింహళ మరిదిలోనూ మాట్లాడలేదు.

స్టూడియోకి పోతున్నానంటూ నవీన్ వెళ్ళిపోయాడు.

సింహళ వంట చేస్తోంది.

''సింహళా ! రాత్రి ఎందుకంత కఠినంగా మాట్లాడాడు అన్నయ్య ? ఎందుకు నువ్వు అనవసరంగా ఆ ప్రశ్నవేసి అంతమాట పడ్డావు?'' అని అడిగాడు ప్రవీణ్.

సింహళ ముందు మాట్లాడలేదు. తర్వాత మెల్లగా తలెత్తి '' నిన్న ఆయన కోసం ఎవరో డైరక్టరట ఇంటికి వచ్చారు. ఆయన డైలాగులు రాస్తూ అక్కడ స్టూడియో దగ్గరే వున్నా రన్నాను.

## (గత సంచిక తరువాయి)

అందుకాయన నిన్న సాయంత్రం నాలుగున్నరకి ఇంటికి వెళ్ళిపోతున్నానని చెప్పి వెళ్ళారని – అర్జంటు పని అవడంచేత ఇంటికి వచ్చానని వస్తే తను వచ్చి వెళ్ళినట్టు చెప్పమని చెప్పి వెళ్ళాడు.

అందుకే అడిగాను— నాలుగున్నరకి బయలు దేరిన మనిషి అయిదున్నరకి కాదుగదా రాత్రి పదకొండుదాకా రాకపోతే నేను భయపడ్డాను ఏమయ్యారో అని. అందుకే అడిగాను. అది మహాపరాధంగా కనిపించింది ఆయనకి'' అంది కళ్ళు వత్తుకుంటూ.

అంతా విని మౌనంగా అవతలకి వెళ్ళి పోయాడు ప్రవీణ్.

## 13

''వినోద్ బాబురమ్మన్నారు'' అంటూ వచ్చిన కబురు అందుకున్నాడు అమలేశ్వర్.

''ఎవరిని ?'' అని అడిగాడు.

''మిమ్మల్ని – మీ మరదలుగారిని.''

ఆ మాట విని ముఖం చిట్లించింది సమత.

''వస్తాంలే వెళ్ళు'' అంటూ అతన్ని పంపించివేసి –

''సమతా ? ఎందుకంటావు మనల్ని పిలిచింది ?'' అని అడిగాడు సాలోచనగా.

''ఎందుకైనాగాని, నిన్ను పిలిస్తే బాగుం టుందిగాని నేనెందుకు బావా తడవ తడవకీ'' అంది సమత కాస్తంత కోపంగా.

''మనిద్దరం జహంగీరు – నూర్జహాను అని ఏనాడో సెలవిచ్చిన మహానుభావుడు గదా అతను ? అందుకని జాయింటుగా రమ్మని వుంటాడు'' అన్నాడు

''వాడి బొంద. వాడేం అంటే ఎవడికి కావాలి గాని—రేపు మటుకు నేను రాను— నువ్వు వెళ్ళు.'' అంది ఖచ్చితంగా సమత.

''సరేలే ! నేనే వెళ్ళివస్తాను.'' అన్నాడు అమలేశ్వర్

''వెళ్ళిరా ! ప్రతిదానికీ నేను కూడా ఎందుకు ?'' అంది సమత.

మర్నాడు తను ఒక్కడే వెళ్ళాడు అమలేశ్వర్

అతని రాక కోసమే వేచివున్నట్టు బయట వరండాలోనే వున్నాడు వినోద్.

అమలేశ్వర్ అతన్నిచూసి ''గుడ్‌మార్నింగ్'' అన్నాడు

''గు డ్ మా ర్నిం గ్ ! రా ! కూర్చో !'' అంటూ కుర్చీ చూపించాడు.

మెల్లగా అందులో కూర్చున్నాడు అమలేశ్వర్.

''ఏది నీ కుడిభుజం ?'' అని అడిగాడు వినోద్ నవ్వుతూ.

''నా కుడిభుజం నా దగ్గరే వుంటుంది. ఇంటిదగ్గర దాచిరానుగదా !'' అన్నాడు తెలివిగా నవ్వుతూ అమలేశ్వర్.

''కుడిభుజం అంటే నీ శరీరభాగం కాదు మిత్రమా ! నీ మరదలు మాణిక్యం'' అన్నాడు వినోద్, ఆమాత్రం తెలీదా అన్నట్టు.

''ఆవిడ ఇంటిదగ్గర వుంది.''

''ఏంపాపం ? ఇక్కడికి రానందా ?''

''ఆవిడగారు ఏమన్నా మనం పుట్టించుకో వలసిన పని లేదులెండి విషయం ఏమిటో తెలియ జేస్తే సంతోషిస్తాను.'' అన్నాడు అమలేశ్వర్.

''అయితే నీ లైఫ్‌లో ఆమె అంత ఇంపార్టెంటు కాదంటావు అంతేనా ?'' అని అడిగాడు వినోద్.

''మీరు ఎలా అనుకున్నా నాకు ఇబ్బంది లేదు. కాని విషయం తెలియజేస్తే సంతో షిస్తాను.''

''చెబుతున్నా విను. నీ దగ్గర ఏ మాత్రం వుంది డబ్బు ?'' అనడిగాడు వినోద్.

''డబ్బా ! నా దగ్గరా! మీ రిచ్చిన పూజారి పోస్టుకి వందలు—వేలు కూడబెట్టున్నాననుకుం టున్నారేమిటి ?'' అని అడిగాడు అమల్ నవ్వుతూనే.

''పోనీ అందులో కాకపోయినా విడిగా అయినా మనిషన్నాక డబ్బు లేకుండా ఎలా వుంటుంది ?'' అని అడిగాడు వినోద్.

**జరిగిన కథ — 7 :** సమత, అమలేశ్వర్ — జొలయ్య దగ్గరకు వచ్చి వెండి గ్లాసు తాకట్టుపెట్టి యాభై రూపాయలు తీసుకొని హరి దగ్గరకు వెళుతారు. జొలయ్య దగ్గరి వెండి సామానంతా దొంగలించుకు వస్తాడు హరి. దానిని సమత, అమలేశ్వర్, హరి మూడు భాగాలుగా చేసి అమ్మేసారు. సమత తన భాగం డబ్బు అమలేశ్వర్‌కు ఇచ్చేస్తుంది. హరి తన భాగం డబ్బుతో టీ షాపు పెడతాడు. సింహళ, నవీన్ మద్రాసులో కాపురం పెడతారు. నిర్మాత సినీ దర్శకులు అయిన చక్రధరరావు నవీన్ రాసిన కథను పిక్చరు తీయాలనుకుంటు న్నట్లు, ఆ సంగతి మాట్లాడను చక్రధరరావు నవీన్‌ను ఆహ్వానించినట్లు నవీన్‌తో చెపుతాడు సంజీవరావు. వినోద్ అమలేశ్వర్‌కు గుడిలో పూజారి ఉద్యోగం ఇచ్చాడు. నవీన్ తమ్ముడు ప్రవీణ్ కువైట్ నుంచి వచ్చాడు. రాత్రి బాగా తాగివచ్చిన నవీన్ తమ్ముడిని గుర్తించక ఎవరో అనుకొని సింహళను అనుమానిస్తాడు. సింహళకు పూలపానుపు అనుకున్న జీవితం నరకం అయ్యింది. అమలేశ్వర్, సమత కారులో పోతున్న దంపతుల దగ్గర నగలు దోచుకొని గుడిలో దాస్తారు. హిందీ చిత్రరంగంలో అప్పుడప్పుడే పైకివస్తున్న తార కాంతి నవీన్‌కు పరిచయమౌతుంది. దినదినానికి నరకతుల్యమవుతున్న తన జీవితాన్ని తలచుకొని కుమిలిపోతుంది సింహళ.



ఆ మాటకి వచ్చే నవ్వు ఆపుకున్నాడు అమలేశ్వర్.

"వెనకటికి ఎవరో కోడిగుడ్డంత బంగారం లేనివారుంటారా అని అడిగాడట ఓ పెద్ద మనిషి— అలా వుంది మీరు చెప్పేది."

"అటులే నీదగ్గర మనీ ఏం లేదంటావు."

"అనే చెప్పాలి ?"

"అయితే ఒకసారి నీ అదృష్టాన్ని పరిశీలించుకోరాదా ?" అని అడిగాడు వినోద్

"దేనితో ? లాటరీ టిక్కట్లతోనా ?" అని ఎదురు ప్రశ్న వేశాడు అమలేశ్వర్.

"కాదు గుర్రప్పందాలతో,"

"నాకు ఆ గోల తెలియదు, ఎందుకొచ్చిన బెడద ?" అడి అడిగాడు అమల్

"ఇందులో తెలియకపోవడం ఏముంది ?ఏదో నీకు తోచిన గుర్రాల మీద నాలుగు టిక్కట్లు వేయడమే— వస్తే వస్తుంది లేకపోతే లేదు.' అన్నాడు వినోద్.

"వస్తేవస్తుంది. పోతేపోతుంది. అంటూ వేసి తగలేసుకోవడానికి తగిన డబ్బు లేదు—అంత ధైర్యం లేదు—నన్నెందుకారొంపిలో దింపుతారు? ఏదో ఓ ఉద్యోగం ఇచ్చారు కష్టాన్ని, రామ అనుకోమని." అన్నాడు అమలేశ్వర్.

"ఏదీ నీ చెయ్యి !" అని అడిగాడు వినోద్. ఆ మాటలు వినసట్టు అమలేశ్వర్ తన కుడిచెయ్యి ముందుకు చాపాడు.

"ఓయినీ! ఏలూరు రోడ్డు అంత రేఖ నీకు అకస్మాత్తుగా లాభం వుంటే ఇంకా ఎందుకోయి అలా మీనమేషాలు లెక్కపెడతావు?"అని అడిగాడు వినోద్.

ఆ మాట పన్నీటి జల్లులా సుమధుర నాదంలా సోకింది అతనికి. నిజమా ! తనకి అకస్మాత్తుగా లాభం వుందా ? అంటే తను ఏ లక్షాధికారో — కోటీశ్వరుడో అయిపోతాడన్న మాటే ! తన కలలు ఫలిస్తాయన్నమాట.

మంచి బంగళా—నౌకర్లు చాకర్లు—కార్లు—ఫోన్లు— అబ్బ వూహించుకుంటేనే ఇంత అద్భుతంగా వుంది. ఇక నిజంగా అనుభవిస్తే ఎంత బాగుంటుందో అనుకున్నాడు తీయని కలల్లో తేలిపోతూ.

"ఏమిటోయ్ ! అలా తపస్సమాధిలో మునిగిపోయావు ?" అంటూ వినోద్ ప్రశ్నించే వరకూ అలా కలల అలల్లో తేలిపోతూనేవున్నాడు అమలేశ్వర్.

"ఏం లేదులెండి—మీరిప్పుడు అన్న మాటని గురించి ఆలోచిస్తున్నాను."

"ఎందుకే ఆలోచించడం—రేపు జరగబోయే రేసెస్‌కి మనిద్దరం వెడదాం, బొంబాయి." అన్నాడు వినోద్.

"బొంబాయా ?" అన్నాడు ఆశ్చర్యంగా చూసి.

"అవునోయ్ ! టిక్కెట్లు తెప్పిస్తాను.

# మారేడు దళం

ట్రయిన్‌లో వెడదాం. లేదంటే హాయిగా మన కారులో వెడదాం'' అన్నాడు వినోద్.

''ఏమైనా నేను ఆలోచించుకుని చెబుతాను.'' అన్నాడు అమలేశ్వర్.

''ఆలోచించుకో! మీ మరదల్ని కూడా తీసుకురా! పాపం ఆమెమటుకూ బొంబాయి ఎప్పుడు చూస్తుందని!'' అన్నాడు వినోద్.

అలాగేనన్నట్టు తలవూపి లేచాడు అమలేశ్వర్.

''రేపు నేను గుడివైపు వస్తాను — ఏ విషయం చెప్పాలి.'' అన్నాడు వినోద్ లేచి నిలబడి.

అది తను వెళ్ళమనడానికి సూచనగా గ్రహించిన అమలేశ్వర్ చటుక్కున లేచినిలబడి ''అలాగే మరి వెళ్ళివస్తాను.'' అంటూ గబగబా బయటకు నడిచాడు.

వినోద్ తనలో తనే నవ్వుకుంటూ పైకి వెళ్ళిపోయాడు. ఇంటికి వచ్చేసరికి బావగారి రాకకోసమే కనిపెట్టుకుని వుంది సమత.

అతన్ని చూడగానే ఆమె హృదయ భారం కొంచెం తీరింది. అక్కడ సార్థక నామధేయుడని పించుకునే తన బావకి — వినోద్‌కి మధ్య ఏం ఘర్షణ రేగుతోందో అని, ఇంటిదగ్గర వున్నదన్న మాటేగాని సమత మనసు మనసులో లేదు.

ఇప్పుడు అతి మామూలుగానే కనిపిస్తున్న అమలేశ్వర్‌ని చూశాక అంతవరకూ మనస్సు నావరించుకునివున్న భయ జీమూతాలన్నీ తొలగి పోయాయి.

''ఏమిటి బావా? విశేషాలు?'' అని అడిగింది మెల్లగా.

''ఏం లేకేం! చాలావున్నాయి. అలా స్థిమితంగా కూర్చో చెబుతాను'' అన్నాడు తన ఎదురుగా ఉన్న కుర్చీ చూపించి.

కూర్చుంది సమత. ఆమె ముఖంలో కనిపించే ఆసక్తి — కళ్ళల్లో ప్రతిఫలించే ఉత్కంఠ గమనించాక అతని మనస్సు సంతుష్టి పడింది.

''వినోద్‌గారు ఈ రోజు ఒక గొప్ప మాట సెలవిచ్చారు'' అన్నాడు నవ్వు ముఖంతో అమలేశ్వర్.

''ఏమిటది?''

''నాదిచాలాఅదృష్టవంతమైనచెయ్యి అట. చేతిలో అకస్మాత్తనలాభం రేఖ ఏలూరు రోడ్డు అంత పొడుగ్గా వుందట'' అన్నాడు అమలేశ్వర్.

''అబ్బ! వినోద్ హస్తసాముద్రికం కూడా చెబుతున్నాడన్న మాట. మంచిదేగా?'' అంది నవ్వుతూనే సమత.

''మంచిదో కాదో తర్వాత ఆలోచిద్దాం— రేపు మనిద్దర్నీ బొంబాయి రేసెస్‌లో టిక్కట్లు వేయమంటున్నాడు— తనతోపాటు మనిద్దర్నీ బొంబాయి తీసుకుపోతాడట.''

''ఎందుకు? ఇద్దర్నీ కలిపి జాయింటుగా సముద్రంలో ముంచడానికా? ఏడ్చినట్టుంది తెలివి. నీకంత అదృష్టాన్ని పరీక్షించుకోవా లంటే పన్నెండు రాష్ట్రాల లాటరీ టిక్కెట్లు అమ్ముతున్నాడు మనపక్క కిళ్లీకొట్టు అబ్బాయి. వెళ్ళి 12 రూపాయలు తగలేయి— పోతే పన్నెండుతోనే పోతుంది'' అంది ఖంగారుగా సమత.

''ఆ మాట నేను ముందే అన్నాను—అంటే దానికి ఆయన ఏకీభవించలేదు— బహుశ ఆయన దృష్టిలో లాటరీల్లో వచ్చేది డబ్బు క్రింద లెక్క కాదేమో'' అన్నాడు.

''ఆయన అభిప్రాయాలు ఏవైతే మన కేంలే! మనకా రేసులు వద్దు పాడూ వద్దు'' అంది సమత.

''అలా అంటే ఎలా? మనం మళ్ళీ మన జన్మలో బొంబాయి చూడబోయామా పెట్ట బోయామా? మనచేత గుడిలో ఫ్రీగా సర్వీస్ చేయించుకుంటున్నందుకు అతగాడి ఖర్చుమీద బొంబాయి వెడితే సరి. మనకి కాస్తయినా గిట్టుబాటవుతుంది.''

''సరిపోయింది— పిచ్చి ముదిరింది. రోకలి తలకు కట్టమన్నాట్ట వెనకటెవరో ఎవడో. అలా వుంది— అతనేదో అనడం— దానికి నువ్వు వంత పాడటమూనా?'' ''అబ్బ! అంత కోపగించు కోకు సమతా! అతను రేపు ఉదయం గుడి దగ్గరకు వచ్చి కూర్చుంటాడు మనం ఏంచేద్దాం?''

''రామని చెబుదాం భయమందేనికి?''

''పెద్దమనుషులతో వ్యవహారం. వెళ్లకపోతే బాగుంటుందా?''

''పెద్దమనిషి కానివాళ్లెవరులే బావా! అంతా పెద్దలే! ప్రస్తుతం ఆ పెద్దరికం మనకి వద్దని చెబుతున్నాను''

''ఆ మాట అయితే అతను వచ్చినప్పుడు నువ్వేచెప్పు. ఈలోగా నేనలా బందరు పోయి వస్తాను.''

''బందరా! బందరు దేనికి?''

''బొంబాయి సముద్రం చూడటం ఎటూ పడదు—కనీసం బందరు సముద్రాన్నయినా చూసి వద్దామని, నేను లేనని చెప్పవచ్చుగదా.''

ఆ మాటతో బావగారికి బొంబాయి ప్రయాణం అంటే మోజుగానే వుందని గ్రహించింది సమత.

ముఖం గంటు పెట్టుకుంటూ తిరుగుతున్న అతన్ని చూసేసరికి చాలా బాధ కలిగింది.

ఎంతైనా ఆడపిల్ల! అతనున్నంత కఠినంగా ఆమె వుండలేదు గదా!

''మరి ఖర్చులు అంటే ఏదో టిక్కెట్టు వరకూ పెట్టుకుంటాడనుకో. అక్కడ హోటల్ ఖర్చులు?''

''అవి మనమే పెట్టుకోవాలి.''

''మరి నీ దగ్గర డబ్బుందా?''

''నీకు తెలియని డబ్బు నా దగ్గరెక్క డుంది?''

''మరయితే టీ నీళ్ళకి కూడా వినోద్‌గారిని ఆశ్రయిస్తావా?''

''ఎందుకు? నా బ్యాంకీలో వున్న డబ్బు డ్రా చేస్తాను.''

''మరి అక్కడ నీకు దేవుడు మేలుచేస్తే లాభం వస్తుంది లేకపోతే వున్న డబ్బంతా పోతుంది అందుకు సిద్ధపడి వెళ్ళు'' అంది హెచ్చరికగా.

''వెళ్ళు అంటున్నావు, నువ్వు రావా?''

''నా దగ్గర డబ్బులేదు— జల్సాగా తగలేయ డానికి.''

''అదేం మాట— వున్నది ఇద్దరిదీని — నా ఒక్కడిదే అని నేను అనుకోవడం లేదు.''

ఆ మాటకు సమత హృదయం ఆనందంతో లాస్యం చేసింది.

''తన బావ అమాయకుడు — వినోద్ ఏ ఉద్దేశంతో ఇలా ప్రయాణాలు చేయించి గుర్రప్పందాలంటూ డబ్బు ఎందుకు తగలే యిస్తున్నాడో అసలు అర్థం కాదు—ఏమైన తన బావని తను కనిపెట్టుకోకపోతే ఎవరు కనిపెట్టు కుంటారు? ఆ బులబాటం ఏదో తీరితే గాని కనువిప్పు కాదు అతనికి'' అనుకుంటూ అతన్ని

## నర్సులుగా మరమనుషులు!

ఆస్పత్రులలో నర్సులు చేయవలసిన పనులకు మరమనుషుల ఉపయోగాన్ని గురించి పరిశీలనలు జరుగుతున్నాయి. కొన్నాళ్లకు ఆస్పత్రులకు మరనర్సుల అవసరమే కాదు, మరడాక్టర్ల అవసరం కూడా ఏర్పడవచ్చునని ''మోడరన్ హెల్త్ కేర్'' పత్రిక వ్రాసింది.

ముఖ్యంగా రోగుల పడకలు మార్చ వలసి వచ్చినప్పుడు, మంచాల మీదనుంచి రోగులను లేపటానికి మరమనుషులు పనికి వస్తారు. రోగుల సేవకులుగా కూడా మరమనుషులు ఉపయోగపడతారు.

ఒక ఆస్పత్రి మందుల షాపులో విద్యుచ్ఛక్తితో పనిచేసే మంచాన్ని అటూ యిటూ తీసుకుపోవటానికి, మందులను రోగులకు అందించటానికి, మరమనుషు లను ఉపయోగించుకొనవచ్చునని ఈ పత్రిక పేర్కొన్నది.

ఇంకో పాతిక సంవత్సరాలలో, ఒక డాక్టరు వందలాది కిలోమీటర్ల దూరాన ఉండి, మరమనుషులచేత ఆపరేషన్ల తతంగం నడించగలడని కూడా ఆ పత్రిక జోస్యం చెప్పింది!

శ్రేష్ఠమైన భావాలకు
ప్రతీకలైన నిలువులు

ఆప్కో వస్త్రాల అందాలు
గత వైభవ స్మృతులను
ప్రతిబింబింప జేస్తాయి.
ఆప్కో వస్త్రాల విస్తృత శ్రేణి —
షర్టింగులు, డ్రెస్ మెటీరియల్స్,
చీరలు, తయారీదుస్తులు మరియు
గృహోపకరణ వస్త్రాలు.



చేనేతలు




ది ఆంధ్రప్రదేశ్
స్టేట్ హేండ్లూం వీవర్సు
కోఆపరేటివ్ సొసైటి లిమిటెడ్
హైదరాబాద్-500 029

kiron/apco/84 g3

నీడలా అనుసరించడానికే నిర్ణయించుకుంది సమత.

# 14

తన పక్కన ఆదమరచి నిద్రపోతున్న నవీన్ కేసి చూసి తృప్తిగా నవ్వుకుంది కాంతి.

నవీన్ ఇప్పుడు తనవాడయ్యాడు. తను లేందే భోజనం చేయడు. తను లేందే డ్రింక్ తీసుకోడు — అతను సినిమా రచయితగా స్థిరపడిపోయాడు.

డబ్బు బాగానే వస్తోంది. ఎప్పుడో ఏ రాత్రివేళో ఇంటికి వస్తాడు. అతను వచ్చేసరికి సగం నిద్రలో వుంటుంది సింహాళ.

అప్పుడు తలుపు తీస్తే తూలుకుంటూ వచ్చి మంచంమీద వాల్తాడు.

ఆదేమని అడగడానికి వీలులేదు ఏమన్నా పడాలి — ఎలా వున్నాను సహించాలి. పైగా ప్రతిదానికీ అనుమానం — ముఖ్యంగా ప్రవీణ్‌తో మాట్లాడే ప్రతి మాటను — ప్రతి కదలికనూ వేయి కళ్ళతో గమనిస్తుంటాడు.

ఇదొకటి దుర్భరంగా వుంది ఆమెకి.

తను బి.ఏ. ప్యాసయింది ఎందుకీ చెర? హాయిగా ఎక్కడన్నా ఉద్యోగం చేసుకోలేదా? అని మనసు ఎదురుతిరుగుతూ వుంటుంది.

ప్రవీణ్ చాలా సున్నిత మనస్కుడు. స్వతహాగా చాలా తెలివైనవాడు కనుక పైకి చెప్పుకోకపోయినా సింహాళ మనసులో చాలా బాధ పడుతోందని—ఆమె ఒక వూబిలో ఇరుక్కున్నట్టు అనుక్షణమూ ఆవేదన చెందుతోందని సులభంగానే గ్రహించాడు.

ఆ రోజు మామూలుగా కాఫీలు కలిపి ముగ్గురికీ కప్పుల్లో పోసింది సింహాళ.

ఎవరూ కాఫీ త్రాగడానికి బయటకు రాలేదు

## మారేడు దళం

గదుల్లోంచి. అంచేత తనే ట్రేలో తీసుకుని ముందు నవీన్‌కి ఇచ్చి తర్వాత ప్రవీణ్ గదిలోకి వెళ్ళింది.

ఆమెని చూసి పడుకుని ఏదో ఆలోచిస్తున్న వాడల్లా చటుక్కున లేచి కూర్చున్నాడు ప్రవీణ్.

మౌనంగానే కాఫీ అందించింది. అతనూ మౌనంగానే అందుకున్నాడు. కాని నవీన్ మటుకు ఆమెని మధ్యలోనే ఆటకాయించాడు.

అతని మనోనేత్రం ముందు కదులాడే దృశ్యం వేరు.

సింహాళ కాఫీ తీసుకుని ప్రవీణ్ కివ్వడం — అతను ఆమె నడుంచుట్టూ చెయ్యివేసి దగ్గరకు లాక్కుని రెండు బుగ్గలూ ముద్దులతో ముంచి వేయడం — ఇదే అతని బుర్రలో గిరగిరా తిరిగేది.

అందుచేత సింహాళ అతని గదిలో ఎంత సేపు నిలబడుతుందో అని వాచీ చూసుకుంటూ వుంటాడు.

"ఏమిటి అంత సైలెన్సుగా వెళ్ళిపోతున్నావు? ఏం చేశాడేమిటి? ముద్దు పెట్టుకున్నాడా! దగ్గరకు తీసుకున్నాడా?" అని అడిగాడు నవీన్ వక్రంగా నవ్వుతూ.

ఆ మాటలకి మండిపోయినా తమాయించుకుంది సింహాళ. అయినా ఆమేదీ చిన్న వయసే— ఉప్పూ— కారం తినే మనిషే! అనవసరంగా అభాండాలు వేస్తుంటే ఎవరుమటుకు సహించగలరు?

"మీరు అనవసరంగా మాటలు తూలకండి. కాఫీకప్పు ఇవ్వగానే దగ్గరకు లాక్కుంటారా?" అని అడిగింది రోషంగా."

"పోనీ! చెయ్యి అయినా తగిలించాడా?"

ఆ మాటకి అసహ్యంగాచూసింది అతనికేసి.

"ఈ మనిషికి ఎలా మాట్లాడాలో కూడా తెలియదులా వుంది" అనుకుంది ఉడికిపోతూ.

"నన్ను డబాయించకు. వాడికి నువ్వంటే మోజు— నీకు వాడంటే మోజు— మొన్న అతని సూట్‌కేస్ తాళంచెవి నీకిచ్చి సూట్‌కేసు తెరిపించడం నేను కళ్ళారా చూశాను" అన్నాడు నవీన్.

"ఇకనేం? కళ్ళారా చూసిందానికి వేరే వ్యాఖ్యానాలెందుకు?" అని అడిగింది సింహాళ.

ఆ మాటతో వారిద్దరిమధ్యా ఏదో ఉందనే అభిప్రాయానికి వచ్చేశాడు నవీన్.

"నాకు తెలుసు. నేను పెద్దవాడిగా కనిపిస్తున్నానిప్పుడు నీ కళ్ళకి. వాడు ఎర్రఆగా బుర్రగా కుర్రాడని మురిసిపోతున్నావు. మీ మధ్య ఏదో ఉంది నాకు ఇదివరకే తెలుసు— లేకపోతే వాడు వదలకుండా ఇక్కడే ఎందుకు తిష్ఠవేస్తాడు? వాడి వలలో పడ్డావు— నేనంటే నీకు మోజు లేదు— అందుకే నేను నా జీవితంలోకి కాంతిని రప్పించుకున్నాను. ఆమె ఒడిలో అన్ని కల్లోలాలూ మరిచిపోతున్నాను." అంటూ నోటికి వచ్చినట్లల్లా అంటున్న మాటలని ఇటు సింహాళే గాదు, అటు ప్రవీణ్ కూడా విన్నాడు. తొలిసారిగా అతనికి అన్నయ్యంటే తగని అసహ్యం కలిగింది.

అనూరాధ మంచిపని చేసింది— నరకంలో జీవించకుండా. కాని పాపం అమాయకురాలైన సింహాళ మటుకూ ఈ గోతిలో దిగబడిపోయింది.

"ఈ రాక్షసుడి బారినించి ఆమె వెళ్ళిపోతే బాగుండు అతగాడికి బుద్ధి వస్తుంది." అనుకున్నాడు ఏహ్యతగా ప్రేమనే వెండిమబ్బులు కమ్మిన సింహాళ కన్నవారిని అతి సునాయాసంగా వదిలి ఇతని సరసకు వచ్చింది. ఇప్పుడా వెండి కరిగిపోయింది— మబ్బులు మాత్రం మిగిలాయి. రేపోమాపో అవి కారుమేఘాల క్రింద మారిపోతే కుంభవృష్టి కురవక మానదు

ఒక్కసారి అలా కుంభవృష్టి కురిస్తే తుఫాననంతరం ఏర్పడిన ప్రశాంత గంభీర వాతావరణంలా మారిపోతుంది ఆమె హృదయం.

ఆ శుభతరుణం కోసం ఎదురుచూస్తున్నాడు ప్రవీణ్.

కసేపిలాగే వాగివాగి శలవు పుచ్చుకున్నాడు నవీన్.

"ఛీ! ఈ మనిషి తత్వం పూర్తిగా తెలుసుకోకుండా తను తొందరపడింది—అందుకు ఫలితం తనిప్పుడు బాగానే అనుభవిస్తోంది." అని క్షణక్షణమూ బాధపడుతూనే వుంది సింహాళ.

ఇక్కడ పరిస్థితులు బాధాకరంగా పరిణమిస్తున్న కొద్దీ ఆమెకి తల్లిదండ్రుల మీద మనసు పోసాగింది.

[ఇంకా వుంది]



## వాడాంమేం దిగుమతిచేసిన 6-12 కొసల్ని-మా టూత్ బ్రష్‌లోని ఆ కొసలు తాకిన ప్రతిసారీ మీ చిగుళ్ళకూ పళ్ళకూ యిక ఆరోగ్య చికిత్స

మాయాలు కొనలైతే, మీ చిగుళ్ళను గాయపరుస్తాయి మి పళ్ళ తాలూకు జీవిత కాలాన్ని తగ్గించేస్తాయి.
అందుకే మరి ఒజెట్ సూపర్ డీలక్స్ టూత్ బ్రష్‌ను తయారు చేసేందుకోసం కేవలం దిగుమతిచేసిన 6-12 కొసలనే వాడతాం అంటే, ప్రపంచమంతటా సున్నితమైన, నాణ్యతగల టూత్ బ్రష్‌లను తయారుచేసే వారు వాడే వాటినే వాడతాం మరి

ఒజెట్ టూత్ బ్రష్ కొసలు తాకిన ప్రతిసారీ, అవి మీ చిగుళ్ళను మర్దనచేసి, వాటిని ఆరోగ్యవంతంగా, దృఢంగా తీర్చిదిద్దుతాయి ఆరోగ్యవంతమైన చిగుళ్ళంటే, దృఢమైన గట్టిపళ్ళన్నమాట.
ఒజెట్ కేవలం టూత్ బ్రష్ మాత్రమేకాదు- అది మీ చిగుళ్ళూ, పళ్ళూ-వీటి ఆరోగ్య చికిత్స.

ఇది **వోల్టాస్** ఉత్పాదన.



ముట్టుకు చూడండిక ఆ అనుభవం పొందండిక. నొక్కి చూడండిక. అలా వొదిలెయ్యండిక. చూడండిక. ఆ టూత్ బ్రష్ కొసలు యిక నెలల తరబడి ఎలా పనిచేస్తాయో ముచ్చటగా.

**ఒజెట్ సూపర్ డీలక్స్ పళ్ళకీ, చిగుళ్ళకీ పూర్తిగా పనికొచ్చే బ్రష్**




SPEER 88/83 TEL

# భారతీయ శాస్త్రీయ నృత్య సంప్రదాయం!

నృత్యం మానవ జీవితంలో ఎంతో స్పందనను కలిగించే నవరసాల మేలిమి ముత్యం! మన సంస్కృతిలో ఒక భాగంగా రూపుదిద్దుకొన్న నృత్యం ఈనాటి సంపదకాదు. తరతరాలుగా పదిలపరుచుకొంటూ మనం పెంచుకొస్తున్న అపురూప సమ్మోహనాస్త్రం! కళాత్మకస్ఫూర్తి నిచ్చే ఈ శాస్త్రీయ నృత్యం కేవలం వినోద సాధనంకాదు. మన ప్రాచీన విజ్ఞానాని కదొక సూచిక. నిష్ఠాగరిష్ఠమైన పరమ పవిత్రమైన భారతీయ నృత్య విశేషం నటరాజు లీలాతాండవ నిర్దేశం. ప్రళయరుద్ర తాండవంలోని ఆవేశం. గోపీకృష్ణుల విలాసం, భామాకలాపం, భక్తురాలి నివేదన, మాతృమూర్తి లాలన, ప్రేయసి అలుక

ఒడ్డిసీ నృత్య గణపతి వందన సంకేతం!
(నర్తకి : ప్రతిమా బేడీ)



ఇలా మానవ జీవితంలోని మధుర ఘట్టాల కన్నింటికీ ఎనలేని ప్రాభవాన్ని అందించే మన నృత్య సంపద మధించడానికి వీలుకాని సంప్రదాయ సాగర సంపద. ఈ మాట తిరుగులేనిది.

నందికేశ్వరుని అభినయ దర్పణంలో ఒక శ్లోకమున్నది. "సర్వం శివం. శివుని దేహం సమస్త విశ్వం, శివుని మాట వాగ్దేవికి ప్రతి రూపం, శివుని కదలిక, హావభావ విలాసం నాట్యానికి మూలకందం" అనే అర్థాన్నిచ్చే ఆ శ్లోకం నృత్యం ఎంత ఉత్కృష్టమైనదో స్పష్టం చేస్తుంది. పదవిక్షేపం, హస్త



తాళ భరత నృత్యం!
(నర్తకి : యామినీ కృష్ణమూర్తి)



గజాసుర సంహారం పిదప శివ విజయ సంకేత విలాసం! (నర్తకి : కె. కనక)

విన్యాసం, నయన విలాసం, అధర దరహాసం, కుచభరం, కచభారం, అభినయనం, ఆంగికం, తాళలయాన్విత మధురరాగ సమన్వితం, విశిష్ట భావార్థ సుశబ్ద సంగీతం కలిసి నిలిచిన సంగీత సాహిత్య కల్పవృక్షం మన శాస్త్రీయ నృత్యం! భారతీయ సంప్రదాయంలో నాట్యమే ప్రధానం కాదు. సంగీత సాహిత్య సమనిర్దేశిత శాస్త్రీయ నాట్య వైదుష్యం నృత్యమవుతుంది." నృత్యంచ వాద్యంచ గీతంచ" అన్నది మన సంప్రదాయం. తెలుగు సంస్కృతి కూడ ఇంతే!

విన్యాసము, విక్షేపము కూడుకొన్న నృత్తము, నాట్యము, తాళము, లయ కలిసి నిలిచిన మనోహర శబ్దరూపము గానము.



మధుర మోహనమైన అలంకార నృత్యం!
(నర్తకి : భారతీ శివాజీ)

అర్థము, భావము పెనవేసుకొని రూపొందిన పదశిల్పమే కవిత్వము. ఈ మూడింటి కలయికే నృత్యము. ఈ కళాప్రయోగ అనుభవైక వేద్యము. జంత్రగాత్ర సమన్వితమైన నృత్యగాన కళామాధురి మధురరస వాహినిలో ముంచి వేస్తుంది. గానం, నాట్యం, సాహిత్యం — మూడూ పరవళ్లు త్రొక్కుతున్నప్పుడు ఆ ఉరవడికి తట్టుకొని నిలబడగలిగే సజీవశిల్ప సుందరి హైమవతిని మరిపింపజేయాలి. సహజ సౌందర్య సిద్ధుడు సదాశివునికి చేరువలో ఉండే సౌష్ఠవం ఉన్న మానిసి కావాలి. అప్పుడే శాస్త్రీయ నృత్యానికి అందం, చందం, అన్నీనూ! ఈ అపూర్వ సమ్మేళనం ఎప్పటికో కాని

# ఇంట్లో అమ్మ చేసే కాఫీ అందించే ఆ తొలి వెలుగుల తాజాదనపు అనుభూతి కోసం.

Nestlé
sunrise

అమ్మ ఇంట్లో చేసిన కాఫీతో ప్రతీ రోజు దినచర్య ప్రారంభించడం ఎంత చక్కటి శుభారంభం! అందమైన స్టెయిన్‌లెస్ స్టీల్ కప్పుల్లో, నురగల బుడగలతో, పొగలు కక్కుతూ అందే ఆ కాఫీ రుచి, నిజంగానే గొప్ప అదృష్టం!

ఆహా! నోరూరించే ఆ సువాసన, పరిపూర్ణమైన ఆ రుచి, ఆ అనుభవాన్ని "తొలి వెలుగుల తాజాదనం"గా తప్ప మరో విధంగా వర్ణించడానికి వీలు లేదు. అమ్మ ఇంట్లో చేసే కాఫీ, తేవగానే ఒక కప్పుడు తాగితే ఉండే ఆ తాజాదనమే, సన్‌రైజ్‌ని సృష్టించేలా మమ్మల్ని ఉత్తేజపరిచింది. ఆ మేళవింపులో అంత పరిపూర్ణత ఉండటం వలనే, దానిని అమ్మ ఉదయమే చేసే కాఫీకి యోగ్యమైన బిరుదుగా మేము పరిగణిస్తున్నాం.

## సన్‌రైజ్— అచ్చంగా అమ్మ కాఫీ చేసే పద్ధతిలోనే తయారైంది

అమ్మలాగే, కాఫీ గొప్పదనమంతా సరైన గింజలన ఎంపిక చేయడంలోనే ఉందని మేమూ గుర్తించాము. అందుకే చిక్కదనం, సువాసనా సరైన పాళ్లల్లో ఇచ్చే కాఫీ గింజలను ఎంపిక చేయడంలో మా నిపుణులు శిక్షణ పొందారు.

ఇంటిలోలాగే, కాఫీ గింజలను సరిగ్గా, తగినంతగా వేయించి, నాజూగ్గా పొడి కొడతాం. ఆ తరువాత బ్రహ్మాండమైన పర్కొలేటర్లలో వడపోస్తాం. దానితో, ముదురు రంగు తోటి, ముగ్ధుల్ని చేసే సువాసన తోటి అతి చిక్కటి డికాక్షన్ తయారవుతుంది.

అనుదినం ఉదయం పూట అమ్మ అందించే ఆ మొదటి కప్పు కాఫీ రుచికి నోచుకున్న ప్రతీ కుటుంబానికి ఇది సుపరిచితమైంది.

## చిక్కని డికాక్షను నుంచి మళ్ళీ పొడి

ఈ దశలో డికాక్షన్‌ని సుతారంగా ఆరబెట్టడం ద్వారా దాన్ని పొడి రూపంలోకి మార్చడం జరుగుతుంది.

ఈ పద్ధతిని 40 ఏళ్ల పరిశోధన, అనుభవాల ద్వారా పరిపూర్ణంగా రూపొందించారు. బంగారు గోధుమ రంగులో ఉండే ఆ పొడిలో తాజాదనం సువాసన పుష్కలంగా ఉంటాయి.

## ఆ తాజాదనాన్ని అలా నిలిపి ఉంచడం కోసం

ఆ పొడిని జార్లలోను, ప్యాకెట్లలోను నింపి, దాని సువాసన, రుచి, చిక్కదనం చెక్కుచెదరకుండా అందులోనే ఉండేలాగ వాటిని సీలు చేయడం జరుగుతుంది.

ఆ తాజాదనాన్ని, సువాసననీ, రుచినీ ఏ వేళలోనైనా సరే ఆస్వాదించ వచ్చును. అమ్మ ఇంట్లో చేసిన కాఫీలాగే అచ్చంగా ఆ తొలి వెలుగుల తాజాదనపు అనుభూతి లభిస్తుంది.

Nestlé
sunrise
Nestlé
sunrise
Refill Pack

కొత్త
Nestlé
# సన్‌రైజ్
ఇన్‌స్టెంట్

## ఇంట్లో అమ్మ చేసిన కాఫీకి యోగ్యమైన బిరుదు.

ITD-FSL-8144

ఇటీవల విశాఖపట్నంలో శారదా ఫైన్ ఆర్ట్స్ అకాడెమీవారు ఏర్పాటు చేసిన అభినందన సభలో సినీ నటుడు నందమూరి బాలకృష్ణకి మొమెంటో బహూకరిస్తున్న ఆంధ్ర విశ్వవిద్యాలయం రిజిస్ట్రారు శ్రీ ఎ. గోపాలకృష్ణారెడ్డి, అకాడెమీ అధ్యక్షుడు డా. బి. సన్యాసిరాజు, ముఖ్య అతిథి శ్రీ కె. గంగిరెడ్డి గార్లని చిత్రంలో చూడవచ్చు.

# భారతీయ శాస్త్రీయనృత్యం

సాధ్యపడదు. సాధ్యపడినా ఆ సౌందర్యలహరిని వీక్షించగలిగే హృదయనేత్రం, ఆలకించగలిగే ఆత్మభేరి ఉండాలి. అంటే ఆరాధకునికి పిపాస కావాలి. సాధకునికి అంతకుమించిన ధ్యాస ఉండాలి. అంతరాత్మ, సౌష్టవం, సౌకుమార్యం, సౌందర్యం అంతర్వాహినిగా అలరించే నిత్య చైతన్య ప్రవంతిని దర్శించడం నేర్చుకొంటే మన నృత్య సంస్కృతి ఎంత గొప్పదో తెలుస్తుంది.

నృత్యకళ పరిపూర్ణ పరిణామ రమణీయమైన మహనీయమైన మధుర మనోజ్ఞమైన విశేషాంశమని నాట్యవేదప్రోక్త భరతముని అభిప్రాయపడతాడు. భరతమునికి ముందు నృత్యకళ ప్రశస్తికెక్కలేదని అనడం అవివేకం. నాట్యకళను శాస్త్రీయంగా తీర్చిదిద్దిన ఘనత భరతమునికి దక్కుతుంది. ఈ ముని పేరిట భరతనాట్యం వెలిసింది. భామాకలాపం; రాజనర్తకి, దేవదాసీల సంప్రదాయ నృత్యం పెనగి రూపొందిన సమన్వయసారం భరతనాట్యం! మొవ్వగోపాలుని సమీపంలో కృష్ణాతీరంలో ఉన్న కూచిపూడి అగ్రహారికుల నృత్యసంప్రదాయ విశేషమే కొంత మార్పులతో భరతనాట్యంగా పరిణమించిందని భావించడం దోసగు కాదు. కూచిపూడి పురుష ప్రధానమైన నృత్యమైతే భరతనాట్యం స్త్రీ ప్రధానమైన నృత్యం. కూచిపూడికి తెలుగు సంస్కృతి దర్పణమనవచ్చు. భరతనాట్యానికి తంజావూరు నాయకులు ప్రాణమనవచ్చు. వెరసి ఇవి రెండూ భారతీయ నృత్యాలే! ఈ రెండు నృత్యాలకు అభినయ దర్పణం, భరతార్ణవం, రసమంజరి గ్రంథాలు ప్రామాణికాలు.

కథక్ ఉత్తర భారత దేశంలో కానవచ్చే శాస్త్రీయ నాట్య కళ. శృంగారము, రాజసము ఎక్కువ పాళ్లలో ఉంది. అంగసౌష్టవం ఇనుమడించేలాగున వస్త్రధారణ ఉంటుంది. శిల్పమే నాట్యం చేస్తున్నదేమో నన్న భ్రాంతిని కలిగిస్తుంది. కథకళి దక్షిణ భారతీయుల ముఖ్యంగా కేరళవాసులు నృత్యకళ. ఇందులో సాహిత్యానికి స్థానం లేదు. ఇది కేవలం మూకాభినయమే.

తెలుగు సంస్కృతిలోను, తమిళసంస్కృతిలోనూ, నృత్యకళ వినువీధులకెక్కింది. తెలుగువారి కూచిపూడి, తమిళుల భరతనాట్యం దేశదేశాల వారి ప్రశంసలను అందుకొంది. తెలుగువాడైనా తమిళుడైనా భారతీయుడేనన్న సంగతని విస్మరించకుండా ఉంటే మన జాతి ఔన్నత్యమే పాటిదో తెలిసి వస్తుంది.

నృత్యకళలో ఆదినుంచి మనదేశం మంచి అభిరుచిని కలిగి ఉందని చెప్పటానికి ఎన్నో దృష్టాంతాలున్నాయి. అమరావతి శిల్పాలు, శ్రీశైలంలోని శిల్పాలు, నాగార్జునకొండలోని శిల్పాలు, పాలంపేట రామప్ప దేవాలయ శిల్ప సంపద, వరంగల్లు కోటలోని స్వయం భూలింగేశ్వరుని శివతాండవ దృశ్యం నృత్యకళలో మనవారు సాధించిన నిష్ణాతను ప్రదర్శిస్తాయి. అలనాటి అంగరంగ వైభోగాన్ని కళ్లముందు నిలబెడతాయి. పాల్కురికి సోమనాథుడు, శ్రీనాథ కవి సార్వభౌముడు తమ రచనల్లో నాట్య విశేషాలనుసవిస్తరంగా విశదపరచి మన సంస్కృతిని ఎంతగానో శ్లాఘించి ఎనలేని రక్తి కట్టించారు. కాకతి వంశ శ్రేష్ఠుడు, గణపతిరాయుని గజసాహిణియైన జాయప సేనాని రచన నృత్య రత్నావళి ఎంతో ప్రసిద్ధికెక్కింది. గీత రత్నావళి కూడ అప్పటిదే. బహుశా క్రీ. శ. 1254 కాబోలు గీత రత్నావళిలోనే జానపద నృత్య విశేషాలన్నీ వర్ణించబడి ఉన్నాయి. పేరణి, శివప్రియ, చిందులాట, కోలాటము వంటి పల్లెసీమల నృత్య వైభవాలను ముగ్ధమోహనంగా వివరించి చెప్పిన ఘనత జాయపసేనానికి దక్కుతుంది. కోమరగిరి కొండవీటి రెడ్డి ప్రభువు రాసినట్లు చెప్పబడుతున్న వసంతరాజీయంలోకూడ శాస్త్రీయ నృత్యాల ప్రసక్తి ఉంది. కొమరగిరి కొలువులోని లకుమాదేవి నృత్యం జగత్ప్రసిద్ధమని వేరుగా చెప్పనక్కరలేదు. విజయనగర ప్రభువుల కాలంలో శ్రీరంగపట్టణంలోని దేవదాసీల నృత్యంగాని, రాజసభలలోని రాజ నర్తకీమణుల నాట్యంగాని మరపుకు రానివని రాయలనాటి రసికతను కీర్తిశేషులు రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ చాటి చెప్పినారు.

నేటికీ శాస్త్రీయ నృత్యసంపద భారతంలో పుష్కలంగానే ఉంది. ఈ నృత్యసేవకు అంకితమై పోయిన మహానుభావులు ఎందరో ఉన్నారు. అభ్యాసకులు ఎంతమందో! యామినీ కృష్ణమూర్తి, ప్రతిమాబేడి, భారతీ శివాజి, అలిమేలు వల్లి, శాంతాధనం, జయన్‌లు కొందరు మాత్రమే !!

భారతీయ శాస్త్రీయ నృత్యం మన వారసత్వపు సంపద. దానిని భద్రపరచి మన తరువాతి తరాలకు అందించడం మన బాధ్యత !

**–డాక్టర్ గుమ్మనూరు రమేష్‌బాబు**

## మననం

గదిలో ఒంటరిగా నేను
వాలో తుంటరిగా నువ్వు
కళ్ళనీళ్ళు తిరుగుతుండగా
నవ్వుతున్నాను
స్మృతులు గగుర్పొడుస్తుండగా
అక్షరాల కన్నుల్లో
నీ చూపు వెన్నెల్ని చూస్తున్నాను
లేత ఎండ వచ్చి వాలుతోంది గదిలో
కాలాన్ని ఈడ్చుకొంటూ
చీమలు ప్రాకిపోతున్నాయి...
యంత్ర సంగీతం మ్రోగుతోంది
దూరాల్లో ఎక్కడో సముద్ర కెరటాలు
నిన్నూ నన్నూ నిట్టూరుస్తున్నాయి
ఎప్పుడూ వెళ్ళలేని తీరాలు
పరితపిస్తూనే ఉన్నాయి
మనకోసం...

**— ఆనంద్**

# చెప్పుల

తులసి బాలకృష్ణ



ఆ రోజు శనివారం.

అలవాటు ప్రకారం స్నానం చేసి, గుడికి వెళ్లాను. చెప్పులు వారగా విడిచి, బావిదగ్గర కాళ్ళు కడుక్కుని, గుడిచుట్టూ ప్రదక్షిణాలు ప్రారంభించాను, కళ్ళు సగం మూసుకుని.

"ఆఁ... ఆఁ... దూరం... దూరం. తగులొస్తావ్"

—ఉలిక్కిపడి, కళ్ళు తెరిచాను. నా నుంచి దూరంగా జరుగుతూ, జపం చేసుకుంటూ, ముందుకు నడుచుకు పోయాడొకవ్యక్తి.

'గుళ్లో కూడా దూరం ఏవిఁట్రా దేవుడా?!!...' మూడు ప్రదక్షిణాలు పూర్తిచేసి, లోపలికి వెళ్లాను. కళ్లు మూసుకుని, భక్తిగా చేతులు జోడించి నమస్కరించాను భగవంతుడికి..

"తలమీంచి స్నానం చెయ్యలేదా నువ్వు?"

—మళ్ళీ ఉలిక్కిపడడం నావంతయ్యింది.

ఆదే గొంతు.

అతగాడే!

నన్ను ప్రశ్నిస్తున్నాడు. చిరాగ్గా చూస్తూ 'లేద'న్నట్లుగా తలవూపి, "మామూలుస్నానమే" అన్నాను.

తల అడ్డంగా వూపాడతను,— "గుడికి ఎప్పుడూ తలమీంచి స్నానం చేసి, పవిత్రంగా రావాలి"అని, కళ్లు మూసుకుని, భజన చేసుకోవ డంలో నిమగ్నుడయ్యాడు— అందరికీ దూరంగా జరిగి.

ఒళ్లు మండిపోయింది నాకు.

పరిచయం లేనివ్యక్తి... ఈ నీతులేవిఁటి నాకు? శుద్ధ చాదస్తపు మనిషి. ముందు గుర్రుగా, ఆపైన పరీక్షగా చూసాను అతనివైపు — మధ్య పాపిడి తీసి, రెండు వైపులకే 'హైరోడ్డు' దువ్విన తారు రోడ్లలాంటి నున్నటి జుట్టు, నుదుట పెద్ద కుంకంబొట్టు, రెండు చెవుల్లోనూ రెండు పెద్దపెద్ద గన్నేరు పూలు, తెల్లగా వుతికిన పైజామా, లాల్చీ

నా పరిశీలనకి అంతరాయం—గుడి బయట ఆవరణలో ఒక్కసారిగా గోల. అందరితో బాటే నేనూ బయటకు నడిచాను గబగబా నా చెప్పులు గుర్తుకురాగా. ఎవరో ఇద్దర్ని పట్టుకు తంతున్నారు జనం— వాళ్ళిద్దరూ చెప్పుల దొంగలట. గబగబా నా చెప్పులవైపు చూసుకున్నాను— అందులో కొత్తవి మరి. ఎక్కడ పెట్టినవి అక్కడే భద్రంగా వున్నాయి. చెప్పులు భద్రంగా వున్నందుకు తృప్తి చెందిన నా కళ్లు చాదస్తపు మనిషికోసం వెతికాయి. ఎక్కడాలేడు. బహుశ గుళ్లోనే వుండిపోయాడేమో ! గబగబా లోపలకి నడిచాను. ఓ మూల కూర్చుని, భక్తిగా భజన చేసుకుంటున్నాడు—

ఒక్కసారిగా, ఇంతకుముందు అతనిమీద నాలో కలిగిన కోపం మాయమయ్యింది. గుళ్లో దేవుడి ముందు నిల్చునికూడా చెప్పుల మీద, బయట గోల మీద వుంది మా దృష్టి. అతనొక్కడూ మాత్రం చెక్కు చెదరని దైవ భక్తితో దేవుడిముందే కూర్చుని వుండిపోయాడు. మాలాగ చెప్పుల గురించి భయం లేదతనికి. భగవంతుడ్ని మనసా వాచా నమ్మిన వ్యక్తికి ఇటువంటి భయాలెందుకుంటాయి — నా మూర్ఖత్వం కాకపోతేనూ ?!

అతనివైపు నిశ్శబ్దంగా అడుగులువేసి, కొంచెం దూరంగా మౌనంగా కూర్చున్నాను.

మరో పది నిముషాలకు భజన పూర్తి చేసుకుని, కళ్లు తెరచి, "బయట ఇందాక ఆ గోల ఏవిఁటి తమ్ముడూ" అడిగాడతను.

"చెప్పుల గోల" అని చెప్పడానికి మనస్కరించలేదు నాకు.

"చెప్పు బాబూ."

"చెప్పుల దొంగల్ని పట్టుకున్నారండీ. మీరు తప్ప అందరం మా చెప్పులున్నాయో లేవో చూసుకోవడానికి బయటకు పరుగెత్తాం" అన్నాను కొంచెం సిగ్గుపడూ.

తేలిగ్గా నవ్వాడతను, సన్నని ధ్వనితో.

ఎంతో వేదాంతం ధ్వనించింది ఆ నవ్వులో.

వసంత సమీరం, హేమంత తుషారం భాసించాయి ఆ నవ్వులో.

కన్నులు అరమోడ్చి, తల చిన్నగా తాటిస్తూ, అన్నాడతను, "దేవాలయానికి వచ్చేటప్పుడు ప్రతి విషయంలోనూ ముందే జాగ్రత్త వహించాలి తమ్ముడూ."

— వింటున్నాను భక్తిగా.

"దేవుడిముందు నిలబడికూడా చిత్తం చెప్పుల మీదయితే ఎలా ?"

— వింటున్నాను వినయంగా.

"అందుకనే నేనెప్పుడు దేవాలయానికి వచ్చినా ఏం చేస్తానో తెలుసా ?"

— వింటున్నాను ఆసక్తిగా.

"చెప్పులు ఎప్పుడూ బయట వదలను."

"మరి ?"

అలవోకగా నవ్వేడతను.

పైజామా రెండు జేబుల్లోకి చేతులు పోనిచ్చి, రెండు చెప్పుల్ని బయటకు లాగుతూ, "ఇదీ నేను చేసేది. ఎందుకంటే..."

— ఈసారి... నాకు వినిపించడంలేదు సరికదా... కనిపించడంలేదు కూడా... ★



సినిమా

"సితార గా భానుప్రియ

## "సితార" లో తారడు

వీరాస్వామి ఠీవిగా వీధిలోకొచ్చి, అరుగు మీద కూర్చొనున్న గురుమూర్తి, రాజా, గణపతిల వంక ఓరకంటితో చూస్తూ, "చూశారు కదా మన వేషానికి ఊరంతా ఎలా గడగడలాడి పోయిందో! రేపట్నుంచి అన్ని వేషాలూ మనమే వేస్తున్నాం. వాళ్ళంతా కొత్తదనం కోరుకుంటున్నారు మాలాంటి ప్రయోగాలు చేసే మహానటుల్నుంచి," అంటూండగా ఆ ఊరి ప్రజలు కర్రలతో వచ్చి చాలా కోపంతో నిలబడ్డారు — వాళ్లను గమనించకుండానే వీరాస్వామి తన ధోరణిలో తాను "రేపట్నుంచి మనకన్నీ స్పెషల్ వంటలు చెయ్యాలి – మనల్ని కూడా కరణంగారి భార్యలాంటి కన్నెపిల్లలు కన్నార్పకుండా చూసే గ్లామరు మన ఫేసులో రావాలి " అంటూ వాగసాగాడు

కరణం గుడ్లురచేయడం చూసిన గణపతి గజగజ వణుకుతూ, " ఒరేయ్, పెద్దలొచ్చార్రా!" అన్నాడు.

అది పట్టించుకోకుండా వీరాస్వామి "ఎవ్వడా పెద్ద! మనమే పెద్ద— రేపట్నుంచి మనమే మన్మథుడు... మనమే దుష్యంతుడు ... మనమే అన్నీ," అన్నాడు.

గురుమూర్తి ఇక ఏం కొంప మునుగుతుందోనని వీరాస్వామి మెడపట్టి ఊరి పెద్దల వైపు తిప్పాడు. "నమస్కారమండీ ... ఎంత పనైంది వచ్చి?" అన్నాడు వీరాస్వామి హుందాగా.

మున్సబు "చాలా సేపయిందిలే. నీ చిత్తకార్తె వాగుడంతా విన్నాం. నిన్ను అభినందించడానికి వచ్చాం," అన్నాడు

"చిత్తం!" వీరాస్వామి ఎంతో సంబరపడి పోయి రాజు కేసి చూస్తూ, "మన అభిమాన్లు," అంటూ భుజాలెగరేశాడు

చిర్రెత్తిపోయిన ఓ వ్యక్తి గుంపులోంచి ముందుకొచ్చి, "యేరా! భేతాళ వేషం వేసిన వాడివి నువ్వేరా?" అన్నాడు.

"చిత్తం! అంతా నటరాజ దయ," అన్నాడు వీరాస్వామి చేతులు జోడించి.

మున్సబు "కొత్తగా ఈ ఊరికి వలస వచ్చిన నక్కల దొరగారూ! నీ వేషం చూసి జడుసుకున్న వీరబ్బాయికి ఆరు విరేచనాలు అయినయ్యంట;" అంటూ మీదికొచ్చి, "యేరా! యిలాంటి యెదవ్వేషాలు తప్ప యింకేం దొరక లేదా నీకు? పగలంతా సచ్చి సారా తాగినోళ్ళా నువ్వేసిన చిందులకు వూళ్ళో పదిమంది పసిపిల్లలు జడుసుకున్నారు. పదిమంది ముసలోళ్లకి జ్వరాలొచ్చాయి. యిదిగో యిలాంటి యెదవ్వేషాలు యింకెప్పుడన్నా వేశావంటే – మేమంతా కలిసి నిన్ను గోదార్లో ముంచి, నీ చేత శవం వేషం వేయించగలం— జాగ్రత్త!" అని హెచ్చరిక చేసి బయలుదేరాడు.

అందరూ వెళ్లిపోయాక వీరాస్వామి ఓ మూలకు ఒరిగి, "అంతా నటరాజ దయ," అన్నాడు.

ఏడిద నాగేశ్వరరావు నిర్మించే పూర్ణోదయా మూవీ క్రియేషన్స్ "సితార" చిత్రానికి వంశీ దర్శకుడు.

"ప్రేమ – ప్రేమ –

# విశేషాలు

—జి. వి. జి.

## నందమూరి బాలకృష్ణ హీరోగా శ్రీ గజలక్ష్మి కంబైన్స్ చిత్రం ప్రారంభం

"కాలేజీ అబ్బాయికి, అమ్మాయికి మధ్య జరిగే ప్రగాఢమైన ప్రేమ కథ. మానసోల్లాసం కలిగించే వినోదం, సంగీతం ఇతర ఆకర్షణలు," అన్నారు పీతాంబరం. ఈయన సమర్పించే పై సంస్థ తొలి వర్ణ చిత్రం షూటింగ్ విశాఖపట్నం ఆంధ్రా యూనివర్సిటీ ఇంజనీరింగ్ కాలేజ్ ఆవరణలో జనవరి 20న మొదలైంది. "నెలరోజుల షెడ్యూల్‌తో షూటింగ్ పూర్తయిపోతుంది," అని కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహించే భారతీ—వాసు తెలియజేశారు. పి. విమల్‌కుమార్, ఆర్. విజయలక్ష్మి నిర్మించే ఈ చిత్రంలో బాలకృష్ణ, విజ్జి, జగ్గయ్య, ప్రభాకరరెడ్డి, నాగేష్, హేమసుందర్, సి.హెచ్. కృష్ణమూర్తి, రమాప్రభ, నీలిమ పాత్రధారులు. గణేశ్‌పాత్రో సంభాషణలు, వేటూరి గీతాలు, ఇళయరాజా సంగీతం, ఎం. సి. శేఖర్ ఛాయ, లెనిన్ విజయన్ కూర్పు, బి. సూర్యకుమార్ శిల్పం, బాబు నృత్య దర్శకత్వం వహిస్తున్నారు.

ప్రేమలో జ్యోతి

శ్రీ భ్రమరాంబికా ఫిలింస్ ప్రొడక్షన్ నెం. 2 చిత్రంలో బాలకృష్ణ, సుమలత

## "ఈ సన్మానాలు, సత్కారాలు వాకొద్దు" కృష్ణంరాజు

"నా ద్వారా మన రాష్ట్రానికి జాతీయ స్థాయిలోనో, మన దేశానికి అంతర్జాతీయ స్థాయిలోనో నేనేదైనా కృషి చేసి గుర్తింపు పొందిన నాడే నేనిక సన్మానాలకు అర్హుడ్నిగా భావించి, అంగీకరిస్తాను. అంతవరకు ఇతరత్రా సన్మానాలకు అంగీకరించకూడదని కొన్ని బాధాకరమైన సంఘటనల దృష్ట్యా నేను సత్వర నిర్ణయం తీసుకోక తప్పింది కాదు. అలాగే కేంద్ర, రాష్ట్ర అవార్డుల పోటీలలో తప్ప స్థానిక సంస్థలు, పత్రికలవారు నిర్వహించే అన్ని రకాల బాలట్స్ నుంచి విరమించుకోదలిచాను గనుక నా పేరును మినహాయించవలసిందిగా వారికి విజ్ఞప్తి చేస్తున్నాను. అభిమాన సంఘాల వారు పూలదండలకు వగైరాలకు వ్యయమొనర్చే పైకాన్ని మరే విధమైన ప్రజోపయోగ కార్యాలకు వినియోగించినా ఎంతైనా హర్షిస్తాను," అని హీరో కృష్ణంరాజు ఇటీవల పత్రికాకర్తలకు తెలియజేశారు.

## ఆంధ్రేతర చిత్రాలకు భీశెట్టి కథలు

ఎ. వి. ఎం. సంస్థ టి. ఎల్. వి. ప్రసాద్ దర్శకత్వంలో నిర్మించే "నాగు" చిత్రానికేకాక అదే సంస్థ తమిళంలో మార్చి నుంచి ప్రారంభించే "వెళ్లెపురా ఒంద్రు", రామ్‌నారాయణ్ దర్శకత్వం వహించే "పడిచ్చరౌడీ" తమిళ చిత్రాలకు భీశెట్టి కథలు సమకూర్చారు. "రక్త తిలకం, నగబేకమ్మ నగబేకు" విజయవంతమైన కన్నడ చిత్రాల అనంతరం ఈయన కథతో తయారైన కన్నడ చిత్రం "రౌడీ రాజా". దాసరి నారాయణరావు ప్రధాన పాత్ర ధరిస్తూ, దర్శకత్వం నెరపే "భోళాశంకరుడు" చిత్రం తుది మెరుగులు దిద్దుకుంటోంది. లోగడ "పండంటి సంసారం, ప్రేమమూర్తులు, సర్దార్, కోటేశ్వరుడు" చిత్రాలకు భీశెట్టి కథకుడన్న విషయం పాఠకులకు విదితమే.



మురళి, సుజాత, అక్కినేని 'అనుబంధం'



'అపరాధి' సుహాసిని

## మద్రాసులో "ఉగాది వెలుగు" వేడుకలు

మద్రాసులో ఏడాది క్రితం తెలుగు సంగీత, నాటక రంగాలకు చెందిన ప్రతిభావంతులను ప్రోత్సహించే నిమిత్తం నెలకొల్పబడిన తెలుగు సంగీత అకాడమి పది కచ్చేరీలను, తెలుగు నాటక అకాడమీ ఆరు నాటకాలనూ ఏర్పాటు చేసి, బహుముఖ ప్రశంసలందుకున్నాయి. ఈ రెండిటితో పాటు మరో నూతన సమితి 'తెలుగు సాహిత్య అకాడమీ' కలిసి, ''మద్రాసు తెలుగు నాటక సంగీత సాహిత్య ఐక్య అకాడమీ''గా ఏప్రిల్ 1న మద్రాసులోని స్వామి శంకరదాస్ ఆడిటోరియంలో నాలుగున్నర గంటల పాటు 'ఉగాది వెలుగు' వేడుకలను విశిష్టమైన రీతిలో జరుపనున్నట్లు శ్రీ టి. వి. కె. శాస్త్రి తెలియజేశారు. ఈ సందర్భంలో ప్రత్యేకంగా ఏర్పాటు చేసిన కమిటీచే ఎన్నుకోబడే శిల్పకళ, చలనచిత్ర, సంగీత, నృత్య, నాటక, సాహిత్య, పత్రికా రంగాలకు చెందిన పాతిక మంది ప్రముఖులకు ఘనమైన సత్కారం జరుగుతుంది. వీరిలో గాంధీజీ సమకాలికులైన స్వాతంత్ర్య సమరయోధులొకరు కూడా ఉంటారు. ఈ ఏడు తెలుగు సంస్కృతికి కీర్తి ప్రతిష్ఠలను తెచ్చిపెట్టిన వారికే పరిమితమైన ఈ సత్కారం దేశ సమైక్యతా భావాన్ని పెంపొందింప చేసే లక్ష్యం దృష్ట్యా దరిమిలా జాతీయ స్థాయిలోనూ నిర్వహించబడుతుందని అధ్యక్షులు డాక్టర్ మంగళంపల్లి బాలమురళీ కృష్ణ, అంతర్జాతీయ ఖ్యాతినార్జించిన ప్రముఖుని హస్తాల మీదుగా ఈ మెమెంటోలు బహూకరింపబడతాయని ఛైర్మన్ ఓబుల్‌రెడ్డి తెలిపారు.

## "మాంగల్యమా ? త్యాగమా ?"

''మగువలను ఆకర్షించే ఇతివృత్తం,'' అన్నారు ఎస్. బచ్చేశ్వరరావు. ఈయన కథ, స్క్రీన్‌ప్లే, మాటలు, పాటలు సమకూర్చి స్వీయదర్శకత్వంలో నిర్మించే శ్రీ అలివేలు ఆర్ట్ ప్రొడక్షన్స్ వారి పై చిత్రం షూటింగ్ జనవరి 27న అన్నపూర్ణా స్టూడియోలో మొదలైంది. రాజా, నాగభూషణం, సాక్షి రంగారావు, త్యాగరాజు, మాడా, రాజ్యలక్ష్మి, నిర్మల, చంద్రయ్య, శ్రీనివాసులు, వెంకటేశ్వర్లు, కృష్ణప్రసాద్, భాస్కరరావు, మైత్రేయి, శ్రీలలిత, దాసరి మధురాణి, మనోరమ, పద్మలత, ఆషా, యమున వగైరా నటవర్గం. బి. శంకర్ సంగీతం, సుఖదేవ్ ఛాయ, బాలు కూర్పుతో సుధాకర్ నిర్వహణ బాధ్యతలు వహిస్తున్నారు.

## "దేశంలో దొంగలు పడ్డారు"

''సుమన్, విజయశాంతి నాయకా నాయికలు,'' అన్నారు టి. కృష్ణ. ఈయన దర్శకత్వంలో ''నేటి భారతం'' అనంతరం ఈతరం పిక్చర్స్ అధినేత పోకూరి వెంకటేశ్వర రావు పై చిత్రం షూటింగ్‌ను మార్చిలో ప్రారంభిస్తారు. చక్రవర్తి సంగీత దర్శకుడు. ఆర్. రామారావు ఛాయాగ్రాహకుడు.

'కోడె త్రాచు'లో శ్రీదేవి, శోభన్‌బాబు





''మా హాల్లో కుర్చీలు తీసేసి మడత మంచాలు వేసిన దగ్గర్నుంచి కలక్షన్లు పెరిగాయోయ్ !''

## ''ప్రేమ దీపాలు'' మార్చి విడుదల.

''వినూత్నమైన ప్రణయ గాథ. ప్రేమ వివాహాలకు పెద్దలు అడ్డుపడితే, యువతీ యువకులు యుక్తితో పెద్దలను ఒప్పించి వివాహం చేసుకుంటారు. అది వింత పరిణామాలకు దారి తీస్తుంది. దాంతో కథ అనూహ్యమైన మలుపులు తిరుగుతుంది,'' అన్నారుపి. ఎస్. బోస్. ఈయన దర్శకత్వంలో, డా. ఎం. ప్రభాకరరెడ్డి ఆధ్వర్యంలో తయారైన వెంకటేశ్వర ఆర్ట్స్ వారి పై చిత్రం మార్చి మొదటి వారంలో విడుదలవుతుందని నిర్మాతలు పి. వెంకటేశ్వరరావు, జి. నాగేశ్వరరావు తెలిపారు.



'ముఖ్యమంత్రి' కృష్ణ, అంబిక

నటవర్గం : కవిత, రాజా, శరత్‌బాబు, భాను ప్రియ ఝాన్సి, రాగిణి, అత్తిలి లక్ష్మి, గిరిజా రాణి, శ్రీలత, చలపతిరావు. భరత్ సంభాషణలు. పెండ్యాల సంగీతం, ఎస్. రామకృష్ణారావు ఛాయ తెరవెనుక హంగులు.

## ''నవ్వాలమ్మా నవ్వాలి''

''చక్కని హాస్యంతో పాటు రసవత్తరమైన కథ, గుగుర్పాటు కలిగించే సంఘటనలు, మళ్ళీ మళ్ళీ వినాలనిపించే మ్యూజిక్ – ఇలాంటి ప్లస్ పాయింట్లన్నీ ఉన్నాయి ఈ చిత్రంలో,'' అన్నారు మన సత్యం. ఈయన సమర్పించే అజయ్ ఆర్ట్ క్రియేషన్స్ ''నవ్వాలమ్మా నవ్వాలి'' చిత్రంలో రజనీకాంత్, రాధ, సరిత, సిల్క్‌స్మిత వగైరా తారాగణం. రాజశ్రీ, భూసారపు, ఎం. ఎస్. విశ్వనాథన్ ప్రభృత సాంకేతికవర్గంతో సంజయ్, వంశీ నిర్మించిన ఈ చిత్రానికి ముక్తా వి. శ్రీనివాసన్ దర్శకుడు.

రాధ 'నవ్వాలమ్మా నవ్వాలి'



## కేరళలో శ్రీ భ్రమరాంబికా ఫిలిమ్స్ చిత్రం షూటింగ్

"బాలకృష్ణ— రాజ్యలక్ష్మి, బాలకృష్ణ— సుమలతలపై రెండు గీతాలను కేరళలోని సుందరమైన ప్రాంతాలలో చిత్రీకరించాం," అన్నారు కె. విశ్వనాథ్. ఈయన కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో శాయికృష్ణ కేశవరావు నిర్మించే పై సంస్థ ద్వితీయ చిత్రంలో సత్యనారాయణ, శారద, శుభలేఖ సుధాకర్, రాళ్ళపల్లి, సాక్షి రంగారావు, గోకిన రామారావు, పొట్టి ప్రసాద్, రాగిణి ఇతర ముఖ్య భూమికలు నిర్వహిస్తున్నారు. డి. వి. నరసరాజు సంభాషణలు, వేటూరి గీతాలు, కె. వి. మహదేవన్ సంగీతం, వండూరి విజయ్ సహదర్శకత్వం, శేషు నృత్యాలు నిర్వహిస్తున్నారు. "చివరి షెడ్యూల్ ఫిబ్రవరి 20 నుండి మార్చి 25 వరకు రామచంద్రపురం, పసలపూడి, తాడేపల్లి, వుయ్యూరు ప్రాంతాలలో జరుగుతుంది," అన్నారు ఈ చిత్రాన్ని సమర్పించే ఎడిటర్ జి. జి. కృష్ణారావు.

అనూరాధ "రైలు దోపిడీ"



'పులి జూదం'లో జయసుధ

## ఎ. ఆర్. ఆర్. పిక్చర్స్ చిత్రంలో మోహన్‌బాబు ద్విపాత్రాభినయం

"ఫిబ్రవరి 27 నుంచి మార్చి 24 వరకు మద్రాసు పరిసరాల్లో ఒకే షెడ్యూల్లో షూటింగ్ పూర్తవుతుంది," అన్నారు తాతినేని ప్రసాద్. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో కె. ఎల్. ఎన్. ఎస్. రామచంద్రరాజు నిర్మించే చిత్రానికి పాటల రికార్డింగ్, షూటింగ్ ప్రారంభోత్సవాలు ఫిబ్రవరి 4న జరిగాయి. మోహన్‌బాబు సరసన సుజాత, భానుప్రియ నాయికలు. సత్యనారాయణ, త్యాగరాజు, అనూరాధ వగైరా తదితర నటవర్గం. సమర్పకుడు కె. వెంకట్రామరాజు సమకూర్చిన కథకు గణేశ్‌పాత్రో సంభాషణలకర్త. వేటూరి గీతాలకు రాజ — కోటి స్వరకల్పన చేశారు. దేవరాజ్ ఛాయ, కె. రామలింగేశ్వరరావు శిల్పం, గూనా నాగేంద్రప్రసాద్ సహదర్శకత్వం, నాయని మహేశ్వరరావు కూర్పు, బి. నాగేశ్వరరావు సహకార దర్శకత్వంతో కె. వెంకట్రాముడు నిర్మాణ సారథి.

ముంగిట రంగుల హరివిల్లు
లోగిట నిండుగా సిరిజల్లు
ప్రతి ఇంట పండగ పరవళ్ళు

# కోరమాండల్ పెయింట్స్‌తో ప్రతిరోజూ పండగ శోభ

రంగులతో మెరిసే ద్వారబంధాలు, ఆనందంతో వెలిగే ముఖారవిందాలు – పండగనాడు ఇంటింటా కొత్త కాంతి తళుక్కున మెరుస్తుంది. నూతన దుస్తుల రెపరెపలు, మూకిట బూరెల బుసబుసలు, వాకిట బూరాబాకాల సరిగమలు – పండగ పూట సందడి చేసే సంగీతం కూడా వింతగానే వుంటుంది.

కోరమాండల్ పెయింట్స్‌లో సంవత్సరమంతా ఆ కాంతి ప్రతిబింబిస్తుంది. ఆ సంగీతం ప్రతిధ్వనిస్తుంది. ఆ నిత్య నూతన శోభకు మూడు దివ్యమైన సింథటిక్ ఎనామిల్స్ వున్నవి – 'కోరోలక్స్' 'కోరోలైట్' 'డాల్ఫిన్.' మీ గృహ బాహ్య సౌందర్యమునకు 'సి పి సెమ్' సిమెంట్ రంగులు కూడా లభ్యము.

నిత్య పచ్చ తోరణాలు
కోరమాండల్ వర్ణాలు





కోరమాండల్ పెయింట్స్
& కెమికల్స్ లిమిటెడ్
విశాఖపట్టణం — 530 003.

BRAIN-WAVE/CPC/7



# యంగ్ డైనమిక్ హీరో నరేష్

"నేను కొత్తగా నటించబోయే చిత్రాలలో రెండింటి పేర్లు విచిత్రమైనవి – వాటిలోని నా పాత్రలు అంతకన్నా వినూత్నమైనవి, విశిష్టమైనవి ..." మహేశ్వరీ ఆర్ట్ మూవీస్ కార్యాలయంలో తన అభిమానులకు పంపే అసంఖ్యాకమైన ఫొటోల వెనుక ఓర్పుతో సంతకాలు పెడుతూ హీరో నరేష్ ఇంకా ఇలా అన్నాడు : "అనిల్‌కుమార్ దర్శకత్వంలో వెంకన్నబాబు నిర్మించే 'గడుగ్గాయి' చిత్రంలో నళిని హీరోయిన్. రెండవది విజయనిర్మలగారి దర్శకత్వంలో విజయకృష్ణా మూవీస్ నిర్మించే 'ముక్కోపి' చిత్రం."

"ఏమిటి, నరేష్, మమ్మీ పేరు చెప్తున్నావ్ ?" అన్నాను నవ్వుతూ.

"అంతేనండి. ఇంటివద్ద ఆమె తల్లి; దైవం కూడానూ. కాని, సెట్‌లో ఆమె గురువు–డైరెక్టరు. నేను శిష్యుడ్ని–ఆర్టిస్టుని. అందుకే ఆమె దర్శకత్వంలో నేను నటించిన తొలి చిత్రం 'ప్రేమ సంకెళ్ళు'లో ఎన్నో ప్రమాదభరితమైన స్టంట్ సీన్‌లను ఆమె డూప్ లేకుండా నాపైనే చిత్రీకరించి, ఎంతో థ్రిల్ కలిగించగలిగారు. అలాకాక, కన్నకొడుక్కి దెబ్బలు తగులుతాయని జంకి ఆ సన్నివేశాలను డూప్‌తో తీసి ఉంటే అంతగా రక్తి కట్టేవా ? అలాగే డ్యుయెట్ పిక్చరైజేషన్ సమయాలలో కూడా ఎదురుగా ఉన్నది తల్లికదా అని నేను తటపటాయిస్తే, స్టెప్స్‌కుబదులు తప్పటడుగులు వేసేవాడ్ని. దాంతో – ఇక అంతే సంగతులు. అంతా రసాభాస అయిపోయేది కదా ?" అన్నాడు నరేష్ నవ్వుతూ.

నరేష్ సుశిక్షితుడైన నటుడు. తొలి హీరో అవకాశం తల్లి డైరెక్టరవడం వల్ల అకస్మాత్తుగా ప్రాప్తించింది కాదు. ఏ ఫిలిమ్ ఇన్‌స్టిట్యూట్‌లోనూ లభించనంతటి శిక్షణను పొందాడు. డైలాగ్ డెలివరీలో కె. వరప్రసాదరావు వద్ద, డాన్స్‌లో హీరాలాల్, సీను మాస్టర్ల వద్ద, ఇంకా ఫైట్స్ వగైరాలన్నిటిలో చక్కని తర్ఫీదు పొందాకే మూవీ కెమెరా ముందు నిలుచున్నాడు. "నా అదృష్టంకొద్దీ నేను పని చేసిన మా గురువుగారు జంధ్యాలగారు (నాలుగు స్తంభాలాట, శ్రీవారికి ప్రేమలేఖ), కె. ఎస్. ఆర్. దాస్‌గారు (అగ్నిసమాధి, పులిదెబ్బ), విద్యాసాగర్‌గారు (రాకాసిలోయ), అనిల్‌కుమార్‌గారు (ఊహా సుందరి), బోయిన సుబ్బారావుగారు (అగ్నిజ్వాల), కె. వాసుగారు (కొత్త దంపతులు), భాస్కరరావుగారు (చదరంగం) — ఈ దర్శకుల వద్ద నుంచి ఇంకా ఎన్నో కొత్త విషయాలు తెలుసుకున్నాను. తీరుబడి లభించినప్పుడల్లా విడియోలో ఎన్నో భాషల చిత్రాలు చూస్తూ మరెందరో గొప్ప దర్శకులకు ఏకలవ్య శిష్యుడ్ని అయ్యాను," అనే నరేష్ కొత్తగా జంధ్యాల, ఎం. మల్లికార్జునరావు, భాస్కరరావు, రవీంద్రరెడ్డి దర్శకత్వంలో త్వరలో ప్రారంభమయ్యే చిత్రాలతోపాటు మరో అయిదు చిత్రాలలో బుక్ అయ్యాడు.

"ఇప్పుడు కొత్తగా కారులతో స్టంట్స్ చేయడం ప్రాక్టీస్ చేస్తున్నాను," అనే నరేష్ మాటకి మారుపేరు యంగ్ డైనమిక్ హీరో.

—జీ. వి. జి. ★

## "జడగంటలు"లో మత్తు వేదాంతం

పడవశివుడు (రాళ్ళపల్లి) చెట్టుకింద కూర్చొని తాగుతూ, "కళ్ళు మూసండోయ్, బాబూ ! కల్లు తెరవండోయ్ !" పాడుతున్నాడు. ఆ పక్కగా వచ్చిన మరో తాగుబోతు కాంతయ్య "యేంటి, బాబాయ్ ! ఒళ్ళు తెలియకుండా కల్లు తాగుతూ, కల్లు మూసండోయ్– అని పాడతావేంటి ?"

"ఓరి–నీ...కాంతయ్యా, నీది మరీ సెంటిమెంటురా. యేటి గట్టుమీద రోడ్డు బల్లనెప్పుడైనా చూశావురా ? అటు బద్రాసెలం యిటు రాజమండ్రీ–అని మనకు సెప్పద్దే గాని, అదెప్పుడైనా యెల్లుద్దా ! సెప్పేది సెయ్యకూడదు; సేసేది సెప్పకూడదు. యీ పడవ శివుడికి తెలిసిన పరమసత్యం అదేరా !"

"నీకేరా, బాబాయ్ ! యిద్దరు పెళ్ళాలతో, కులుకుతూ, యెన్ని తందనాలన్నా ఆడతావ్ !"

"ఓరి నీ తెలివి తేగలు తిన ! యిలా సూడు...రేవుకి రెండు ఒడ్లు, పడవకి రెండు తెడ్లు, బండికి రెండెడ్లు... యిష్ణుమూర్తికీ, కిష్టమూర్తికీ, ఆ పరవ శివుడికీ, యీ పడవ శివుడికీ యిద్దరు పెల్లాలేరా, యెడవా ! ఉగ్గు తాగే పిల్లకాకికి కల్లెందుకురా ? సెప్పడం నా దరమం... యినకపోతే నీ కరమ," అంటూ శివుడు మళ్ళీ పాటలో మునిగిపోయాడు. "యెవదు సేసిన కరమ ఆడనుబవించక యేరికైనను తప్పదన్నా..."

సురేష్, రంగనాథ్, సుధాకర్, ఎం. ఎస్. గోపీనాథ్, వీరభద్రరావు, హేమసుందర్, వై. వి. రాజు, వల్లం నరసింహారావు, జై భాస్కర్, నత్తిబాబు, వంగా అప్పారావు, విజయశాంతి, అన్నపూర్ణ, రోహిణి, రాజేశ్వరి, శివపార్వతి, విజయబాల, ఒక క్లిష్టమైన పాత్రలో ప్రభ నటించిన నవత ఆర్ట్స "జడగంటలు" చిత్రాన్ని కె. ఎస్. గామిరెడ్డి దర్శకత్వంలో ఎన్. కృష్ణంరాజు నిర్మించారు. నిర్వహణ . ఎన్. అచ్యుతరామరాజు.

విజయబాల, రాళ్ళపల్లి, శివపార్వతి 'జడ గంటలు'లో



# ఇరుగు - పొరుగు

★ చైనాలో నటీనటులకు ఒక చిత్రానికి ఇంత అని రేటు ఉండదట. అందరికీ నెలజీతమే. సూపర్ స్టార్‌కు ఆ దేశ కరెన్సీలో దాదాపు పన్నెండు వందల రూపాయలు. నవనటీనటులకు రూ. 280 ... ఏటా 30 రూపాయలు ఇంక్రిమెంట్.

★ శ్రీదేవి నటించిన చిత్రం వచ్చిందంటే చాలు – మారిషస్ ప్రజలు విరగబడి చూస్తారట.

★ దాదాపు కోటి రూపాయల వ్యయంతో లాల్ బహదూర్ శాస్త్రి మీద ఓ చిత్రం ఆంగ్ల, రష్యన్ భాషల్లో తయారుచేయ బడుతుంది. ఆయన పాత్రను ఆయన రెండో కొడుకు అనిల్ శాస్త్రి నిర్వహిస్తారు.

★ ఊటీకి వెళ్లే మార్గ మధ్యంలో కూనూరు వద్ద "పేసేజ్ టు ఇండియా" అనే ఆంగ్ల చిత్రం ఆటెన్‌బరో దర్శకత్వంలో తయారవుతోంది. ఇందులో కూడా "గాంధీ" చిత్ర ఖ్యాతి బెన్‌కిన్‌స్లే నాయకుడు. ఇటీవల కూనూరు, పక్క స్టేషన్ వెల్లింగ్‌టన్ వద్ద చాలా భాగం చిత్రీకరణ జరిగింది. ఇందుకోసం 1897 ప్రాంతాల్లో ఆ స్టేషన్‌లు ఎలా ఉండేవో అలాగే చేర్పులు మార్పులతో తీర్చిదిద్దారట. అప్పటి కథా కాలం ప్రకారం ఆ నేరోగేజీ ట్రెయిన్‌మీద 'మలబార్ ఎక్స్‌ప్రెస్' అని రాయించారట. అప్పటి కూనూరు పేరు 'చంద్రపూర్' అలాగే కొత్త బోర్డులు రాయించారట. ఈ చిత్రీకరణ కోసం దక్షిణ రైల్వేకు రెండున్నర కోట్ల రూపాయలు చెల్లించబడిందట. ఒక ట్రెయిన్ తగలబడే సన్నివేశాన్ని చిత్రీకరిస్తారట. ఏటా ఎంతో నష్టంమీద రైళ్ళు నడపబడే ఆ ప్రాంతాల్లో ఇలా ఏటా ఐదారు ఆంగ్ల చిత్రాలు తయారైతే ఆ నష్టం కొంతవరకు భర్తీ అవుతుందేమో!

★ ఇటీవల మాజీ కేంద్ర మంత్రి శ్రీ సి. సుబ్రహ్మణ్యం 'భారతీయ విద్యాభవన్' కార్యక్రమాలలో పాల్గొనడానికి అమెరికా వెళ్లినప్పుడు ఆ సమితి తరఫున సాన్‌ఫ్రాన్సిస్కో నగరానికి, హార్వర్డ్ విశ్వవిద్యాలయానికి మహాత్మాగాంధీ తైల వర్ణచిత్రాలు ఆయన చేతులమీదుగా బహూకరించడం జరిగింది. ఆయన ఆ పటాలతో న్యూయార్క్ నుంచి బయలుదేరి సాన్‌ఫ్రాన్సిస్కో విమానాశ్రయంలో దిగినప్పుడు వాటిని కారుదాకా మోసుకొచ్చిన పోర్టర్లు కూలీ డబ్బులు పుచ్చుకోకుండా "ఆహా! మేమెంత అదృష్టవంతులం" అని మురిసిపోయారట. ఈ విషయాన్ని ఆయన ఇటీవల ఒక సభలో పేర్కొంటూ, "గాంధీ చిత్రం విదేశాలలో మేధావులపైనేకాక సామాన్య మానవులపై సైతం ఎంతటి ప్రభావాన్ని కలిగించింది!" అన్నారు.

★ జనవరి 28న బొంబాయిలో కాన్సర్ వ్యాధితో నిధనులైన ప్రముఖ దర్శక నిర్మాత, నటుడు షొహ్రాబ్ మోడి (86) తొలి భారతీయ టెక్నికలర్ చిత్రం "ఝాన్సీకి రాణి", కేంద్ర ప్రభుత్వంచే స్వర్ణపతకాన్ని పొందిన తొలి హిందీ చిత్రం "మిర్జాగాలిబ్"ను రూపొందించారు. 1914లో ఈయన గ్వాలియర్‌లో తొలి సినిమా ఎగ్జిబిటర్ కూడా. 1925–30 మధ్య షేక్స్‌పియర్ నాటకాలెన్నో ప్రదర్శించారు. ఈయన చిత్రాల్లో "పుకార్, సికిందర్, పృథ్వివల్లభ్" లు మణిపూసలు. ఈయన దర్శకత్వం వహించిన చివరి చిత్రం "మీనాకుమార్ కి అమర్ కహాని". నటించిన చివరి చిత్రం "రజియా సుల్తానా". ఈయన దాదా సాహెబ్ ఫాల్కే అవార్డ్ గ్రహీత కూడా. ఈయన భార్య మెహతాబ్ ఝాన్సీ రాణిగా నటించింది.

[– జి. వి. జి. ]


## టూ-ఇన్-వన్



ఫోర్‌హాన్స్
డబుల్ యాక్షన్
టూత్‌బ్రష్ మీ పళ్లను
శుభ్రపర్చడంతో
పాటు చిగుళ్లను
మాలిష్ కూడా
చేస్తుంది.




ఫోర్‌హాన్స్
టూ-ఇన్-వన్ టూత్‌బ్రష్
అడల్ట్ మరియు జూనియర్

276 F 242 TEL

ఎలాంటివి ఎంచుకున్నా సరే-
ఎమరాల్డ్ సూటింగులు, స్టార్ లైట్ షర్టింగులు
మీ వంటికి సొగసునిస్తాయి.
మనోహరమైన రంగుల చక్కని మేళవింపుల్లో,
మీ మనసుకు నచ్చే రకాల్లో దొరుకుతాయి.



# దావణగెరె

**అందంచిందే సమ్మేళనతో నూతన సరళి కల్పన !**

ది దావణగెరె కాటన్ మిల్స్ లిమిటెడ్
హనుమంతప్ప బిల్డింగ్స్,
చిత్రదుర్గ రోడ్, దావణగెరె 577 002.

షోరూములు ;
కావేరి భవన్, బెంగుళూరు-560 009.
దాజీబాన్ పేట్, హుబ్లి-580 020.
చిత్రదుర్గ రోడ్, దావణగెరే-577 002.

THOMAS/8302-C/TEL

మెంట్, పబ్లిసిటి వర్క్ అంతా అతని మీద పెట్టవచ్చు..." ఆలోచిస్తూ అన్నాడు హరి.

* * *

హరి చెప్పిందానికి వెంటనే ఒప్పుకోలేదు పరశురాం.

"నీకు శ్రమ తగ్గేందుకు, ఆఫీస్‌లో ఒక అసిస్టెంటునో, శంకరంగారొచ్చే ఆశా లేదు కదా, మరొక సబ్ ఎడిటర్నో తీసుకుంటావేమోనని చెప్పాను... మన కంపెనీకి ప్రస్తుతం అంత పెద్ద డెసిగ్నేషన్‌తో ఒక మనిషి అవసరం ఉందా అని..."

"ఉందా అంటే నేనేం చెప్పలేను... కానీ.. నేను చేరినప్పటికంటే ఇప్పటికీ పబ్లిసిటీ కం., న్యూస్ పేపరూ రెండూ అభివృద్ధి చెందాయని నాకు తెలుసు. ఎన్నాళ్ళుపోయినా, మొత్తం బాధ్యత ఇద్దరు వ్యక్తులే పంచుకోవటంవల్ల, మీకూ శ్రమే...కాదంటారా ? కనీసం పబ్లిసిటీ, అడ్వర్టయిజ్‌మెంట్ సెక్షన్స్ అయినా చూసుకుందుకు ఒక బిజినెస్ మానేజర్ మనకి అవసరం."

"అదికాదు హరీ...మన కంపెనీ ఇన్నేళ్ళుగా ఒక ఫేమిలీ అఫెయిర్‌గా ఉండిపోయింది. నేనూ, ...శ్వం స్నేహితులమే అయినా, మా ఇద్దరి మధ్యా ఉన్నది అన్నదమ్ములకంటే గాఢమయిన అనుబంధం. ఇద్దరి మనసులకీ, ఇష్టాలకీ తేడాలు ఇంతవరకూ రాలేదు. నువ్వేమో అతని అల్లుడుగా కుటుంబంలో చేరావు... ఇప్పుడు ఎవరో కొత్తగా ప్రవేశించిన వ్యక్తికి బాధ్యత అప్పగించటం..."

"అతను వచ్చి చేరిన వెంటనే, అంతా అతని చేతిలో పెట్టివెయ్యాలనెక్కడుంది ? పూర్తిగా మీరు సూపర్ వైజ్ చేయవచ్చు నమ్మకం కుదిరేదాకా ! నిర్ణయాలు తీసుకునే స్వాతంత్ర్యం ఇవ్వనక్కర్లేదు... మీ ఇద్దరి అంత తన హితులంకాదు కానీ, మా స్నేహితుడు రావుని చూశారు కదూ...అతనయితే మనకు పనికొస్తాడనిపిస్తుంది. గట్టి బుర్ర, తెలివయినవాడు— రోజులు చూస్తే మీకూ తెలుస్తుంది పాటక్కి తత్వం ఎలాంటిదో.. అయినా ఇది నా హానే.. రూ ఆలోచించి చూడండి.. తెలిసినవాళ్ళలో ఎవ యినా ఉన్నారేమో"

లేదు ఆలోచించగా పరశురాంకి హరి ప్రసాదు గాన్పిన సలహానచ్చింది. ఫలితంగా రావు, హైదరాబాదు నుండీ, కర్నూలుకి మకాం మార్చాడు. కొనిజానికతనికిదొక వరమయింది. హైదరాబాదు పిఉద్యోగం అప్పుడా ఇప్పుడా ఊడేది అన్నట్లుగా తెలుది. మేనేజర్‌తో ఏదో తగవు తెచ్చుకున్నాడు. చిటయినా అలాఅని హరికి చెప్పుకోలేదు. "ఏదో లోనుకుడు రమ్మని ఆహ్వానించాడు కనుక లోపింమ" అన్నట్లు గొప్పగా ప్రవర్తించాడు.

34

రసా కరుణ డిగ్రీ అయిపోయినప్పట్నించీ రోజా పార ఫు



ఆఫీసుకి వస్తోంది. ఒకచోట అని కూర్చోకుండా, ప్రతీరోజూ అన్ని సెక్షన్లూ తిరుగుతూ వుంటుంది. తన కిష్టమయినచోట, అవసరం ఉన్నచోట కూర్చుని తెలియనిది నేర్చుకోవటమో, సహాయం చేయటమో పనిగా పెట్టుకుంది.

అరుణ డిగ్రీ అయినప్పట్నించీ, "బోర్, బోర్" అని గొడవపెడుతూనే వున్నా ఆమెని ఆఫీసుకి రమ్మనలేదు పరశురాం. చిన్నకూతురు తానుగా వస్తానంటే వద్దనీ అన్లేదు. తల్లిపోయినప్పట్నించీ, తనే రెండు బాధ్యతలూ తీసుకున్న ఆ తండ్రికి, తన కూతుర్లిద్దరి మనస్తత్వాలకీ మధ్య ఎంత తేడా ఉందో బాగా తెలుసు. అరుణకి సంబంధాలు చూస్తున్నాడు. ఏవీ నచ్చటం లేదు.

రావు కంపెనీలో చేరిన ఏడాది లోపలే, పరిస్థితి మొత్తం ఆకళింపు చేసుకున్నాడు. తనకున్న మాడర్న్ అయిడియాస్ అన్నీ మెల్లగా అమలులోకిపెడితే ఎంత అభివృద్ధి సాధించవచ్చో ఆలోచించాడు. ఆఫ్‌సెట్ ప్రింటింగ్ ప్రవేశ పెడితే బాగుంటుందని పించింది. ముందుగా హరితో ఆ అయిడియాని బాగా ఇంప్రెస్‌చేశాడు

ఈ విషయంలో చర్చించేందుకు ఇద్దరూ కలసి వెళ్లారు పరుశురాం దగ్గరకి. "మీరిద్దరూ చెబుతున్నది బాగానే వుంది కానీ, ఆఫ్‌సెట్ అంటే మాటలు కాదు. పెద్ద మొత్తంలో ఇన్వెస్ట్ చేయాల్సి వుంటుంది. ప్రింటింగ్ మెషిను, ప్రోసెస్ కెమెరా, ఇంకా అవీ ఇవీ అన్నీ చేరితే అసలు అంత ఖర్చు చేయాల్సిన అవసరం మనకిప్పుడుందా అని".

''అన్నిటికీ తప్పని సరిగా అవసరమా అవి కూమంటే మన కంపెనీ వ్యాపారాభివృద్ధి సాధించటం కష్టంసార్. మనం పబ్లిష్ చేసే పుస్తకాల అట్టలన్నీ హైద్రాబాదులోనో మద్రాసులోనో ప్రింటింగ్‌కి ఆర్డర్ చేస్తున్నాం. వీక్లీకి ఏపండుగలోనో,ప్రత్యేక సందర్భాలలోనస్తే, ప్రత్యేకఅనుబంధాలు వేస్తుంటాం. అవీ కలర్‌లో వేసామంటే ఆకర్షణీయంగా వుంటుంది. సేల్స్ పెరగటమూ, దాంతో బాటు ప్రకటనల మీద ఆదాయం కూడా ఎక్కువవుతుంది. ''నువేమంటావు'' అన్నట్లు చూసాడు రావు హరి వయిపు. హరి, ''అప్పటికీ మన వర్క్ లేనప్పుడు ప్రెస్ ఐడిల్‌గా వుంచనక్కర లేకుండా, వేరే ఆర్డర్స్ తీసుకొని చేసుకోవచ్చు. ఈ మధ్యలో స్వంత ప్రెస్ లేని వార, మాస పత్రికలు, సినిమా పత్రికలు కొత్తవి ఎన్నో వస్తున్నాయి. వాళ్ళందరికి ఆఫ్ సెట్ కలర్ ప్రింటింగ్ అవసరమే కదా!'' అని తనూ మాట కలిపాడు.

కానీ శవన్నింటికన్నా డబ్బు ముఖ్యమయింది. ''ఇప్పుడు లక్ష రూపాయిలయినా అప్పు చేయాల్సి వస్తుందేమోకాని దాని కోసం'' అని భయపడ్డాడు. రావు ఒకటనుకున్నాడంటే, ఎంత మొండి వాళ్ళనయినా ఒప్పించగలడు. పరశురాంని ఒప్పించడమే కాదు,తన ఊరినుండీ ఆస్తి అమ్ముకుని వెళ్ళి, హైద్రాబాదులో పెద్ద వ్యాపారవేత్తగా మారిన రామకృష్ణయ్యగారి దగ్గర్నుంచీ, అప్పు కూడా తెచ్చాడు అవసరం అయినంత డబ్బు.

* * *

తను తాత కాబోతున్నానని తెలిసినప్పట్నుంచీ చెప్పలేనంత ఆనందంగా ఉంది విశ్వమూర్తికి. ఒకరోజు కూతుర్ని దగ్గిర కూచోబెట్టుకుని, ''అమ్మాయి ఇలాంటి సమయంలో మీ అమ్మవుంటే, నీ అనసరాలేమిటో కనుక్కుని, మనసులో ఉన్న కోరికలు తీర్చటం సులభం అయేది. నీకు మరి, అమ్మయినా, నాన్నయినా నేనే. నీకేది కావాలన్పించినా నాకు చెప్పాలి... నువ్వు సంతోషంగా, ఆరోగ్యంగా తిరుగుతూ వుండాలి కళ్ళ ముందర... నాక్కావసిందదే...''

ఆయన ప్రేమగా అడిగేసరిగి రమణ మనసులో మాట బయటపడిపోయింది. ''నాన్నా ...నాకేమో...నాలుగురోజులు ఏవయినా వూళ్ళు తిరిగి రావాలనుంది...'' అంది.

అప్పుడన్పించింది విశ్వానికి. ''నే నెంత మూర్ఖుణ్ణి, స్వార్థపరుణ్ణి. పెళ్ళిలవగానే, అలా ఎటయినా హనీమూన్ అయినా వెళ్ళమని పంపలేదు. ఇద్దర్నీ ఇక్కడ కట్టిపడేసి, నేనేమో హాయిగా తిరిగి వచ్చాను'' అని.

అల్లుడింటికి రాగానే చెప్పాడు ''అమ్మాయి సరదా పడుతోంది...ఒక నెలరోజులు ఎటయినా తిరిగిరండి, ఇద్దరూ''

''అమ్మో! నెలరోజులా!''

''ఫరవాలేదు... ఏం... ఇక్కడ అంతా నేనున్నాగా చూసుకుంటాను...ఇంక ఆరోగ్యమూ ఇన్నాళ్ళ విశ్రాంతితో కొంచెం గట్టిపడింది. పర్వాలేదు శేవోయ్'' అని విశ్వం చెప్పినా, రెండు వారాలు మాత్రం వెళ్ళేలాగ ట్రిప్ ప్లాన్ వేసుకున్నారు.

ముందుగా బెంగుళూరికి బయటుదేరారు. భర్త సాన్నిధ్యం ఇలా ఎనాళ్ళుగానో కోరుకుంటున్నదే అయినా ఈ అనుభవం ఏదో కొత్తగా అన్పించింది రమణకి.

ప్రేమలోపడినవారికి, ఒకరికొకరు అందంగానూ, గొప్పగానూ, కన్పించటంలో ఆశ్చర్యం ఏమీలేదు. తమాషా ఏమిటంటే అప్పట్లో ఆవగింజలా ఉండి కన్పించకుండా పోయిన లోపాలు, తప్పులు అన్నీ పెళ్ళయిన తర్వాత బ్రహ్మాండమంత పెద్దగా కనిపిస్తాయి— ముఖ్యంగా ఇద్దరూ దేనికయినా పోట్లాడుకున్నప్పుడూ, కోల్డ్‌వార్ సాగిస్తున్నప్పుడు.

నువ్ అందంగా ఉన్నావు అనో, ఈ చీరలో బాగున్నావు అనీ, ఇలాంటి కామెంట్లు చేయటం హరిప్రసాద్‌కి అసలెప్పుడూ అలవాటులేదు. కానీ అప్పట్లో తను అతనితో గడిపే కొద్దిసేపట్లో, అతని చూపులతోనే సిగ్గుపడి, అతనేం మాట్లాడినా శ్రద్ధగా వినేది, అసలేమీ మాట్లాడికపోయినా మౌన సంభాషణే,మనసుకు సంతృప్తిని కలిగించేది, రమణకి.

మరి ఇప్పుడో, అతను పూర్తిగా ఆఫీస్ వర్క్‌లో మునిగిపోతున్నాడు ఎప్పుడో నెలకు ఒకసారి ఇద్దరూ కలిసి ఏ సినిమాకో వెళ్ళినా, బాగా టయిం అయేదాకా ఇల్లు చేరడు హరి. ఎప్పుడూ హడావిడిలో బయటికి వెళ్ళటమే. ఆ తొందరలో ఆమె ఎలా వుంది, ఏ చీర కట్టుకుంది అని చూసే వీలు అతనికి ఎక్కడుంది? అపురూపంగా కలిసి నెళతాం కదా అని, అతని కోసం తనకిష్టమయిన డ్రస్ తీసి ఉంచుతుంది రమణ కానీ అతనొచ్చి ముఖం కడిగి కాఫీ తాగే సరికే పదిసార్లు టయిం చూసుకుంటూ, ''పద పద'' అని తొందరగా బయలుదేరతాడు. బట్టలు మార్చుకునేందుకు టయిము ఉండదు. ఇలాంటివన్నీ కోపకారణాలే రమణకి. అతను మామూలుగా మాటలుకూడా చాలాతక్కువగా మాట్లాడతాడనీ అనిపిస్తోంది రమణకి. అతనికి తాను మెల్లగా దూరం అయిపోతున్నానా అనీ అనుకుని బాధపడుతుంటుంది. అందుకే కొన్నాళ్ళు ఇద్దరూ కలిసి ఏ పనీ లేకుండా గడిపితే దగ్గరగా వుండగలిగితే బాగుంటుందేమో అనిపించి, తండ్రితో తన కోరిక చెప్పింది.

రెండు వారాలు కలలా గడిచిపోయాయి. చిన్న చిన్న తేడాలు, తగవులూకూడా ఆ కలలో భాగాలే. ఆ అనుభవంతో, తామిద్దరి మధ్యా ఇన్నాళ్ళుగా ఏర్పడినాయని రమణ ఊహించుకున్న తెరలన్నీ కరగిపోయినాయి.

బెంగుళూరులో విధానసౌధ చూడటానికి వచ్చిన నలుగురు అమెరికన్ టూరిస్టులతో మాట్లాడుతూ కొంచం ఎక్కువసేపే నిల్చిపోయి, రమణని గమనించలేదు హరి. ఆమెకి బోర్‌గా వుంది. ఎవరు కొత్తవాళ్ళు కన్పించినా ఇంటర్వ్యూ చేయటమే; ఎక్కడికెళ్ళినా ఈ బుద్ధి మాత్రం పోదు అని విసుగ్గా ఒక్కతే నడుస్తూ కుడివయిపుగా వెళ్ళింది, మొత్తం ఒక రౌండు తిరిగి చూసివద్దాం. అంతలోపలయినా వస్తాడేమో' అనుకుని.

హరి మాటలు అయాయి. నలుగుర్నీ కలిపి ఒక ఫోటో తీసుకున్నాడు. వాళ్ళు తమ అడ్రస్ ఇచ్చారు. ''మీ మిసెస్ ఎక్కడ?'' అని అడిగారు, తామూ వాళ్ళనొక ఫోటో తీసుకుందామని.

అటూ ఇటూ చూసాడు హరి ఎక్కడా కన్పించలేదు. ఎటు వెళ్ళిందా అని కంగారు పడ్డాడు. 'జస్టెమినిట్' అని తాను ఎడమ వయిపు నుండి బయలుదేరాడు. ఇద్దరూ మధ్యలో ఒకచోట కలుసుకున్నారు.

''ఏయ్ రమణా! నీకసలేమయినా బుద్ధి ఉందా? నేను వాళ్ళతో మాట్లాడుతూ ఉంటే చెప్పాచెయ్యకుండా పారిపోవటమేనా? చదువుకున్న దానివి ఇలా పల్లెటూరి పిల్లలా చేస్తావేం? నువ్వూ మాట్లాడితే ఏం—నేను వద్దన్నానా?''

అని చీవాట్లు పెట్టి ''రా, పోదాం'' అని వాళ్ళదగ్గరికి తీసుకువెళ్ళాడు. వాళ్ళు ఫోటోలు తీసుకున్నారు.

ఇద్దరూ హోటల్ చేరేదాకా మౌనంగానే ఉండిపోయారు. స్ప్రమాట్ రెస్టారెంట్‌లో

## కేన్సరుకి లేసర్ సూదులు!

కేన్సరు వ్యాధికి చికిత్స చేసేందుకు లేసర్ కిరణాలను ఉపయోగిస్తున్న విషయం పాఠకులకు విదితమే. దీనికోసం జపాన్‌లో ఒక కొత్త సూదుల పరికరాన్ని తయారు చేశారు. ఈ సూదిని చర్మలో గుచ్చుతారు. ఈ సూది మొన నుండి వెలువడే లేసర్ కిరణాలు నేరుగా కేన్సరు ఉన్న భాగాలపై ప్రసరిస్తాయి. లేసర్ కిరణాలు వెలువడే తలాన్ని సమతలంగాకాక, కుంభాకారంగా రూపొందించారు అందువలన లేసర్ కిరణాలు సూది మొన మీద కేంద్రీకృతమవుతాయి. ఈ సూదిని క్వార్ట్జ్ ఫైబర్‌తో తయారు చేశారు ప్రయోగశాలల్లోనూ, వైద్యశాలలోను నూటికి నూరుపాళ్ళు విజయవంతంగా ఈ పరికరాన్ని ఉపయోగించారు ఈ పరికరంతో శరీరంలో నాలుగు సెంటీమీటర్ల లోతున గల రొమ్ముకేన్సరుకి చికిత్స చేయకలిగారు.

# ప్రేమ్ సబ్బుతో స్నానం రోజంతా ఉల్లాసం

మీ శరీరమునకు మృదుత్వమునిచ్చి సహజ
సౌందర్యమును పెంపొందించు సబ్బు ప్రేమ్.
దీని స్వచ్ఛమైన నురగ, పరిమళము
మీ మనసును పులకింపజేయును.




గులాబి మరియు ఆకుపచ్చ
రంగులలో లభించును




Imageads M-1783



జయలక్ష్మి
గుంటూరు వారి తయారీ

## 35

ఫోంచేసి, 'చాళుక్య'లో తమ రూముకి వెళ్లారు.

ఇద్దరూ ఎవరి ఆలోచనల్లో వాళ్లుండి పోయారు.

ఎప్పటిలా రమణ స్నానం చేసి వచ్చింది. నిద్రపోయేముందు, అలసిపోయిందానిలా మంచం మీద పడుకుని కళ్లకి చేయి ఆనించుకుంది.

చేతిలో ఉన్న మేగజీను పక్కన పడేసి వచ్చాడు హరి.

''బాగా అలిసిపోయావు కదూ? రేపు ఎక్కడికీ వద్దు. రెస్ట్ తీసుకుందాం పూర్తిగా. ఎల్లుండి రాత్రి మైసూరు వెళ్లొచ్చు'' అన్నాడు రమణ పక్కన కూచుని, ఆమె అడ్డంగా ఉంచుకున్న చేతిని తొలగిస్తూ.

ఆమె ఏమీ మాట్లాడలేదు.

''ఇంకా కోపం పోలేదా ?''

''నాకేంకోపం? మీకే బోలెడు కోపం వచ్చేసింది. అయినా నేను కోపగిస్తే మాత్రం మీకు లెక్కేమిటి ?''

''ఛ! అవేం మాటలు ? నువ్వు కొంచెం సేపు మాట్లాడకపోతే నాకు పిచ్చెత్తినట్లయి పోతుంది. సారీ డియర్! ఇంకెప్పుడూ నిన్నిలా విసుక్కోను సరేనా? ఏదీ ఇలాచూడు,నావయిపు. ఆరే అసలు చెప్పటం మరిచేపోయాను,సాయంత్రం నా మీద కోపంతో బుంగమూతి పెట్టుకుని ఎంత ముద్దుగాడున్నావో తెలుసా ? పబ్లిక్‌పార్క్ కదా అని ఊరుకున్నారు...అసలు నువ్వింత అంద మయిన దానివని నాకిప్పుడిప్పుడే తెలుస్తోంది రమణా !. ''

''నయం. ఇప్పటికయినా బుర్ర సరిగా పనిచేస్తున్నందుకు సంతోషించాలి'' అంది రమణ ముసిముసి నవ్వులతో.

ఇలాంటివెన్నో తగవులు వొచ్చినప్పుడు కోపమూ, విసుగూ కలిగినా, ఆ క్షణాలుకాస్త గడిచి, మళ్ళీ దగ్గరవటం మధురంగా ఉండేది. అలాంటప్పుడు, ''ఫరవాలేదు; మావారికీమాటలు బాగానే వస్తాయి. బాగా బతిమాలతారు. పొగుడు తారు. నేనే పిచ్చిదాన్ని ఏదేదో ఊహించుకొని, ఆయన నన్ను నిర్లక్ష్యం చేస్తున్నారని బాధ పడ్డాను'' అనుకుంది రమణ. 'అతను చేస్తున్న ఉద్యోగమూ, బాధ్యతా అలాంటివి. తను వాటికన్నా ముఖ్యంకాదు. అతను తనని బాగా చూడటం ఏమిటి ? తను అతన్ని బాగా చూసు కోవాలి! అతనికి దొరికే కొంచం తీరిక సమ యంలో దగ్గరుండి, అతడు విశ్రాంతిగా, సంతో షంగా ఉండేలా చూసుకోవాలి' ఇలా ఎన్నో నిర్ణ యాలు చేసుకుంది.

హరికింకా కొన్నాళ్ళు ఇలా విశ్రాంతిగా ఉండాలనీ, రమణకి దగ్గరగా కేర్‌ఫ్రీగా ఉండాలనీ ఉన్నా, అప్పుడప్పుడు విశ్వమూర్తి గుర్తొచ్చి నప్పుడు, ఆయనకి పని ఎక్కువయిపోతుంది, వెళ్ళిపోవాలి త్వరగా అనుకుంటాడు. తనకీ, తన ఇష్టాయిష్టాలకీ, రమణ ఇచ్చే ప్రాముఖ్యత చూస్తే, తనని గురించి తన కంటే ఆమెకే బాగా తెలుసేమో అనిపించేది అతనికి. ''ఈ అమ్మాయికి నేనంటే ఎంత ప్రేమ! ఈమెకి ఎప్పుడూ కష్టం కలగకుండా చూసుకుంటాను. కాస్త దగ్గరుండి, నాలుగుమాటలు చెబితే చాలు, ముఖం వికసిస్తుంది. అల్ప సంతోషి ఇలాంటి దాన్నా తాను, తన పనిలోపడి అసలు పలుక రించటమే మరిచి బాధించింది!'' అనుకుని ఫీలయినాడు.

మైసూరులో బృందావన్ గార్డన్స్ చూసారు. కావేరి కాలువలో బోట్ షైరు వెళ్ళారు. ఇద్దరూ పక్కపక్కన కూచుని నీళ్ళ మీద ప్రయాణిస్తూ ఉంటే, ''భగవాన్! ఎప్పుడూ ఇలాగే ఇద్దరం కలిసి జీవితమంతా ప్రయాణించాలి'' అని అనుకుంది రమణ మనసులో.

హరి పెళ్ళిలో కలుసుకుని, మాట్లాడిన అరుణనీ, ఆమె అందాన్ని మరచిపోలేదు, కె. హెచ్. వి. రావు. కాకపోతే అప్పుడు గెస్ట్ హోదాలో కొంచం ఫ్రీగా ప్రవర్తించగలిగాడు. ఇప్పుడు, వాళ్ళకంపెనీలో ఉద్యోగి తను. అసలే పరశురాంకి తనమీద అంత మంచి అభిప్రాయం ఏర్పడలేదు. ఆ పరిస్థితిలో మొదట ఆయనని ఇంప్రెస్‌చేసి, తన పొజిషన్ గట్టిపరచు కోవటం ముఖ్యం తనకి. అందువల్లనే అరుణతో స్నేహాన్ని పొడిగించాలనే కోరికని మనసులోనే దాచు కున్నాడు రావు.

పరశురాం దగ్గిర ఉద్యోగం అలవాటు అవుతూ వుంది. ఆయనవి చాలాపాతకాలం భావాలు, పద్ధతులు అని తనకన్పించినా, కంపెనీ ఆయనది తనకెందుకు ? అనవసరంగా ఆయనని వ్యతిరేకిస్తే తనకేం లాభం ? అనుకుని జాగ్రత్తగా తన హద్దుల్లో ఉంటూ వ్యవహ రిస్తున్నాడు.

హరి విశ్వమూర్తి అల్లుడు కావటంలో రావుకి ఆశ్చర్యం ఏమీ అన్పించలేదు. ఇద్దరూ ప్రేమించుకున్నారు. విశ్వంకీ ఇష్టమయే పెళ్ళి అయిపోయింది. కానీ కంపెనీలో హరి మాటకి వున్న విలువ, పరశురాంతో సహా అందరూ అతనికిచ్చే గౌరవం చూస్తుంటే వింతగా తోస్తుంది. ''ఇంత త్వరలో ఇంతమంది అభి మానాన్ని ఎలా సంపాదించాడా వీడు?'' అని లోలోపలే ఆశ్చర్యపోతుండేవాడు. ఆ ఆశ్చర్యమే అసూయగా మారిపోయింది, హరి 'గోరంత దీపం' ఎడిటర్ అయిన తర్వాత. ''వీడి మొహం వీడికేం తెలుసని, అంత బాధ్యత అప్పగించారో; ఈ ముసలాళ్ళకసలు బుద్ధిలేదు,'' అని తిట్టుకున్నాడు.

తను కర్నూలులో వచ్చి చేరినప్పట్నుంచీ, ఎన్ని రోజులయినా ఒక్కసారికూడా పరశురాం ఇంటికి వెళ్ళే అవకాశం రాలేదు. కరుణ రోజా ఆఫీసుకొస్తుందిగానీ, అరుణ మాత్రం ఇటు వయిపు ఎప్పుడూ రాదు.

ఒకసారి తనే ఆఫీస్‌నుంచీ ఇంటికి ఫోన్ చేశాడు, ఆటూ ఇటూ ఎవరూ లేకుండాచూసి. అరుణ ఫోన్ తీసి 'హలో' అనగానే.

''హలో, నేను రావుని, ఆఫీస్ నుంచీ మాట్లాడుతున్నాను. మీ డాడీ ఉన్నారా ?''

''డాడీ ఆఫీస్‌లో లేరూ ?''

''నో! అందుకనే కొంచం పని ఉండి పిలిచాను... పోనీలెండి. ఎటయినా వెళ్ళేరేమో బయటికి... అవునూ... నేనూ మీకు గుర్తు న్నానా? ఆవేళ మా ఫ్రెండు పెళ్ళిలో చూసిందే మిమ్మల్ని.''

''గుర్తులేకేం ? మీరే వచ్చి ఇన్నాళ్ళ యింది! ఇవాళ పలకరిస్తున్నారు, అదీ ఆమకో

మా సంసారం చకరగా వుండడానికి కారణం మా ఆవిడకి చత్వారం, నాకు చెముడే! ఆవిడమాట నాకు వినపడదూ నేను చూసింది ఆవిడకి కనపడదు!



## ధర్మపథం

బులుసు వేంకటరమణయ్య



# దానప్రతిగ్రహాలు

అడిగినంత ఇవ్వకపోతే దాతలకూ, కావలసినది అడిగినా, తక్కువగానే లభించిందని ప్రతిగ్రహీతలకూ — ఉభయులకూ అసంతృప్తి కలగడం సర్వసాధారణంగా కానవస్తుంది. వ్యక్తులకేకాదు. ప్రభుత్వంలోనే రాష్ట్రాలకూ, కేంద్రానికీ దానప్రతి గ్రహాల్లో అసంతృప్తి కలుగుతూఉండడం పత్రికలవల్ల తెలుస్తున్నది. అడిగిన దానికంటె ఎక్కువ ఇచ్చే దాతలూ, కావలసిన దానికంటె ఎక్కువ తీసుకోడానికి ఇష్టపడని ప్రతిగ్రహీతలూ లేకపోలేదు. అట్టివారు కథల్లో కానవస్తారు. ఇది వారి విశాల హృదయానికితార్కాణం. అది అత్యుత్తమయిన ధర్మం.

పూర్వం వరతంతువనే మహాముని—అన్ని విద్యలూ తెలిసినవాడు ఉండేవాడు. అతని దగ్గర కౌత్సుడనే విద్యార్థి చేరి సమస్తవిద్యలూ నేర్చుకున్నాడు. కౌత్సుడు మిక్కిలి వినయ విధేయతలతో గురువును సేవించేవాడు. ఇతనిపై ఆ మునికి ఎంతో అభిమానం ఉండినది. విద్యలు పూర్తి కాగానే కౌత్సుడు "మహామునీ! తమకు నేను గురుదక్షిణ ఏమి ఇవ్వవలెనో చెప్పవలె"నని అనెను ఆయన "నాయనా! నీవు ఏమీ ఇయ్యనక్కరలేదు. నీవు చూపిన గురుభక్తీ, వినయ విధేయతలూ చాలును. నిర్విచారంగా ఇంటికిపో" అని చెప్పెను. కౌత్సునికి అది తృప్తి కలిగించలేదు. గురుదక్షిణ ఇవ్వాలనే దృఢంగా సంకల్పించి, మరి రెండుసార్లు గురువును అదే ప్రశ్నించాడు. ఈ నిర్బంధం వల్ల వరతంతునికి శిష్యునిపై కోపం వచ్చి "నువ్వు నిర్బంధించి అడుగుతున్నావు. కాబట్టి — పధ్నాలుగు విద్యలకూ పధ్నాలుగు కోట్ల ధనం తెచ్చి ఇయ్యి" అని అన్నాడు. కౌత్సుడికి దిగులు, ఆశ్చర్యమూ కలిగాయి. పధ్నాలుగుకోట్లా? ఎక్కడ తేవడం? అయినా ఆయన కోరిక చెల్లించక తప్పదని, అంత పైకం ఇవ్వగల రాజా రఘు మహారాజే అని గ్రహించి ఆ రాజు వద్దకు వెళ్లాడు.

రఘు మహారాజా కొద్దికాలం క్రిందటే విశ్వజిద్యాగంచేసి తన సర్వస్వాన్నీ దానం చేసి కట్టుగుడ్డలతో ఉన్నాడు. మట్టి పిడతలతో కౌత్సుడికి ఆతిథ్యం ఇచ్చాడు. దానివల్లనే అతని లేమిని గ్రహించి కౌత్సుడు "మరొక రాజును యాచిస్తా"నంటూ తన వృత్తాంతాన్ని రఘు మహారాజుకు చెప్పాడు. "ఏమీ, నా వద్దకు వచ్చి, కోరిక తీరకుండా వేరొక చోటికి పోవడమా? అది కుదరదు. మీరిక్కడే ఉండండి. రేపు ఉదయానికి మీరు కోరిన ధనం తెచ్చి యిస్తాను" అని, కుబేరుడి మీదికి యుద్ధానికి సిద్ధపడ్డాడు. రఘువు అడిగితే కుబేరుడు కాదనడు. కానీ, యాచించడం రాజుల పద్ధతి కాదు కాబట్టి, అతణ్ణి జయించడంచే డబ్బు తేవాలని నిశ్చయించాడు.

కుబేరుడికి ఈ సంగతి చారులవల్ల వెంటనే తెలిసింది. అతడు రఘు మహారాజుకు భయపడి తెల్లవారేసరికి రాజకోశాగారంలో బంగారంవర్షం కురిపించాడు. అది ఎన్నోకోట్ల ధనం!

ఆ ధనాన్నంతా తీసుకోవలెనని రఘు మహారాజా కౌత్సుడితో అన్నాడు. "నాకు కావలసినది పధ్నాలుగుకోట్లే! అంతకంటె ఎక్కువ నాకక్కరలేదు. నేను తీసుకోను" అని కౌత్సుడు సమాధాన మిచ్చాడు.

"నీ కోసం నేను కుబేరుడి మీదికి యుద్ధానికి పోదలచగా ఈ ధనం వచ్చింది. ఇదంతా నీదే! తీసుకోక తప్పదు" అని అన్నాడు.

ఈ దాత గొప్ప త్యాగానికీ, దానం తీసుకోదలచిన కౌత్సుని ఉత్తమ స్వభావానికీ అందరూ ఆశ్చర్యపోయారు.

ఇలాంటివారు ఉండడం చాలా అరుదు. ఉత్తముల హృదయాలు ఎలా ఉండేది తెలిపికొనుటకు ఈ కథ చక్కని ఉదాహరణం,

ఆశారహిత స్వభావాన్ని తెలపడానికిన్నీ ఇది మంచి దృష్టాంతమే! 

కుండా ఫోన్ ఎత్తినందుకు" నిష్ఠూరంగా అన్నది అరుణ, ఎన్నాళ్ళుగానో, అతని ఫోన్ కాల్ కోసం ఎదురు చూసినదానిలా.

సంతోషంలో తల మునకలయిపోయాడు రావు. "సారీ!..." బాధపడతున్నవాడిలాగా.

మరుసటి రోజు అదేటయిముకి మళ్ళీ ఫోన్ చేశాడు. అప్పటికే, అతను పేరుకు డాడీని అడుగుతున్నా, ఫోన్ చేస్తున్నది తనకోసమే అన్న విషయం అర్థమయిపోయింది. ఎందుకంటే ముందు రోజంతా పరశురాం ఆఫీసులోనే ఉన్నాడనే విషయం డ్రైవర్ద్వారా తెలిసింది ఆమెకి. అందుకనే అతను మళ్ళీ ఫోన్ చేస్తాడేమోనని కాచుకుని ఫోన్ దగ్గరే కూర్చుంది.

అనుకున్నట్లుగా ఫోన్ రింగయింది.

"పరశురాంగారున్నారా?" అడిగాడు రావు.

"మీక్కావలసింది నేనా, నాన్నగారా?" చిలిపిగా అడిగిందరుణ.

'అమ్మో, జాణ; అమాయకురాలను కున్నానే! అనుకుని'

"నీకోసమే చేశాను"చెప్పేశాడు.

"ఈ ఫోన్ బిజినెస్ ఎందుకు? ఫ్రీగా ఉంటే ఇంటికి రండి. కాఫీ తీసుకుని వెళ్ళొచ్చు ఏమంటారు?"

"మీ ఇంటికా? బావుండదేమో అరుణ! పోనీ ఒక పని చేద్దాం. సాయంత్రం మీ ఇంటికి అవతల ఫర్లాంగు దూరంలో ప్లేగ్రౌండ్, చిన్న పార్క్ ఉన్నాయి చూడు, అక్కడి కొచ్చెయి ఆరింటికి. నేనొస్తాను .. మీ నాన్నగారికి తెలీకుండా నువు నన్ను ఆహ్వానించటం సరికాదు. నేను రావటము సరికాదు. అందుకని నేను చెప్పినట్లు చెయి ... నీ కిష్టమయితేనే సుమా... నువ్ రాక పోతే నా అదృష్టం ఇంతే అనుకుంటాను, ఇంకెప్పుడూ పలకరించను".

అనేసి, ఆమె అంగీకరించక ముందే ఫోన్ పెట్టేసాడు రావు; అతనికి తెలుసు, ఆమె వస్తుందని. తన మాటచాతుర్యం మీద ఆ మాత్రం నమ్మకం ఉంది రావుకి.

"ఇతనేమిటింత అధికారంగా మాట్లాడి రమ్మన్నాడు?" అనిపించినా అదీ సంతోషంగానే ఉంది అరుణకి

టయిం చూసింది మూడున్నర అయింది పరవాలేదు తయారవడాని కింకా బోలెడంత టయిం వుంది — అనుకుని పడక మీద చేరి స్టార్‌డస్ట్ మేగజీన్ చదవటం మొదలు పెట్టింది శ్రద్ధగా, అందులో గాసిప్ కాలమ్స్ చదవటం భలే యిష్టం. ఎవరయినా ఒక స్టార్ వెంట. సినిమా తారలు తిరుగుతున్నారనీ, అతగాడి కోసం వీళ్ళలో వీళ్ళు పోట్లాడుకొంటున్నారనీ చదివినప్పుడు, ఆ ఇద్దరిలో తానొకతే అయింది. ఆ స్టార్ తననే ఎంపిక చేసుకున్నట్లు కలలు కంటుంది. ఇవాళ మాత్రం ఏ సినిమాస్టార్ బొమ్మ చూసినా, ప్రతీ యాక్టరు ముఖంలో రావే కనిపిస్తున్నాడు.

(ఇంకా వుంది)

# అమ్మంటే తెలిసింది నాన్నారూ!

అవధానుల జగన్నాథ రావు –
మల్లం పల్లి గాంధీ రామారావు

ఈ పదిహేను రోజుల్లో ఇది నాలుగో ఉత్తరం, అమ్మ దగ్గర్నుంచి. ఉత్తరాన్ని చించి, ముక్క ముక్కలు చేసి, కిటికీలోంచి బయటికి పారేయాలనిపించింది.

కోపాన్ని కాస్త నిగ్రహించుకొని, కసిగా ఉత్తరాన్ని ఉండచుట్టి జేబులో పెట్టుకున్నా.

ముప్ఫయ్యేళ్ళు వచ్చినా, ఏమీ తెలియని చిన్న పిల్లాడిలా నన్ను చూసే ఈ తత్వమంటేనే నాకు మహా చికాకు

కలసి మెలసి పెరిగిన తోబుట్టువు ఇంట్లో కూడా నాలుగు రోజులు సర్దుకుపోలేని అమ్మవే మనాలో అర్థం కాలేదు

నేను పుట్టినవెంటనే నాన్న పోవడమే ఈ అనర్థాలన్నిటికీ కారణమేమో ?

కాలు క్రిందపెడితే కందిపోతాడన్నంత అపురూపంగా పెంచుకున్నా... క్షణం వదలలేని ఈ అభిమానం...

ఉక్కిరి బిక్కిరిచేసే ప్రేమా. ప్రాణాలు తోడేస్తున్నాయి అనిపిస్తోంది.

ఇవాళ్టికి సమంగా తనని మా మయ్య యింట్లో వదిలి నెళ్ళాళ్ళయింది— ఈ మాత్రం దానికే నా గురించి యింత బెంగా ?

నేనేం మరీ చిన్న పాపాయిని కానే?

నాకూ పెళ్ళయింది..! త్వరలోనే తండ్రిని కాబోతున్నాకూడా !

పెళ్ళయి సంవత్సరంన్నర అయిందన్న మాటేగాని..

రాధతో ఒంటరిగా గడపడం... రాధ చేతి వంట రుచి చూడ్డం ఈ నెల్లాళ్ళు మాత్రమే.

పెళ్ళయి కొత్తగా సంసారం పెట్టినా... ఇంటికి నిండుగా, ఇద్దరికీ నీడలా, ఎక్కడ చూసినా అమ్మే.

రాధ తల్లి కాబోతుందని తెలిసిన దగ్గర్నుంచి... అంతకు ముందు పెట్టే ... కాఫీ కూడా పెట్టనీయడం మానిపించేసింది అమ్మ. గట్టిగా నవ్వుకుందామనుకున్నా వీలులేని అద్దె కొంప . అనుక్షణం ఎవరో పక్కనే ఉన్నారన్న ఆలోచన, నా ఆనందానికి ఎన్ని అవరోధాలు కలిగించిందో ఎలా చెప్పను అమ్మకి.

అందరి అత్తల్లా... కోడళ్ళకి ఆరళ్ళు పెడుతూ, అమ్మ కూడా ప్రవర్తిస్తే పరిస్థితులు మరోలా ఉండేవేమో ?

తల్లీ కూతుళ్ళు కూడా యిలా ప్రవర్తించరేమో ... అనిపిస్తుంది రాధనీ అమ్మనీ చూస్తుంటే.

అమ్మకన్నా ఆరాకులు ఎక్కువన్నట్లు ప్రవర్తించేది రాధ. ఆరుమీద మూడు పద్దా, మూడుమీద ఆరు పద్దా, అమ్మకి భగవద్గీతలోని శ్లోకాలు వినిపించి వస్తేగాని... రాధా దర్శనం జరిగేది కాదు.

కడుపులో నలుసు పడేంత వరకూ, ఉదయాన్నే పూజలో ఉన్న అత్తగారికి కాఫీ పెట్టి ఈయడం రాధ వంతు.

ఆ తర్వాత ఆ డ్యూటీ కూడా అమ్మే తీసుకుంది... కోడలెక్కడ అలసిపోతుందేమోనని.

ఎన్ని మధురమైన రాత్రులు అమ్మ భగవద్గీత శ్రవణంలోనూ, మధురమైన ఉదయాలు, ఉదయాన్నే సూర్యోదయానికి ముందే చేసి పెట్టి యిచ్చే కాఫీలోనూ కొట్టుకు పోయాయో ... ఎవరికి చెప్పుకోను ? తనని చెప్పుతో కొట్టినా, చిరునవ్వుతో సహించగల ఓర్పున్న రాధ అమ్మమీద మాత్రం ఈగ వాలనీయదు.

మనసులోని ఈ బాధల్ని ... రాధతో చెప్పి అభాసుపాలవడంకన్నా తెలివితక్కువ తనం మరొకటి లేదు.

ఆలోచనల కంతరాయం కలిగిస్తూ ఆఫీస్ టేబిల్‌మీది ఇంటర్‌కమ్ ఫోన్ ట్రింగు ... ట్రింగు .. ట్రింగ్ మని మ్రోగింది. రిసీవర్ ఎత్తా.

''సార్ ! ఆ లాకులేజీ రోడ్డు కాంట్రాక్టు ఎగ్రిమెంటు ఫారాలు తెమ్మంటారా సార్ ! తమరు రేపట్నించి వారం రోజులపాటు సెలవులో ఉంటారు'' అన్నాడు వినయంగా హెడ్ క్లర్క్ వీరేశం.

''ప్లీజ్ బ్రింగ్ దెమ్ .. ఆఁ .. ఆ వచ్చేటప్పుడు మన జే.యూ. గార్ని కూడా రమ్మని చెప్పండి ... '' అని ఫోన్ క్రేడిల్‌మీద పెట్టాను.

అప్పుడు జ్ఞాపకం వచ్చింది .. సాయంకాలం ప్రయాణం సంగతి . కాల్‌బెల్ నొక్కి డ్రైవర్ని పిలవమని చెప్పాను ప్యూన్‌కి.

''సార్ !'' అన్నాడు డ్రైవర్ డేవిడ్.

''ఏం ? కారు రెడీయేనా ?'' అన్నాను ఫైల్లోంచి తల ఎత్తకుండా.

''అవును సార్! ఆయిలు, బ్రేకులు, లైట్లు, టైర్లు అన్నీ పెర్‌ఫెక్ట్‌గా ఉన్నాయి. అన్నైన జీసస్ దయ సార్ !'' అన్నాడు డేవిడ్.

నవ్వుకున్నాను మనసులోనే డేవిడ్ నమ్మకానికి.

ఫైళ్ళమీద సంతకాల పనులు కానిచ్చి, అందరికీ చేయవలసిన పనులు విశదీకరించి, ఎంతో ఆనందంగా కారు ఎక్కాను.

* * *

''రాధా ఎంతో హాయిగా ఉందికదూ...ఈ వెన్నెల్ల రాత్రిలో ఒంటరిప్రయాణం'' అన్నాను స్టీరింగ్ తిప్పుతూ.

''అబ్బాయి గారూ నావైపుకన్నా...రోడ్డుకేసి చూడ్డం ఆరోగ్యానికి మంచిదేమో?'' అంది రాధ కిటికీలోంచి బయటికి చూస్తూ.

''ఎక్కనున్నది డ్రైవర్ డేవిడ్ కాదనీ, తమ శ్రీవారు రాజశేఖర్ అని తెలుసుకుంటే కాస్త బాగుంటుందేమో ?'' అన్నాను రాధవైపు జరుగుతూ.

''రాధా వెన్నెల రాత్రి... నున్నటి తారు రోడ్డు మీద కారులో ప్రయాణం... కన్నుల పండవైన జంట... అన్నిటికీమించి... అనువైన ఏకాంతం... ప్లీజ్ కమ్ క్లోజ్'' అన్నాను రాధను దగ్గరగా లాక్కుంటూ.

''చూడు బుజ్జీ! మనిద్దరం వెళ్తున్నది హనీమూన్‌కి కాదు. నాపురుటికి... నా పుట్టింటికని జ్ఞాపకం పెట్టుకుంటే కాస్త బాగుంటుంది. అట్టే హడావుడి చేస్తే... అమ్మ వెనకసీట్లో లేదని సంబరపడుతున్న మిమ్మల్ని... మీ అబ్బాయి అల్లరి పెడ్తాడేమో? అంది రాధ దగ్గరగా జరుగుతూ.

ఎందుకో అనిపించింది... ఆ క్షణంలో రాధ మామూలుగా లేదనీ, కొంచం కోపంగా ఉందని... వెంటనే తెలిసిపోయింది రాధ కోపానికి కారణం ఏమిటో!

''రాధా ! అమ్మని ఇంకా తీసుకురాలేదని కోపమొచ్చిందా !'' అన్నాను.

అమ్మ పేరు వింటే చాలు... రాధ బుంగ మూతి కోపాలు మటుమాయమవుతాయని తెలిసి.

''నాకెందుకూ మధ్యలో కోపం ? అత్తయ్యను తీసుకురాకపోయినా, ఆవిడ మీకు వ్రాసిన ఉత్తరాలు నాకు చూపించకపోయినా, ఉత్తరాలు రాలేదని మీరు అబద్ధాలు ఆడినా..., నేనెవర్తెను మధ్యలో కోపం తెచ్చుకునేందుకు ?'' అంది రాధ బాధగా.

''నిజం రాధా ! ఉత్తరాలు అస్సలు రాలేదు'' అన్నాను. దొంగతనం చేస్తూ దొరికిపోయిన దొంగలా.

అనుకోకుండా చేయి ఫేంట్ జేబుమీదకి పోయింది. ఉండచుట్టి పడేసిన ఉత్తరం అలాగే ఉంది

''అబద్ధాలాడ్డానికికూడా కాస్త తెలివితేటలు కావాలి. మరి అత్తయ్య నాకు వ్రాసిన ఈ ఉత్తరం సంగతేంటి ?'' అంది రాధ జాకెట్‌లో మడచిపెట్టిన ఇన్‌లాండ్‌ను పైకి దీస్తూ.

# ఆస్పత్రి బిల్లు—ఆత్మహత్య!

తనకొచ్చే ఇన్సూరెన్సు డబ్బులో తనను జీవితకాలమూ వేధిస్తున్న తలనొప్పిని నివారించుకోడానికి ఇంగ్లండ్ రిచ్‌మండ్‌కు చెందిన జాన్ మిచెల్ అనే 45 ఏళ్ళాయినాసుపత్రిలో చేరి, ఆ ఆపరేషను దివ్యంగా పూర్తి చేసుకుని బిల్లు చూసి, దిక్కు చచ్చిపోయాడట. అతని ఇన్సూరెన్సు 300 పౌనులయితే ఆసుపత్రి బిల్లు 15 వేల పౌనులట. ఈ బిల్లు కట్టడానికి డబ్బులేక, స్తోమతలేక, వేరే గత్యంతరంలేక, గుండె రాయి చేసుకుని తాప్పైన ఆత్మహత్య చేసుకున్నాడట.

## రక్తంతో జైల్లో రాసిన బౌద్ధగ్రంథం!

12 వ శతాబ్దంలో సుటోకు అనే జపాన్ మహారాజు రాజ్యభ్రష్టుడై మూడేళ్ళు కారాగార వాసం చేయవలసి వచ్చిందట, బౌద్ధమతస్థుడయిన ఆ సుటోకు తాను జైలులో వున్న మూడేళ్ళలో తన రక్తంతో లంకార్ణసూత్ర అనే బౌద్ధమత పుస్తకాన్ని 10,500 మాటలతో రాశారట. అలా తాను రాస్తే బుద్ధుడు తనను కనికరించి తాను పోగొట్టుకున్న స్థానాన్ని తిరిగి తనకిస్తాడని ఆయన అనేవాడట. అలానే ఆయన తిరిగి 1144 లో సింహాసనానికి వచ్చి 20 ఏళ్ళు రాజ్యపాలన చేశాడట.

## ముద్దుల మొనగాడు!

ఇంగ్లండుకు చెందిన డైన్‌సైడ్‌లో 1978వ సంవత్సరం సెప్టెంబరు 22వ తేదీన జెఫ్స్‌వేల్ అనే ఒక మన్మధరావు ముద్దెట్టుకున్న అమ్మాయిని ముద్దెట్టుకోకుండా ఎనిమిది గంటల కాలంలో 4049 మంది అమ్మాయిలను ముద్దెట్టుకున్నాడట. గంటకు అయిదొందలారు మందిని ముద్దెట్టుకున్నాడటా!






## కేశాన్ని పాతిక భాగాలు చేసిన ఘనుడు!

బెంగుళూరు హిందుస్థాన్ ఏరోనాటిక్స్ లిమిటెడ్‌కు చెందిన టి. నంజప్ప అనే వో మేధావి మానవ కేశాన్ని నిట్టనిలువుగా 25 భాగాలుగా చీల్చి ప్రపంచ చరిత్రనే చీల్చి చెండాడినాడట. గుయినిస్ బుక్ ఆఫ్ వరల్డ్ రికార్డ్స్ లెక్కల ప్రకారం ఇంతవరకూ వెంట్రుకను 16 నిలువు భాగాలుగా చీల్చడమే నమోదయిందట. ఈయన ఒక బియ్యపు గింజ మీద 4160 అక్షరాలు కూడా వ్రాశారట. అంతేగాక ఒక బియ్యపు గింజమీద రామాయణ, మహాభారత ముఖ్య ఘట్టాలనూ, హెచ్. ఎ. ఎల్. వారు తయారుచేసిన విమానాలలో కొన్నిటిని కూడా చిత్రించారట. అహో! ఇటువంటి మేధావులను, ప్రపంచానికి తెలిసేలాచేసి, వారిని పోషించి, తద్వారా కీర్తిని, తృప్తినీ పొందకూడదీ దేశం!

## చిత్ర నిర్మాణ వ్యయంలో ప్రపంచ రికార్డు!

ప్రపంచ చరిత్రలోనే అత్యధిక ఖర్చుతో తీసిన సినిమా స్టార్ ట్రెక్ అనే హాలీవుడ్ సినిమా అట. జెనీ రాడెన్‌బెరీ యీ చిత్ర నిర్మాతట. రాబర్ట్ వైజ్ యీ సినిమాకు దర్శకుడట. ఈ సినిమా తీయడానికి 460 లక్షల డాలర్లు ఖర్చయిందట. 1979 డిసెంబరు 6వ తేదీన వాషింగ్టన్‌లో యీ సినిమా ప్రివ్యూ వేశారట.

## కలియుగ భీముడు!

యు.యస్.ఎ. లోని జార్జియాకు చెందిన పాల్ అండర్సన్ అనే యిరవైయ్యేళ్ళ యువకుడు 1957వ సంవత్సరం జూన్ 12వ తేదీ వో పెద్ద టేబుల్‌మీద 6270 పౌనుల బరువుకల ఇనుప సామానులన్నీ పెట్టి ఆ టేబులు క్రింద దూరి, రెండు చేతులతోనూ అమాంతం ఆ టేబులు పైకి ఎత్తాడట. ఇంతవరకూ అంత బరువు ఎత్తిన మనిషి లేడట ప్రపంచంలో.

## ఢిల్లీకి అగ్రతాంబూలం!

ఢిల్లీలో స్త్రీల చావులలో వొళ్ళు కాలి చనిపోవడంలో ఢిల్లీకి ప్రథమ స్థానమట. ఏ యితర కేంద్రపాలిత ప్రదేశాల కన్నా ఢిల్లీలోనే యీ చావులెక్కువట 1977 లో 311 మందిట ఆ సంఖ్య 1982 నాటికి 610గా పెరిగిందట. ఛండీఘర్‌లో 1982 లో 44 మాత్రమేనట




## హెచ్చరించే కారు!

బ్రిటిష్ లేలెండ్ కార్ల కంపెనీ వో కొత్త రకం కారు తయారుచేసిందట కారు బ్రేకులు సరిగా పని చేయకపోయినా, పెట్రోలు అయిపోయినా, ఆ కారులోంచి వో వార్నింగు వినవస్తుందట. 32 మాటలు ఎలక్ట్రానిక్ టేపులో వుండి, సమయానుసారంగా హెచ్చరికలు చేస్తుందట. ప్రముఖ హాలీవుడ్ నటీమణి నికొలెట్ మెక్ కెనీ చేత యీ 32 మాటలూ మాట్లాడించారట.

## పసిపిల్లని బలిగొన్న వింత మృగం!

ద్రోణాచలం తాలూకా చిన్న మార్కాపూరుకు చెందిన వో వ్యవసాయ కార్మిక జంట తమ రెండేళ్ళ పిల్లను తమకూడా పొలానికి తీసుకువెళ్ళి వో చోట పడుకోబెట్టి పనిలోకి వెళ్ళేసరికి తోడేలు ఆకారం, వొంటికి నల్లని చారలు, పొడవైన మెడకల వో వింత జంతువు ఆ పిల్లను నోట కరచుకుపోయిందట. ఆ దంపతులూ, చుట్టుపక్కలవారూ కర్రలతో వెంటబడినా ప్రయోజనం కలుగలేదట. ఆ మర్నాడు ఆ పిల్ల తల పొదల్లో దొరికిందట ఆ తలలో మెదడు కూడా ఆ జంతువు తినేసిందట పాపం!






# బాదల్ ఫ్యానులు

చల్లని పవనాల ప్రశాంతతకు










ప్రముఖ ఫ్యాన్ డీలర్లందరివద్ద లభించును

Jaisons/AMA/18/84 TEL

# ట్రిలో

## ఉపయోగించడానికి మీకొక మంచి కారణం:




## ఇతర ప్రముఖ డిటర్జెంట్ బిళ్లలకన్న **దీని ధర 30% తక్కువ.**

### ఇదిగో, ఇంకా మూడు కారణాలు:

### మరింత నురుగు



దీని సమృద్ధమైన నురుగు మరే డిటర్జెంట్ బిళ్లకన్న ఎక్కువ బట్టలను శుభ్రం చేస్తుంది.

### మరింత ఉతికే శక్తి

అతిగా మాసిన బట్టల్ని కూడ చక్కగా శుభ్రం చేయగలది ట్రిలో అందులోనే ఉన్న బ్లూ తెల్లటి బట్టలకు వాటి అసలు తెల్లదనపు మెరుపు తెస్తుంది.



### మరింత మన్నిక



ట్రిలో సులువుగా మెత్తబడిపోదు. అందుకే అందులో వృథాపోయేది ఎంత మాత్రం ఉండదు. పూర్తిగా అరిగిపోయేదాకా ట్రిలోను వాడవచ్చు.

**ట్రిలో** — మరింత ఉపయోగకరమైన నీలి డిటర్జెంట్ బిళ్ల. Godrej ఉత్పాదన

CHAITRA-GS-188 FEL

సీరియల్

# కలనిజమైతే...!

— విన్నకోట సుశీలాదేవి

ఆ రాత్రి కిరీటికి నిద్ర పట్టలేదు. మీనాక్షిని గురించే ఆలోచించ సాగాడు

"ఏమిట్రా కిరీటీ ! నిద్ర రావడంలేదా!" సారథి అడిగాడు.

"లేదురా !"

"మీనాక్షి గురించే ఆలోచిస్తున్నావు కదూ !"

"అవున్రా చనిపోయిన మీనాక్షి ఎలా బ్రతికిందా అని సందేహంగా వుందిరా" కిరీటి అన్నాడు.

"మీనాక్షి చనిపోలేదురా !"

సారథి హఠాత్తుగా అన్నాడు

కిరీటి వులిక్కిపడ్డట్టు చూశాడు.

"అవునురా ! ముమ్మాటికీ నిజం !"

"అంత ఖచ్చితంగా ఎలా చెప్పగలుగుతున్నావురా ?"

"మీనాక్షిని నా కళ్లతో చూశా కాబట్టి !" సారథి అన్నాడు

"ఆమె చనిపోవడం నా కళ్లతో నేనూ చూశారా !"

"కిరీటీ ! లోకంలో ఎన్నో వింతలు జరుగుతుంటాయి ! చనిపోయినవాళ్లు మళ్లా కొంత సేపటికి లేచి కూర్చున్నారని మనం అప్పుడప్పుడు పేపర్లో వార్తలు చదువుతూంటాం ! ఇదీ అటువంటి వింతల్లో ఒకటి !"

"అయితే మీనాక్షి చనిపోలేదంటావా ?" మళ్లా అడిగాడు కిరీటి !

"లేదు ! ఆమె తిరిగి బ్రతికింది !" సారథి దృఢంగా చెప్పాడు !

సారథి మాటలు కిరీటిని ఆలోచింప చేశాయి !

సారథి చెప్పిందికూడా సబబుగానే వుంది ! తనూ పేపర్లల్లో అటువంటి వింతలెన్నో చదివాడు. సారథి చెప్పినట్లుగా మీనాక్షి తిరిగి బ్రతికి వుండొచ్చు! తను ఆమె చనిపోయినప్పుడు అక్కడే వున్నాడు! డాక్టరు ఆమె మరణించిందని చెప్పగానే ఇక క్షణంకూడా వుండలేక వచ్చేశాడు ! హాస్పిటల్లోనే కాదు ! ఆ వూరిలోనే వుండలేక సరాసరి స్టేషన్‌కొచ్చి విజయవాడ బండెక్కేసి సారథి దగ్గరికొచ్చాడు ! అయితే తను అక్కడి నుండి వచ్చేసిన కొద్ది క్షణాలకే ఆమె బ్రతికుండొచ్చు ! తనకా విషయం తెలీక — తనామె చనిపోయిందని అనుకుంటున్నాడేమో !

( గతసంచిక తరువాయి )

"కిరీటీ ! ఇక ఆలోచనలు కట్టిపెట్టి ప్రశాంతంగా వుండరా !" సారథి అన్నాడు.

"అదికాదురా! నాకొక అనుమానం కలుగుతోంది ! మీనాక్షి బ్రతికుంటే ఇన్నాళ్లా నన్ను కలవకుండా వుంటుందా ?"

"ఏమో ! దానికి నేను సమాధానం చెప్పలేను ! వచ్చేవారం మీనాక్షి చెప్తుంది కానీ నువ్వు హాయిగా నిద్రపోరా !" అన్నాడు సారథి కళ్లుమూసుకుంటూ.

"వచ్చేవారం వరకూ అక్కర్లేదురా ! రేపు నేను హైద్రాబాద్ వెడితే అంతా తేలుతుంది" అన్నాడు కిరీటి ఎంతో ధీమాగా.

కిరీటి ఎందుకు హైద్రాబాద్ వెడుతున్నాడో గ్రహించుకున్న సారథి మౌనంగా వుండిపోయాడు.

* * *

ఎంతో ఆశతో హైద్రాబాద్ వెళ్లిన కిరీటి మూడో రోజునే పుట్టెడునిరాశతో తిరిగొచ్చాడు.

"వెళ్లిన పని ఏమయింది ?" సారథి అడిగాడు.

"ఏం కాలేదు !" విచారంతో అన్నాడు కిరీటి. "అసలు నువ్వెందుకు వెళ్లావో ఇప్పుడైనా చెప్తావా ?"

"మీనాక్షి గురించి తెలుసుకుందామని ముందు వుస్మానియా హాస్పిటల్‌కి వెళ్లాను. హాస్పిటల్లో చనిపోయిన వాళ్ల పేర్లు డెత్ రికార్డులో ఎక్కిస్తారని విన్నాను. మీనాక్షి చనిపోయి వుంటే ఆమె పేరు చేర్చి వుంటారు కదా ! కానీ నేను ఎంత ప్రయత్నించినా తెలుసుకోలేక పోయాను" కిరీటి బాధగా అన్నాడు.

"ఎందుకని ?"

"రిజిష్టర్లో పేరు మాత్రం లేదు !"

ఆ మాటతో సారథి కళ్లు మెరిశాయి.

"అయితే ఇంకేం" సంతోషంగా అన్నాడు.

కానీ కిరీటి నవ్వలేదు.

"అది కాదురా సారథీ ! ఆ రిజిష్టర్లో చనిపోయిన వాళ్ల పేర్లు సరిగ్గా నోట్ చేస్తున్నట్లు నాకనిపించలేదు. చాలా పేజీలు ఖాళీగా వున్నాయి. ఆ డ్యూటీ నర్సుల అశ్రద్ధ కారణమై వుండొచ్చు. మీనాక్షి పేరుని కూడా ఎక్కించడం మర్చిపోయి వుంటారు !" అన్నాడు కిరీటి.

సారథి ఏం మాట్లాడలేకపోయాడు

"అక్కడి నుండి మీనాక్షి వాళ్ల ఇంటికెళ్లాను. అక్కడా నాకు నిరాశే ఎదురైంది. వాళ్లు హౌసింగ్ కాలనీలో ఫ్లాట్ తీసుకుని వుంటున్నారు. ఈ ఫ్లాట్స్‌లో వుంటున్న వారికి ప్రక్క ఫ్లాట్‌లో ఎవరుంటున్నారో కూడా తెలీదు. వాళ్ల గురించి ఒక్క విషయం మాత్రం చెప్పారు."

"ఏమిటది ?"

"మీనాక్షి చనిపోయిన రాత్రే వాళ్లందరూ కలిసి మద్రాసు వెళ్లిపోయారుట."

"మద్రాసా ! ఎందుకు ?" సారథి ఆశ్చర్యంగా అడిగాడు.

"ఏమో అది వాళ్లకు తెలీదుట."

"మీనాక్షి గురించి ఏవన్నా చెప్పారా ?"

"అదీ అడిగాను. వాళ్లకసలు మీనాక్షిని హాస్పిటల్లో చేర్పించినట్లు కూడా తెలీదుట. చూశావా సారథీ ! మానవుడెంత నాగరికంగా జీవిస్తున్నాడో ?" కిరీటి వ్యంగ్యంగా అన్నాడు.

సారథి ఏం సమాధానం చెప్పలేకపోయాడు. కొద్దిసేపయ్యాక "కిరీటీ ! చాలా అలిసిపోయినట్లున్నావ్. స్నానం చేసి రెస్టు తీసుకో. ఈరోజు కూడా బ్యాంకుకు శెలవు పెట్టావా?" అనడిగాడు సారథి.

"ఆ !"

"అయితే నేను ఆఫీసు కెడుతున్నా !" సారథి వెళ్లిపోయాడు !

* * *

ఆ రాత్రి పడుకోబోయేముందు సారథి "కిరీటీ ! విన్నొక మాట అడగనా ?" అని ప్రశ్నించాడు.

"ఏమిట్రా అది." లేచి కూర్చున్నాడు కిరీటి.

"మీనాక్షి పేరెత్తినప్పుడల్లా 'ఆమె ఒక గాజు బొమ్మరా' అనేవాడివి ! అంటే అర్థం ఏమిటి కిరీటీ ?"

**జరిగిన కథ—2 :** హైదరాబాద్ ఉస్మానియా హాస్పిటల్లో చనిపోయిన మీనాక్షి బ్రతికొచ్చిందని సారథి ద్వారా తెలుసుకున్న కిరీటి మనసులో అలజడి రేగింది పాత జ్ఞాపకాలు చుట్టుముట్టాయి — కిరీటికి మీనాక్షి బ్యాంకులో పరిచయమవుతుంది. కిరీటి ఆహ్వానంపై అతని ఇంటికి వస్తుంది మీనాక్షి. అతనివద్ద వయొలిన్. నేర్చుకోను శిష్యురాలిగా చేరుతుంది. మీనాక్షి ఆరోగ్యం మంచిది కాదని తెలుసుకొని బాధపడతాడు కిరీటి. ఆమె తనని ప్రేమిస్తోందని తలుస్తాడు. మీనాక్షిని సారథికి పరిచయం చేస్తాడు. గత స్మృతులలో నుండి బయటపడతాడు కిరీటి — మీనాక్షిని తనొక కళ్లజోడు షాపులో చూచినట్లు చెప్తాడు సారథి. కిరీటి ఒకసారి హైదరాబాదు వెళ్లిరాను నిశ్చయించుకుంటాడు.

ఆ మాట వినగానే కిరీటి ముఖం మ్లానమైంది. అది చూసి సారథి— "ఇష్టం లేకపోతే చెప్పకులేరా! ఆ పాత విషయాల్ని గుర్తు చేసి నిన్ను అనవసరంగా బాధ పెట్టానేమో" అన్నాడు.

"లేదురా! చెప్తాను! ఆ జ్ఞాపకాలను మళ్ళా మళ్ళా తలుచుకోవడం నాకు బాధతో పాటు ఆనందం కూడా కలిగిస్తుందిరా!" అంటూ కిరీటి గతంలోకి వెళ్ళాడు.

* * *



"మీనాక్షీ! వారానికి ఒక రోజు వచ్చి నేర్చుకుంటే గాని సంగీతం రాదు. కనీసం రోజు విడిచి రోజు అయినా నేర్చుకోవాలి!" అన్నాడొక రోజు కిరీటి మీనాక్షితో.

"రోజు విడిచి రోజు రావడం కుదరదండీ! కానీ వీలున్నప్పుడు వస్తాను" అంది.

దానికే ఆనందపడ్డాడు కిరీటి.

మీనాక్షి మనసు తెలిసింది కాబట్టి కిరీటికి ఇదివరకుండే సంకోచం పోయింది.

ఆమెని చూస్తున్నప్పుడు — ఈమె నా స్వంతం అనే అభిప్రాయం కలుగుతోంది. కానీ ఎప్పుడూ అతి చనువుని చూపలేదు.

మీనాక్షి చదువయిపోయాక ఆమెకి తన మనసులోని మాట చెప్పాలి. సిగ్గుతో వాలిపోయే కళ్ళనూ, గులాబీ మొగ్గలయ్యే చెక్కిళ్ళనూ తనివితీరా చూడాలి. ఆ తర్వాత తడబడుతూ — ఆమె తన మనస్సు విప్పి చెప్తుంటే ... మధుర సంగీతంలా మనసారా వినాలి.

ఆ క్షణాల కోసమే కిరీటి ఎదురు చూస్తున్నాడు.

మీనాక్షి పరీక్షలయ్యాయి.

తను ఎదురుచూసిన ముహూర్తం వచ్చిందనుకున్నాడు కిరీటి.

ఆదివారం మీనాక్షి వచ్చినప్పుడు —

"మీనాక్షీ! పరీక్షలయ్యాయి. సెలవులేగా! రేపు రాకూడదూ!" అన్నాడు.

"ప్రయత్నిస్తాలెండి."

"కాదు! తప్పక రావాలి!"

"అలాగే" మాటిచ్చింది.

కిరీటి పొంగిపోయాడు.

రేపే...తను — మీనాక్షి మనసులు విప్పి మాట్లాడుకునేది! అంతేకాదు తను పెళ్లి ముహూర్తం నిర్ణయమయ్యేది కూడా రేపే!

ఆ సంతోషంతో — కిరీటి ఎన్నో కీర్తనలు మధురాతి మధురంగా వాయించాడు! ఆ గాన సుధాలహరిలో మునిగి తేలుతున్న మీనాక్షికి సమయం తెలీలేదు.

కిరీటి వయొలిన్ క్రిందపెట్టి లేచేసరికి బాగా చీకటి పడింది! కిరీటి లైటు వేశాడు!

మీనాక్షి కూడా లేచింది.

"రోజూకంటే ఇవ్వాళ చాలా బాగా వాయించారు." మీనాక్షి మెచ్చుకుంది.

ఎవరీ కలువబాలల?....



# కల నిజమైతే!

''రేపింకా బాగా వాయిస్తాను! మీనాక్షి!'' అన్నాడు.

''ఏమిటో విశేషం!'' నవ్వుతూ అంది.

''రేపు నీకే తెలుస్తుంది''

''అయితే రేపటి వరకూ సస్పెన్స్ అన్నమాట!''

''అవును మీనాక్షీ! నిరీక్షణలోనే ఆనందం వుంది'' అన్నాడు కిరీటి ఆమె కళ్లల్లోకి చూస్తూ.

''సరే, ఆ ఆనందాన్ని నేనూ అనుభవిస్తాలెండి! వస్తాను'' అని నవ్వుతూ వెళ్లిపోయింది

* * *

మర్నాడు — మూడు గంటల వేళ కిరీటి బ్యాంకులో కూర్చుని పని చేసుకుంటున్నాడు! శరీరం యాంత్రికంగా పని చేస్తున్నా — మనసు మాత్రం క్షణాలు లెక్కపెట్టుకుంటోంది! త్వరగా కాలం గడిచి...

సాయంత్రం అయిదయితే. .

మీనాక్షి వస్తుంది... తామిద్దరూ కలిసి పెళ్లి విషయం నిర్ణయించుకున్నాక — బజారు కెళ్లాలి.

మీనాక్షికి పట్టుచీర కొనాలి! మీనాక్షికి కోవా అంటే చాలా ఇష్టం. బాంబే స్వీట్స్ షాపుకు వెళ్లి...

''సార్...!''

కిరీటి ఆలోచనలకు బ్రేకు పడింది! తలెత్తి చూశాడు.

ప్యూను చలమయ్య కనబడ్డాడు!

''ఏమిటి!''

''మీకోసం ఎవరో వచ్చారు!''

కిరీటి లేచి బయటకు వచ్చాడు.

ఎవరో కుర్రాడు గేటు దగ్గర నిలబడి వున్నాడు! కిరీటిని చూస్తూనే ముందుకు వచ్చాడు.

''మీరేనా కిరీటి!'' అతడడిగాడు.

''అవును!''

''రావుగారు మీదగ్గరకు పంపారు.''

''రావుగారా! ఎవరాయన!''

''మీనాక్షి తెలుసా మీకు!'' ఎదురు ప్రశ్న వేశాడతడు.

''ఆ! తెలుసు.''

''మీనాక్షి మా అక్క. రావుగారు మా నాన్నగారు. మీనాక్షి వుమెనియా హాస్పిటల్లో వుంది!''

కిరీటి ఆశ్చర్యపోయాడు.

''హాస్పిటల్లోనా! ఏమయిందామెకు!'' ఆరాటంగా అడిగాడు.

''ఏమో తెలీదు. రండి వెడదాం.''

కిరీటి ఏజెంటుని పర్మిషన్ అడిగి అతడి వెంట ఆటోలో బయలుదేరాడు

కిరీటి వెళ్లేసరికి మీనాక్షి స్పృహలో లేదు. ఆమె చుట్టూ ఎవరెవరో వున్నారు.

"మీరేనా కిరీటి ?" ఒక యాభై ఏళ్ల వ్యక్తి కిరీటిని అడిగాడు.

"అవును !"

ఆయన ఒకసారి తిరస్కారంగా కిరీటివేపు చూసి తల తిప్పుకున్నాడు.

కిరీటి అదేం పట్టించుకోలేదు. అతని దృష్టంతా మీనాక్షి మీదే వుంది.

మీనాక్షిని గురించి తెలుసుకోవాలని వుంది తనికి. కానీ ఎవర్ని, ఎలా అడగాలో తెలీడం లేదు.

అతనికి కంగారుగా వుంది. బాధగా వుంది. కళ్లల్లో నీళ్లు తిరుగుతున్నాయి.

తను ఈ రోజు కోసం ఎన్నో కలలు కన్నాడు. మరెంతో కాలం నుండీ ఎదురు చూసాడు కానీ సరిగ్గా ఈ రోజునే మీనాక్షి హాస్పిటల్లో స్పృహలేని స్థితిలో వుంది.

మీనాక్షి కేమైందోకూడా తెలియడంలేదు. తెల్లటి బెడ్‌మీద నలిగిన మల్లెల చెండులా— వాడిన కలువల దండలా పడుకున్న మీనాక్షి దగ్గరకు వెళ్లి ఆమె తలని ఒడిలోకి తీసుకుని— "మీనాక్షీ ? నీ కేమైంది ? చెప్పు. నీ కోసం నా ప్రాణాలనయినా పణంగా పెడతాను !" అని చెప్పాలని వుంది.

కానీ మీనాక్షికీ తనకూ మధ్య ఎన్నో వేలమైళ్ల దూరం. మీనాక్షి దగ్గరకు వెళ్లడం ఎలా ?

కిరీటి మీనాక్షివేపు చూస్తూ విచారంగా నిలబడ్డాడు.

ఇంతలో—

ఇందాకటి కుర్రాడు మీనాక్షి దగ్గరకు వచ్చి "కిరీటిగారూ ! ఇలా రండి !" అంటూపిలిచాడు

కిరీటి అతని వెనకే వరండాలోకి వెళ్లాడు. ఆ కుర్రాడు జేబులోంచి ఒక కవరు తీసి కిరీటి కిచ్చాడు.

"మా అక్క మీకిమ్మన్నది" అని చెప్పి వెళ్లిపోయాడతను.

కిరీటి ఆ కవరు విప్పి చూశాడు. దాన్లో ఏవో కాగితాలు కన్పించాయి. అదేదో వుత్తరంలా వుంది. వాటిని ఎక్కడ చదవాలా అని కిరీటి చుట్టూ చూశాడు. కానీ తగిన ప్రదేశం కనబడ లేదు. అక్కడి నుండి గబగబా క్రిందకు వెళ్ళి చెట్టు నీడన కూర్చుని వుత్తరం విప్పాడు. వుత్తరం త్వరత్వరగా వ్రాసినట్లుంది, అక్షరాలు కొంత గజిబిజిగా వున్నాయి.

కిరీటి ఆత్రంగా చదవసాగాడు !

కిరీటీ,

మీరా రోజు నన్ను తప్పక రమ్మని కోరారు. నా రాకకోసం ఎంతో ఆశతో ఎదురుచూస్తుంటారు. కానీ నేను మీ దగ్గరకు రాలేని స్థితిలో

## తరించి తరించి పోవాలని వుంది

చూడాలని వుంది నిన్ను
చూడాలని వుంది
అందమైన ప్రభాతవేళలో
గంధర్వుడవై విహరిస్తుంటే
నే పారిజాత వన తరువై
పూల వర్షం కురిపిస్తూ
మురిసి మురిసి పోవాలని వుంది

వుదయ సుందారంలా
నా హృదయ వన వాటికలో
విహరించరాగా
పొగమంచు పందిట్లో
పొగడపూల వరుపేసి
మంచునీటి ముత్యాలతో
నిను ముంచెయ్యాలని వుంది

మంద్ర స్థాయి నీ స్వరముతో
నా హృదయతంత్రులను మీటుతువుంటే
తనువె వీణగ గానంచేస్తూ
తరించి తరించి పోవాలని వుంది.

— శ్రీమతి సీతాశరత్చంద్ర

వున్నాను. ఇంకొద్ది సేపట్లో మీరే నా దగ్గరకు రాబోతున్నారు.

కానీ మీకు కబురు తెలిసి — మీరు నా దగ్గరకు వచ్చేసరికి నేను స్పృహలేని స్థితిలో వుండొచ్చు. లేదా నా ప్రాణాలు అనంత వాయువుల్లో కలిసిపోవచ్చు.

అప్పుడిక — ఈ గుప్పెడు మనసులో దాగిన అనంతమైన రాగాలు మీకిక విన్పించవేమోనని — మీ కోసం శ్రుతి చేయబడిన ఈ వయొలిన్ మీకు ప్రేమగీతాలు విన్పించకుండానే ఈ తీగలు తెగిపోతాయేమోననే భయంతో — ఓపిక లేక పోయినా ఈ నాల్గు వాక్యాలు వ్రాస్తున్నాను.

కిరీటి! నేను తరుచు నా గురించి చెప్పు కుంటూ 'నేనొక గాజుబొమ్మనండీ' అనేదాన్ని. మీరు ఎన్నోసార్లు దాని అర్థం చెప్పమని అడిగారు. నేనే ఒకరోజు మీకా విషయం చెప్తానని మాటిచ్చాను. ఆ మాట నిలబెట్టు కోకుండానే వెళ్ళిపోతానేమోననే భయంకూడా కొంత కారణం.

కిరీటీ ! పుట్టుకతోనే ఈ గుండెలో లోపం ఏర్పడింది. నేను అసలు అప్పుడే చనిపోయేదాన్ని కానీ బొంబే హాస్పిటల్లోని డాక్టర్లు నా చిన్న గుండెకు ఆపరేషన్‌చేసి బ్రతికించారుట. నా పదిహేనో ఏట నాకు మళ్లా ఆపరేషన్ చేశారు

అప్పుడే కాదు — ఇప్పటి వరకూ నా వ్యాధేమిటో నాకు స్పష్టంగా తెలీదు. నేను భయపడతానని తెలీకుండా దాచారు. నాది చాలా సుకుమారమైన శరీరమని— నేను ఎటువంటి ఆవేశానికి, ఉద్రేకానికి లోనుకాకూడదని డాక్టర్లు చెప్పారు. కొద్ది అలసట కూడా నా శరీరం తట్టుకోలేదుట. నేను ఎక్కువ కాలం జీవించా లంటే నా శరీరానికి, ముఖ్యంగా నా గుండెకు ఎటువంటి వత్తిడి కలగకూడదట నాన్నగారు నా గురించి ఎంతో జాగ్రత్త తీసుకున్నారు. నా ఈ చిన్ని గుండె ఏ క్షణాన ఆగిపోతుందోననే భయం— నాన్నగారికి మనశ్శాంతిని కరువు చేసింది.

నాకు కూడా అప్పుడప్పుడు నా జీవితాన్ని గురించి భయం కలిగేది. ఆ భయాన్ని మర్చి పోవడానికి నేనెన్నో ప్రయత్నాలు చేస్తుండేదాన్ని. ప్రతిక్షణం ఏదో దిగులు. విచారం నన్ను వెన్నాడు తుండేవి.

ఆ స్థితిలో నాకు మీ పరిచయం కలిగింది.

ఇన్ని ఇళ్లు మార్చిన ఎప్పుడూ ఫైపోర్షన్ కావాలని పట్టుపడుతాడేంటిరా... ఆ గుర్నాధంగాడు?

ఒకరి కింద బ్రతకాలండే పడదట వాడికి...!

ప్రసాద్

నాలో— వుత్సాహం — భవిష్యత్తుపై ఆశ కలిగాయి. మీ మాటలు, మీ సంగీతం నాలో వూపిరి పోస్తున్నట్లుండేవి. నా గుండెకు ఎంతో బలాన్నిస్తున్నట్లుండేవి. ప్రతిక్షణం మీ సాన్నిహిత్యం కోరేది మనస్సు! నా పరిస్థితి తెలిసి కూడా మీతో జీవితం పంచుకోవాలని వుండేది!

మీ స్నేహితుడి పుణ్యమా అని మీ మనస్సు తెలిసింది. ఆ రోజు ఎంతో ఆనందించాను. అయినా మీ నోటినుండి ఆ మాటలు వినాలన్పించింది. నిన్న వెళ్ళబోయేముందు మీరు — నీతో ఒక విషయాం చెప్పాలి! రేపు తప్పక రమ్మని చెప్పారు.

అదేమిటో నేను కొద్దిగా గ్రహించుకున్నాను. నేనూ ఆ రోజుకోసమే ఎదురు చూస్తున్నా! అది రేపే! ఆ ఆనందంతోనే ఇంటికి వెళ్ళాను.

కానీ ఇంటిలో వాతావరణం భిన్నంగావుంది. అందరూ డ్రాయింగ్ రూమ్‌లో నా కోసం ఎదురుచూస్తున్నట్లుగా కూర్చున్నారు.

"ఇంత చీకటి పడేవరకూ ఎక్కడున్నావ్" అమ్మ అడిగింది.

మీ సంగీతం వింటూంటే నాకు సమయమే తెలీలేదు! ఇన్నాళ్ళా నేను చీకటి పడకముందే వచ్చేయ్యడం వలనేమో ఎవురికీ ఏ సందేహమూ రాలేదు! వాళ్ళు అడక్కపోవడం వలన నేనూ మీ గురించి చెప్పలేదు. 'ఇప్పుడు సమయం వచ్చింది చెప్పక తప్పదు' అనుకుని మీ గురించి అమ్మా నాన్నకు చెప్పాను.

నాన్నగారికామాట వినగానే విపరీతమైన కోపం వచ్చింది. మిమ్మల్ని నిందించడం మొదలెట్టారు! అదే నాకూ కోపాన్ని కలిగించింది. నేను కిరీటిని చూడకుండా వుండలేనని ఖండితంగా చెప్పాను!

నాన్నగారు ఆవేశంలో నా చెంప మీద ఒక్కటి వేశారు! "ఇక ఇల్లు కదలడానికి వీల్లేదు" అన్నారు.

నాకు వెర్రికోపం వచ్చింది! ఆవేశంతో నా ఒళ్లంతా చెమటలు పట్టాయి! రోషంతో ఏదో

## 1986 లో హేలీ!

76 సంవత్సరాల తరువాత హేలీ తోకచుక్క మళ్ళీ మనకి 1986 ఫిబ్రవరిలో కనిపించనున్నది. అత్యంత ఆసక్తిదాయకమైన ఈ తోకచుక్కగురించి పరిశోధన అప్పుడే సన్నాహాలు ప్రారంభమయినాయి. ఈ తోకచుక్క క్రీ. పూ. 466 నుంచి ప్రతి 76 సంవత్సరాల కొకసారి కనిపిస్తున్నది. ప్రముఖ ఖగోళ శాస్త్రవేత్త సర్ ఎడ్మండ్ హేలీ పేరుతో, ఈ తోకచుక్కను పిలుస్తున్నారు. తోకచుక్కల ఆవిర్భావం గురించి వివాదాస్పదమైన సిద్ధాంతాలు వాడుకలో ఉన్నాయి. వీటిలో ఏది నిజమో, ఈసారి నిర్ధారించటానికి వీలవుతుందని అనుకుంటున్నారు.

## కల నిజమైతే

అనబోయాను! అంతే — ఒక్కసారిగా గుండెల్లో భయంకరమైన బాధ కలిగింది. గుండె పట్టుకుని కుప్ప కూలిపోయాను.

మళ్ళా కళ్ళు తెరిచేసరికి హాస్పిటల్లో వున్నాను! నాకు వెంటనే ఆపరేషన్ చెయ్యాలిట. అన్నీ సిద్ధం చేస్తున్నారు.

నాన్న తన మూలంగానే ఇలా అయిందని ఎంతో కుమిలిపోతున్నారు. పాపం పిచ్చి నాన్న ఆయన్ని చూస్తుంటే నాకు జాలేస్తోంది. తల రాతని తప్పించడం ఎవరికి సాధ్యం!

కిరీటీ! మళ్ళా ఆపరేషనంటే నాకూ ఎందుకో భయం కలుగుతోంది. మన గురించి ఎన్నో అనుకున్నాను, మిమ్మల్ని పెళ్ళాడి — మీతో సహజీవనం సాగించాలని మన సంసారం మధుర సంగీత భరిత కావ్యంగా వుండాలని ఏవేవో కలలు కన్నాను. అవి తీరే యోగం లేదేమో?

పోనీండి! ఏంచేస్తాం! ఎవరికెంత ప్రాప్తమో అంతే

అదుగో! డాక్టరుగారు వస్తున్నారు! ఆయన వెనకాలే నన్ను ఆపరేషన్ థియేటర్‌లోకి తీసుకెళ్ళడానికి స్ట్రెచర్ వస్తోంది. నేను వెడుతున్నా.

మా తమ్ముడి చేత మీకు కబురుచేస్తున్నా, ఈ వుత్తరం కూడా మీకిస్తాడు.

ఇప్పుడిప్పుడే తూర్పున వెలుగురేకలు విచ్చుకుంటున్నాయి. సూర్యోదయ మౌతోంది.

నా జీవితంలో కూడా సూర్యోదయమౌతుందా? వెలుగురేఖలు ప్రసరిస్తాయా! అనే సందేహం కలుగుతోంది.

నాన్నగారు నా దగ్గరికి వస్తున్నారు! ఇక ముగిస్తున్నాను

కిరీటీ! ఈ చివరి క్షణాల్లో నా దొకటే కోరిక— మళ్ళా కళ్ళు తెరవాలని— కళ్ళు తెరవగానే మీరు కనబడాలని—

నా కోరిక నెరవేరుతుంది కదూ!—

మీ నా క్షి.

ఆ వుత్తరం చదివేసరికి కిరీటి కళ్ళు రెండూ నీటితో నిడిపోయాయి.

మనస్సు ఆవేదనతో దహించుకుపోయింది. శరీరంలోని ప్రతి అణువూ మీనాక్షి కోసం ఆరాటపడసాగింది.

తన కారణంగానే మీనాక్షి నాళ్ళతో పోట్లాడింది. తన వల్లనే మీనాక్షి ప్రమాదస్థితి తెచ్చుకుంది.

"మీనాక్షీ! నిన్ను బ్రతికించుకుంటాను!" అనుకుంటూ కిరీటి హాస్పిటల్‌కి పరిగెట్టాడు.

కానీ అతడు వెళ్ళేసరికే మీనాక్షి కళ్ళు శాశ్వతంగా మూతలు పడ్డాయి.

కిరీటికి పిచ్చెక్కినట్లయింది! ఆ బాధకి తట్టుకోలేకపోయాడు. ఇక అక్కడ క్షణం కూడా వుండలేకపోయాడు. రైలెక్కి విజయవాడలో వున్న సారధి దగ్గరకు వచ్చేశాడు.

**(ఇంకా వుంది)**






### టి. వి. యస్. పి. — హిందూపురం

నాకు 34 సంవత్సరములు. లావుగా వుంటాను. ప్రతి దినం ప్రొద్దున రెండు నిమ్మ పండ్ల రసం తీసుకుంటున్నాను. ఇది ఆరోగ్యానికి మంచిదా? లావు తగ్గుతానా ?

★ లావు తగ్గటం అనేది నిమ్మరసం త్రాగటం మీద ఆధారపడి ఉండదు. తీసుకునే ఆహార ప్రమాణాన్ని తగ్గించటం, తీసుకున్న ఆహారం జీర్ణమయ్యేటందుకు తగిన వ్యాయామం చేయటం చాలా అవసరం. క్రొవ్వు పదార్థాల వాడకం పూర్తిగా తగ్గించటం, పిండి పదార్థాల వాడకం కట్టుదిట్టం చేయటం చాలా అవసరం.

### డి.ఎల్.జె.వి.పి. — మార్కాపురం

నా వయస్సు 19 సంవత్సరములు. 10 సంవత్సరముల వయస్సులో కీళ్ళవాతము వచ్చినది. మరల ఇప్పుడు వచ్చినది. నేను పెండ్లి చేసుకోవచ్చునా ?

★ కీళ్ళవాతం వచ్చినప్పుడు, వెంటనే వైద్యుల సలహా ప్రకారం చికిత్స పొందటం అవసరం. రుమాటిక్ ఆర్థ్రైటిస్ ఉన్నవారు వైద్యుల సలహా ప్రకారం లాంగ్ ఆక్టింగ్ పెన్సిలిన్, సాలిసిలేట్స్ — వాడితే హృద్రోగం రాకుండా చూసుకోవచ్చును. తగిన జాగ్రత్తలు తీసుకొంటే వివాహానికి అనర్హులు కావలసిన అవసరం ఉండదు.

### యల్. ఆర్. — వాల్తేరు

మా అన్నయ్యకి మొదటి పుత్రుడు జన్మించి 2 సం॥లు 6 నెలలు దాటింది. ఇంత వరకు అమ్మా, నాన్న అన్న పదాలు తప్ప వేరే మాటలు రావటంలేదు. భవిష్యత్తులో వేరే మాటలు రావచ్చునా ? మాటలు రావాలంటే ఏంచేయాలి ?

★ కాలగతిలో మాటలు తప్పక వస్తాయి. మాటలు రావటానికి ప్రత్యేకంగా మందులేవీ లేవు.

### ఎస్. ఆర్. ఆర్. — హైదరాబాద్

మా నాన్నగారి వయస్సు 56 సం॥లు 2 సం॥లు క్రితం నిద్రలో మంచం మీద నుంచి క్రింద పడటం జరిగింది. డాక్టర్లు పరీక్ష చేసి ఏమీ లేదన్నారు. ఏదైనా "గాలి" ఏమో అని ఊరుకున్నాము. కొంత కాలం తర్వాత కుటుంబ సమస్యల వల్ల స్థిమితం తప్పితే కరెంట్ ట్రీట్‌మెంటు చేశారు. నెల, రెండు నెలలు కొకసారి ఫిట్సు వస్తూ ఉంటాయి. ఆ సమయంలో నోటి వెంట నురుగు వస్తున్నది.

★ ఈ లక్షణం గ్రాండ్ మాల్ ఎపిలెప్సీని తెలియజేస్తుంది. ఈ రోగానికి న్యూరాలజిస్టుల సలహా మేరకు గార్డినాల్, డైలాంటిన్, ఎప్టాయిన్ మొదలయిన మాత్రలను నిర్ణీత మోతాదులో వాడవలసి ఉంటుంది.

### కె. కె. ఎం. — తిరుపతి

5 నెలలుగా శరీరంపైన తెల్లని మచ్చలు కలవు. స్పర్శజ్ఞానం ఉంది. ఏ మందులు వాడాలి ?

★ శరీరంలో తెల్లని మచ్చలు చాలా కారణాల వల్ల ఏర్పడతాయి. ఎటిలైగో, ల్యూకోడెర్మా అనేవి పుట్టుకతోనే సంక్రమించి కొన్ని సం॥ల తర్వాత శరీరంమీద కనబడతాయి. ఈ మచ్చలకి చికిత్స కష్టం. ఫంగస్ ఇన్‌ఫెక్షన్ల వల్ల ఏర్పడే తెల్లమచ్చలు మందుల వాడకం వల్ల తగ్గిపోతాయి. సోరియాసిస్ అనే రోగం వల్ల వచ్చే మచ్చలకి చాలా కాలంపాటు మందులు వాడాలి. లెప్రసీ వల్ల వచ్చే మచ్చలలో స్పర్శ జ్ఞానం ఉండదు. ఈ మచ్చలు డాప్సోన్ అనే మందు వాడితే తగ్గిపోతాయి.

### టి.ఎస్. — నరసారావుపేట

పొట్టలోగాని, మూత్రంలోగాని పురుగులు ఉంటే గర్భంలో ఉన్న పిండానికిగాని శిశువుకు గాని ప్రమాదం జరిగే అవకాశం ఉందా ? మూత్రం విసర్జించే చోట పురుగులు పాకినట్లు ఉండి దురదగా ఉంటుంది.

★ కడుపులోని పురుగులకీ, గర్భంలోని శిశువుకీ సంబంధం లేదు. మూత్ర విసర్జన ద్వారంలో దురద అనేక కారణాలవల్ల వస్తుంది. మలంలో నులిపురుగులు ఉన్నవారికి, ట్రైకోమోనాస్ వెజైనులిస్ అనే క్రిములు ఉన్నవారికీ, గొనోరియా మొదలయిన రోగాలు ఉన్నవారికీ దురద వచ్చే అవకాశం ఉంటుంది. లేడీ డాక్టర్లు ప్రత్యక్షంగా పరీక్షించి చికిత్సా విధానం తీర్మానించవలసి ఉంటుంది. ★

---



ఇటీవల కేంద్ర సాహిత్య అకాడెమీ బహుమతి పొందిన డాక్టర్ రావూరి భరద్వాజగారిని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రాచ్య లిఖిత గ్రంథాలయం—పరిశోధనాలయం (హైదరాబాదు)వారు అభినందించిన సందర్భంగా వేదికపై శ్రీ సి.ఎస్. బాబు, డా. భరద్వాజ, హైదరాబాదు ఆకాశవాణి కేంద్రం డైరెక్టరు కుమారి లీలాబడేకర్, ప్రసంగిస్తున్న డా. వి.వి.ఎల్. నరసింహారావు, హైదరాబాద్ ఆకాశవాణి కేంద్రం అసిస్టెంట్ డైరెక్టర్ డా. ఆర్. ఎ. పద్మనాభరావు గార్లని చిత్రంలో చూడవచ్చు.

అతి కష్టంమీద కస్తూరిని చూసేందుకు అనుమతి సంపాదించాను. కటకటాల వెనుక నిస్సహాయంగా, రేగిన జుట్టుతో అస్తవ్యస్తమైన మాసిన చీరతో మోకాళ్ళలో తలదూర్చుకుని కూర్చున్నది మా కస్తూరే అని గుర్తుపట్టడానికి చాలా టైమే పట్టింది. నా కడుపులో పేగులు మెలి తిప్పినంత బాధ —

నా పిలుపుకు ఉలిక్కిపడి లేచిన కస్తూరి చూపు—పులిపంజాకు చిక్కి 'ప్రాణం పోవడం ఖాయం' అని తెలిసిన లేడికూన ఆఖరి చూపు అది. వారంరోజుల్లోనే కస్తూరిలో ఎంత మార్పు ? —

సెలయేటిలా పరుగులు తీస్తూ నన్ను పరుగులు పెట్టించే కస్తూరి —

ఒక్కక్షణం విసుగూ విరామం లేకుండా పసిపిట్టలా వాగుతూ నాకు ఊపిరి సలపనివ్వని కస్తూరి —

ఫ్యాషన్ పేరుతో తనకి కావలసిన వస్తువులు దొరికేదాకా రోజులకి రోజులు నన్ను కాళ్ళరిగేలా తిప్పించి ముప్పతిప్పలు పెట్టి తను హైరానపడిపోయే నా మేనగోడలు కస్తూరి —

ఈ రోజు జైల్లో మాసినచీరతో—మూగవోయిన వీణలా స్తబ్దంగా — ఈ ప్రపంచంలో సర్వస్వం కోల్పోయిన విరాగిలా అలా కూర్చుంటే — నాకు దుఃఖం కట్టలు తెగిపోతున్నా ఆమె ఇంకా బెంబేలెత్తిపోతుందని బలవంతాన ఆనకట్ట వేసాను.

కస్తూరీ ! —

నా రెండో పిలుపుకి — నిద్రలో లేచి నడుస్తున్నదానిలా కటకటాల దగ్గరకొచ్చి ఒక్క ఉదుటున ఉద్వేగంతో నా చేతులు పట్టుకుని మళ్ళీ అంతలోనే వదిలేసింది తప్పుచేసినదానిలా —







# మీ ఋణం తీర్చుకోలేను!

కుమారి ఎ.వి. శేషారత్నం

చేతుల్ని పదేపదే చూసుకుంటూ జైలు ఊచలకి తలకొట్టుకుంటూ బావురుమంటున్న ఆమె తలనిమురుతూ ఉండిపోయాను క్షణం సేపు.

కాని జైల్లో గడియారం కొట్టినగంట — కాలం విలువ తెలుపుతూ నన్ను హెచ్చరించింది.

"ఏమైంది కస్తూరీ ! నాకేసి చూడు. నువ్వేం తప్పు చెయ్యలేదు. భయపడకు" —

పిచ్చిదానిలా నాకేసి చూసింది.

"ఎందుకు మావయ్యా ! నన్ను భ్రమపెడతావు ? నాకు తెలుసు. నా జీవితం సర్వనాశనమయిపోయింది. నేను . నేను ... హత్య చేసాను. నాకు శిక్ష..."

"అలా అనకు. నేను మంచి లాయర్‌ని పెడతాను"

"వద్దు ! నన్నిలా అనామకంగానే చచ్చిపోనీ ! నేనిక్కడిలా జైల్లో ఉన్నట్టు అమ్మా నాన్నలకి చెప్పకు. కస్తూరి ఆక్సిడెంట్‌లో చచ్చిపోయిందని చెప్పు. అందుకే నేను నీ అడ్రసిచ్చాను. అమ్మా వాళ్లకి నా మొహం చూపించలేను."

కన్నీరు పొంగింది వరదలా.

"ఎందుకో చివరిసారిగా నిన్ను మాత్రం చూడాలనిపించింది. అందుకు నీకు ఉత్తరం వ్రాసాను. ఎంతో తెలివైనదానివని కదూ అనేవాడివి. చూసావా నా తెలివితేటలు బాహ్య ప్రపంచంలో దమ్మిడికి చెల్లలేదు సరికదా నన్నొక హంతకురాలిని చేసాయి."

ఉన్నట్టుండి విరగబడి నవ్వింది కస్తూరి–

"ఏమిటి మావయ్యా గాంధీ శిష్యురాలినని కదూ ఏడిపించేవాడివి. శిష్యురాలిని చూసి గాంధీజీ ఎలా నవ్వుతున్నాడో చూసావా ?" — నిలదీస్తున్నట్టు వేలుపెట్టి అక్కడి ఫోటో చూపించింది కస్తూరి.

దేశానికి అహింసా సిద్ధాంతంతో స్వాతంత్ర్యం సంపాదించి పెట్టాననే ఆనందంతో నవ్వుతున్న మహాత్ముని ఛాయాచిత్రం నిలువెత్తున — జైలు గోడలకి అతుక్కునిఉంది — అది —

ఈ దేశంలో అభాగ్యులైన రక్షణలేని ఆడవాళ్ళని — వాళ్ళని తోడేళ్ళలా వెంటాడుతున్న కాముకులను రక్షిస్తూ · రక్షించవలసిన చేనును మేసేస్తున్న కంచెను నిస్సహాయంగా చూస్తూ — "నేను పుట్టిన దేశం ఇదా ?"అని చిత్తరపోతూ నవ్వలేక నవ్వుతున్నాడుమహాత్ముడు

ఒక చెంపను కొడితే వేరొక చెంపను చూపాలనే సిద్ధాంతానికి చిన్న వయసైనా — మనసా వాచా అంకితమైన కస్తూరి హత్య చేసిందంటే నేనేకాదు, ఆమెను తెలిసిన ఎవరూ నమ్మరు.

మెల్లి మెల్లిగా బుజ్జగించి, మధ్యలో ఓదారుస్తూ కస్తూరిద్వారా జరిగిన విషయాన్ని బలవంతాన చెప్పించడం బ్రహ్మతరమే అయింది నాకు. ఆమె కథనం విన్న నేను అచేతనంగా జైలు వార్డెన్ హెచ్చరించేవరకూ అలాగే ఉండిపోయాను.

* * *

"మావయ్యా !"

లోకజ్ఞానంలేని చదువు ఎందుకూ పనికి రాదని తెలిసింది ఆ రోజే.

ఆడదాన్ని భోగవస్తువుగా, చరాస్తిలో భాగంగా భావించే సమాజంలో సగం జనాభాకు స్వేచ్ఛ లేదనే చెప్పాలి.

సూర్యాస్తమయమవుతోంది.

పుడమితల్లిని ఒంటరిగా వదలి వెళ్ళాల్సి వస్తున్నందుకు బలవంతాన దుఃఖాన్ని దిగమింగుతూ ముఖాన్ని ఎర్రగా చేసుకుని దిగులుగా పశ్చిమంలోకి క్రుంగిపోతున్నాడు లోక రక్షకుడు.

చీకటి పడుతూంటే — దుష్టశక్తుల విజృంభణకు నిరసనగా రణగొణధ్వని చేసుకుంటూ సమ్మెచేస్తున్న కార్మికుల్లా గుంపులు గుంపులుగా గూళ్ళకి తరలిపోతున్నాయి పక్షులు.

కొత్తగా ఎగరడం నేర్చుకున్న పిట్ట ఒకటి దారితప్పి — మిగిలిన పక్షులు — తనవాళ్ళు కనబడక — కొట్టుమిట్టాడుతూ ఆవేదనగా ఒంటరిగా ఆకాశంలో అటూ ఇటూ అలంగం తిరుగుతోంది.

ఆ పిట్ట స్థితికీ, నాకూ ఏమీ తేడా లేదనిపించింది.

చేతిలో చిన్న సూట్‌కేస్‌తో నరసంచారం లేని ఆ చిన్నస్టేషన్‌లో కనుచీకట్లో ఒంటరిగా దిగులుగా నిలబడిపోయాను నేను.

"ముందు జాగ్రత్త లేనివాళ్ల గతి ఇంతే" అన్నట్టు నిరసనగా చూసి నా ఖర్మానికి నన్ను వదిలేసి ఒక్క ఉదుటున బయలుదేరిన రైలు ఆఖరిపెట్టె కనిపించేదాకా చూస్తూండిపోయాను.

నా భయాన్ని కనిపెట్టినట్టున్నాడు ఆ పోర్టర్. అనునయంగా —

"బయంలే. బస్సు టేసన్‌కాడ దింపుతా పద" — అంటూంటే అతని భాష, ఆ ఏకవచన ప్రయోగం కర్ణకఠోరంగా అనిపించినా, మరో గత్యంతరంలేక అతన్ననుసరించాను.

"గుంటూరుకు డైరెక్టుగా పోయే బండి ఎన్నిగంటలకుందో తెలుసా ? — ఇంకా ఆశ చావలేదు నాలో.

"అయ్యో ఇపుడేందమ్మా ! రేతిరి తొమ్మిదిన్నరకే. అదీ సజావుగా వస్తదో లేదో ఆడికెరిక" పైకి చూపించాడు.

ఇంక ఈ రోజుకి గుంటూరు చేరే ఆశకి నీళ్ళొదిలేసాను. ఒకవేళ కరెక్టుగా ట్రైన్ వచ్చినా అది అక్కడకు చేరేసరికి ఏ అర్ధరాత్రవుతుందో —

"అర్ధరాత్రి" అనుకోగానే రాజ్యం ఉత్తరం గుర్తొచ్చింది.

"కస్తూరీ ! రోజు రోజుకీ మా వూళ్లో పరిస్థితి మరీ అధ్వాన్నమయిపోయిందే. చీకటి పడ్డాక మా వూరెప్పుడూ రాకు సుమా ! నువ్వసలే 'ఎక్స్‌పరిమెంట్' పక్షివి, పైగా అమాయకురాలివి.

రాత్రి పన్నెండుదాటి ఈ ఊళ్లోఆడవాళ్ళు ఒంటరిగా కనిపించారంటే వెళ్తున్న పనికి సరైన ఋజువు చూపించలేకపోతే — ఛ — మరి అడక్కు. పోలీసుల ఎంక్వయిరీకి ప్రాణంపోతుంది. ఒకసారి నేనే అనుభవించాను. అమ్మకి సీరియస్‌గా ఉందని వెళ్లిన నేను — తెల్లారేసరికి మళ్లీ ఆఫీసుకి హాజరవ్వాలనే కంగారులో రాత్రికి రాత్రి దిగబడాల్సి వచ్చింది. ఆ రోజు నా అదృష్టం బాగుండబట్టి బతికిపోయాను. గేట్లో టికెట్ కలెక్టర్ లేకపోబట్టి రైలు టికెట్టు నా దగ్గరే ఉండిపోయి, అదీగాక ఆ పోలీసుతో కాస్త ముఖ పరిచయం ఉంది కనుక అవమానంనుండి బయటపడ్డాను. అయినా ఎందుకొచ్చిన గొడవగానీ నువ్వు రాత్రిపూట రాకు తల్లీ ! — నా కొంపలో రిసీవ్ చేసుకునేందుకు మగదిక్కుకూడ లేదు. పగలైతే నేనే స్టేషన్‌కొస్తాను. రాకపోయినా నీ దగ్గర అడ్రసుందికనుక ఈజీగా ఇల్లు పట్టుకోగలవు. వస్తే ముందు వ్రాయి."

ఒకే కంచం ఒకేమంచంగా బతికి ఉద్యోగాల మూలంగా చెరోమూలకీ విసిరేయబడ్డ రాజ్యాన్ని నాలుగేళ్ళ తర్వాత కలుసుకోబోతున్నా కదా — సస్పెన్స్‌గా వెళదామని నేనిలా ఊరుగాని ఊర్లో చిక్కుకుపోయి — ఇల్లు చేరతానో లేదోననే సస్పెన్స్‌లో పడ్డాను.

నోట్లో నాలుగింగ్లీషు ముక్కలున్నాయి. దేశమంతా చుట్టేయగలననే పిచ్చి అహంకారంతో బాబ్జీ సెలవుపెట్టి వస్తానన్నా అంత చిన్నవాడు 'నన్నూ నా చదువునూ ఘోరంగా అవమానించడమేమిట'ని వద్దు పొమ్మన్నాను.

పొద్దెక్కిపోతే రాజ్యం ఊళ్ళో ఇల్లు దొరక్క అవస్థ పడతానేమోనని అన్నమైనా పెట్టకుండా రైలుకి నన్ను తరిమేస్తూ అమ్మ—

"ఇల్లు దొరక్కపోతే తిరుగుబండిలో వెంటనే వచ్చెయ్. ఆడపిల్లవి ఊరుగాని ఊళ్ళో ఇబ్బంది పడిపోతావ్"—నాలుగేళ్ళబట్టి పరాయి ఊళ్ళో ఒక్కతెనూ ఉద్యోగం చేస్తున్నానన్న విషయం మర్చిపోయి జాగ్రత్తలు చెప్తోంటే ఆవిడ అమాయకత్వానికి నవ్వుకున్నానుగాని ఆడ మనసు హెచ్చరికను గుర్తించలేకపోయాను — విధి పగబట్టి ఆ రోజు నన్నుచూసి నవ్వుతుందనుకోలేదు—

బయలుదేరిన గంటకే చెడిపోయిన ఇంజన్ను చూసి రైల్వేమీద రిట్ వెయ్యాలన్నంత కోపం వచ్చింది నాకు. కాని కలికాలం ! కోపానికే గనుక శక్తి ఉంటే రోజూ లేట్‌గా వచ్చే రైళ్ళమీద — పనులు పాడయి లబోదిబోమనే లక్షలాది జనం కురిపించే కోపాగ్నికి రైళ్ళు ఎప్పుడో మాడి మసయ్యేవి.

నేనెంత చిరాగ్గా ఎర్రగా చూసినా ఇంజన్ బాగవలేదుసరికదా ఇదిగో అదిగో అంటూ మరో పెద్దస్టేషన్నుంచి ఇంకో డొక్కు ఇంజన్ను తెచ్చి రైలును కదిల్చేసరికి మరో మూడుగంటలకి తక్కువ పట్టలేదు.

ఈలోగా కంపార్టుమెంటంతా పసిపిల్లల ఏడ్పులతో గోలగోల. మరో ట్రైన్ ఎక్కుదామన్నా ఆ దిక్కుమాలిన స్టేషన్‌లో ఏ ట్రైనూ ఆగలేదు. అయినా ఇది కదుల్తుందేమోననే ఆశ.

ఆ రోజెందుకో రైలు బాగా రద్దీగా ఉంది. చిరాగ్గా ఉంది నాకు. దానికితోడు మురికి కంపు కొడుతున్న గుడ్డల్తో చీదరగా చింపిరి జుట్టుతో ఎదురుగా నుంచున్న ఆ స్త్రీని చూస్తే మరీ కంపరమెత్తుంది. అన్ని గంటలూ నిలువుజీతమిచ్చినట్టున్న స్థితికి జాలి కలిగినా, ఎత్తుకున్న కుర్రాడి ముక్కు సముద్రంలా అయిపోతున్నా పట్టించుకున్నట్టు లేదు. వాడు ఎగబీల్చిన చప్పుడు వినబడినప్పుడల్లా డోకు వచ్చినంత పనయ్యేది నాకు. నాకు తెలుసు ఆ రిజర్వేషన్ కంపార్టుమెంటులో ఎంతోమందిలాగే ఆమెకూడా టికెట్టు

లేకుండా ప్రయాణం చేస్తోంది. రైల్వేకి నష్టం వస్తోందంటే ఇలాంటి వాళ్లే కారణం.

నష్టమయిన టైంతో తనకేం నిమిత్తం లేనట్టు రైలు వయ్యారంగా కావ్యాల్లో కథా నాయికలా ఊగుతూ విజయవాడ చేరేసరికి నాలుగయిపోయింది.

ఆ ఊరు మీదుగా వెళ్లడం అదే మొదటి సారేమో నేనా స్టేషన్ అందచందాల్నాస్వాదిస్తూ నా కొంప ముంచుకున్నాను. నేను కూర్చున్న కంపార్టుమెంట్‌ను డిటాచ్ చేస్తుంటే అదేమంత గాభరాపడాల్సిన విషయంగా తోచలేదు. పైగా అనవసరంగా గాభరాపడి ఆ నాగరికుల మధ్య నా చదువును అవమానపరచదలుచుకోలేదు.

కాని రైలు మాత్రం నన్ను దారుణంగా అవమానించేసి ఆ దిక్కుమాలిన ఊళ్లో పడేసింది.

అప్పటిదాకా రైలు కదిలిన దగ్గర్నుండి ఆ రూట్‌లో సంధ్యాసమయంలో ప్రకృతి అందాలకు పరవశించిపోతున్న నా మనసు గంట గడిచినా గుంటూరు రాకపోవడం— పైగా ఏవో తెలియని స్టేషన్ల పేర్లు కదిలిపోతుంటే ఉలిక్కిపడింది.

అప్పటిదాకా అందంగా కనిపించిన ప్రకృతి — నా పాలిట శాపంలా నన్ను మింగడాని కొస్తున్నట్టు కనిపించింది. నా చదువును చట్టుబండలు చేసిన అవివేకాన్ని తిట్టుకుంటూ కండక్టర్ వైపు పరిగెత్తాను.

చదువుకున్నట్టున్న నా రూపురేఖలకు నన్నేమీ అనలేక జాలిగా మాత్రం చూసి 'వచ్చే స్టేషన్‌లో దిగిపోండి లేదా హైద్రాబాద్ వరకూ పోవాలి. విజయవాడలోనే అడగలేకపోయారా — పైగా చదువుకున్నవాళ్లలా కనిపిస్తున్నారు' — చెళ్లుమని తగిలింది నాకు.

అటూ ఇటూ చూసాను. ఆ చింపిరి జుట్టామె ఎక్కడో దిగిపోయినట్లుంది. 'అలాక్కనిపించినా నా అజ్ఞానానికి జస్టిఫికేషనుండేది' అనిపించింది.

'ఇదేనమ్మా బస్ స్టేషన్, బయపడక మీ ఊరెళ్లిపో' - నన్ను బస్టాండులో దింపమన్న కండక్టర్ మాటల్ని తూచ తప్పకుండా ఆచరించి స్వామిభక్తి పరాయణుడైన హనుమంతుడిలా వెళ్లిపోయాడు పోర్టర్.

అది పెద్దదీ చిన్నదీ కాని ఊరు. బస్టాండుకి నడుస్తున్నంతసేపు 'దగ్గర త్రోవ'ని తుప్పల వెంట నడుస్తున్నంతసేపు పోర్టర్ననుమానిస్తూనే వచ్చాను. ఈ రోజుల్లో జరుగుతున్న మోసాలు వింటూంటే ఎవరిని నమ్మాలో అర్థంకావడంలేదు.

ఆ బస్టాండును చూసి నా కళ్లు తిరిగాయి. ఎక్కడబడితే అక్కడ గోతులు, బురద, నీళ్లతో పరమ చండాలంగా ఉంది. 'ఆఫీసు' అని బోర్డున్న అక్కడి పాకలో బీడి తాగుతూ ఠీవిగా కూర్చున్న ఓ ముసలి శాల్తీ— ఏదో దివ్య భవంతి ఓనర్‌లా కొయ్యకుర్చీమీంచి పోజులిస్తున్నాడు.

ఆ రాత్రి గుంటూరుచేరి రాజ్యం వర్ణించిన ప్రమాదంలో పడడంకంటే ఎలాగో విజయవాడ చేరుకుంటే అక్కడ సీత పిన్నిగారింట్లో రాత్రి కుండిపోయి తెల్లారి గుంటూరు పోవచ్చుననుకుని విజయవాడ పోయే బస్సు ఎన్నింటికుందో ఆ ముసలాయన్ని — ఇష్టంలేకపోయినా అడగాల్సి వచ్చింది.

అక్కడి మాట తీరుకి భిన్నంగా ఉన్న నన్ను ఆ ప్రాంతంకాదని పోల్చేసి ఎగాదిగా చూసాడా శాల్తీ. చిరాకేసినా 'తనదికాని చోట' అని నోరు మూసుకున్నాను. చెప్పావద్దా అను కుంటూనే — మళ్లీ అలాంటి అహంకారంతో ఆ చీకట్లో ఇబ్బంది పడడం ఇష్టంలేక క్లుప్తంగా నా పరిస్థితి చెప్పాను. ఆ పాక తాటాకులు నాలుగూ ఎగిరిపోయేలా నవ్వాడు. అక్కడ కింద కూర్చున్న గోచీలవాళ్లు నాకేసి అమాయకంగానే చూస్తున్నా మండిపోయింది నాకు. అయినా తప్పదు. తొమ్మిదింటిదాకా బస్సులేదు.

అరగంటకోసారి ఆ ముసలాయన నే కూర్చున్న చెక్కబల్ల దగ్గరకొచ్చి 'కాఫీ కావాలా

డీలక్స్‌వారి రక్తాక్షి సం॥ర

కానుకలు

| | | |
|---|---|---|
| డాక్టరుగారి భార్య [డైరెక్టు నవల] | కొమ్మూరి వేణుగోపాలరావు | 20-00 |
| జాలిలేని జాబిలి | ,, ,, | 15-00 |
| హారతి | ,, ,, | 12-50 |
| వెన్నెల తీరాలు | ,, R. సంధ్యాదేవి | 20-00 |
| బ్రహ్మ ముడి | ,, B. ప్రసన్న లక్ష్మి | 16-00 |
| మోహన రూపం | ,, మాదిరెడ్డి సులోచన | 15-00 |
| అమృత కలశం | ,, ,, | 15-00 |
| భగవద్గీత-బైబిల్-ఖురాన్ [ప్రబోధములు] | ధూళిపాళ రామమూర్తి | 20-00 |

అందరికీ అందుబాటులో నుండి ఆదరించుచున్న

కాశీమజిలీ కథలు 12 భాగములు 240-00

(మొత్తం సెట్టుగా గాని విడివిడిగా గాని లభించును.)

డీలక్స్ పబ్లికేషన్స్,

ఏలూరు రోడ్ : : విజయవాడ-2.

ఆపరేషను, ఇతర వైద్య చికిత్సలతో నిరాశచెందిన సోదర, సోదరీమణులు అనేకులు మా సలహాలచే సంతానవంతులయి ఇచ్చిన యోగ్యతాపత్రములు గలవు.

మీకు బేబి/బాబు కావాలా

స్త్రీ, పురుష సంతానదోష నివారణా నిపుణులు.

వివరములు ఉచితం

పోస్టు ద్వారా చికిత్స గలదు.. ఈ మాస ములో స్వయముగా సంప్రదించుటకు

— తెనాలి —

గురువారం, ఆదివారం } మధ్యాహ్నం గం. 12-00 నుండి సాయంత్రం గం. 5-00 వరకు

— విజయవాడ —

మంగళవారం, బుధవారం, శనివారం } మధ్యాహ్నం గం. 12-00 నుండి సాయంత్రం గం. 5-00 వరకు

శ్రీనాగార్జున మూలికా కుటీరం

రైల్వేస్టేషనవద్ద, రామాలయం వీధి, తెనాలి. 522 202.

2వ లైను, కేదారేశ్వరపేట, విజయవాడ. 520 003.

పోడా కావాలా' అంటూంటే కీడును శంకించి నా మనసు వణికిపోయింది. అక్కడున్నవాళ్లంతా ఇంచుమించుగా ముందు బస్సుల్లో వెళ్లిపోయారు. కారాకిళ్లీ నములుత్తూ ఊస్తూ ఉన్న ఒక్క ఆడదానిమీద నాకు సదభిప్రాయం కలగలేదు సరికదా ముసలాయన, ఆ స్త్రీ ఉండుండి నాకేసి చూసి మాటాడుకుంటుంటే, వినిపించిన ఒకటి రెండు మాటలూ ఆ యాసకి అర్థంకాక — వాళ్ళు నామీద కుట్రపన్నుతున్నట్లనిపించింది.

మళ్లీ పలకరించిన ముసలాయనకి ఈసారి నా ముఖంలో చిరాకు ప్రస్ఫుటంగా కనిపించి నట్టుంది — జంకుతూనే అన్నాడు.

"డూటీ అయిపాయె ఈ బస్సులో పోతన్నా. విజయవాడ పోయేందుకు బాగా పొద్దుపోతుంది కాపీ తాగు బయపడక" అంటూ దుమ్ము రేపు కుంటూ ఆగిన బస్సులో ఎక్కేసాడు. నా కళ్లలో నీళ్లు తిరిగాయి. తల్లినుండి తప్పిపోయిన లేగదూడలా ఉన్న నా కోసమే మరో అరగంట కూర్చున్న ఆ ముసలాయనకి అప్రయత్నంగానే చెయ్యూపాను.

కదిలిపోతున్న బస్సులోంచి తలకాయ బయటపెట్టి 'బోర్డు చూసి బస్సెక్కు' అంటూంటే ఈసారి నేనేమీ అవమానం ఫీలవ లేదు — వచ్చీరాని మాటల్లో గొప్పలు చెప్పే కొడుకు మాటలకి మురిసిపోతున్న కన్నతండ్రి హెచ్చరిస్తున్నట్లుందది.

అప్పటి నా స్థితికి నామీద నాకే చెప్పలేనంత జాలి కలిగింది. చిన్నప్పట్నుంచీ పదిమందున్న కుటుంబంలో పెరిగి, ఉద్యోగపుటూళ్లోకూడ పది కుటుంబాల లోగిట్లో నిర్భయంగా బ్రతుకుతున్న నేను — బస్సు రావడం ఆలస్యం అవుతున్నకొద్దీ ఆ చీకట్లో అనుమానాస్పదమైన ఆ ఆడలోడుతో ఆ పాకలో నరకం అనుభవించాను. అప్పుడు ఆ క్షణంలో నా భయం పోగొట్టి నన్ను సురక్షితంగా ఇల్లు చేర్చినవాళ్ల ఋణం ఈ జన్మకి తీరదు. కానీ ఆ క్షణంలో నన్నాదుకునే వాళ్లేరీ? అప్పటిదాకా జీవితంలో ఎప్పో మెట్లెక్కి ఏదో గొప్ప పనిచేసి సంఘ సేవ పేరుతో ఎందరినో ఉద్ధరించి ఏదో బావుకోవాలనే గొంతెమ్మ కోరికలున్న నేను — "ఈ రాత్రికి కేవలం తలదాచుకునే సురక్షితమైన చోటు దొరకడం కంటే జీవితంలో మరేం కోరుకోనని" మనసారా భగవంతుడిని — కనిపించకుండా పారిపోయిన — నాలాగే తప్పిపోయిన దేవుడిని కోరాను.

ఆడదానికి సురక్షితమైన చోటు ఈ దేశంలోనే లేదని నా కప్పటిదాకా తెలీలేదు.

చెడిన బస్సయితే వచ్చింది కానీ ఆ రోజుకది బయలుదేరదని అక్కడే తల దాచుకుంటుందని తెలిసి నాప్రాణాలు పైనే పోయాయి.

కారాకిళ్లీ ఆడది కండక్టరుతో నవ్వుతూ మాట్లాడుతుంటే వాళ్లిద్దరూ కలిసి నన్నన్యాయం చేస్తారేమోననే భయంతో ఆమెను సాయం అడగడం విరమించుకున్నాను. ఆమె కూడ నన్నేదో అడగబోయి నా కళ్లలో కనిపించిన భావానికి కాబోలు జంకి ఆ చీకట్లో ఒక్కతే నడుచుకుంటూ పోయింది.

ఆ ఊళ్లో పోలీసు స్టేషన్ ఎక్కడుందో?

పేపర్లలో రోజూ చదివే వార్తలు నాలో భయాన్ని రెట్టింపు చేసాయి. కానీ ఎలా? ఆ బస్టాండులో రాత్రంతా గడపడం అసాధ్యం — ప్రమాదం.

కిళ్లీకొట్టు దగ్గర నలుగురు జులపాలవాళ్లు విలన్లు — ఉండుండీ నాకేసి చూస్తూ గుసగుసలు పోతూంటే ఏడుపొచ్చినా బలవంతాన దిగమింగి ఉపాయం ఆలోచించాను.

చిన్న మెరుపు మెరిసింది.

గుండె చిక్కబట్టుకుని ఆ ఆఖరి అస్త్రాన్ని ప్రయోగించాను. బెడిసికొట్టకపోతే —

"ఎస్. ఐ. గారిల్లు ఎక్కడో చెప్తారా?" ఇద్దరు వెనకడుగు వేసారు.

"జనార్దన్‌గారా? ఇక్కడికి మైలుండది. ఏమవుతావు వారికి?"

"ఆయన మా బాబాయి. నా ఉత్తరం అంది ఉండదు. బస్టాండుకి వస్తారేమోనని ఇంతదాకా చూసాను. నన్ను వారింటికి కొంచెం దిగబెడతారా?"

నలుగురూ చెవులు కొరుక్కున్నారు. వాళ్లేం కూడబలుక్కున్నారో నా కర్థంకాలేదు. కానీ ఓ బక్క రిక్షా ప్రాణిని ఎంచి నన్నారిక్షాలో కూర్చోబెట్టారు.

భగవంతుడిమీద భారంవేసాను. మనిషికి ఆఖరి మజిలీ అదే. అన్ని అస్త్రాలు విఫలమయ్యాక "త్వమేవ శరణం" తప్పదు.

వాచీ చూసాను.

పదిన్నరవుతోంది. ఏవో సందులు గొందుల్లోంచి పోతోంది రిక్షా. ఓ క్షణం నేనెక్కడున్నానో నాకర్థంకాలేదు.

నా జీవితం దిక్కూ దివాణంలేని ఆ ఊళ్ళో అంతం కావాలని రాసిపెట్టి ఉంటే ఆపడం ఎవరితరం?

ముందు రిక్షాలాగుతున్న బక్క ప్రాణం—

వెనుక యమకింకరుల్లాంటి నలుగురు విలన్లు.

అర్ధరాత్రి—ఒంటరిగా ఆ చీకట్లో చల్లబడిపోతున్న శరీరంతో — నాలుక పిడచగట్టుకుపోతుంటే ప్రాణాల్ని గుప్పెట్లో పెట్టుకుని అలా వెళ్తున్నాననుకుంటేనే నా గుండె ఇప్పుడో, క్షణంలోనో ఆగి పోతుందనిపించింది.

'స్త్రీ అబలకాదు, సబల శక్తి స్వరూపిణి' అంటూ ఈ దేశంలో ఎందరు ఎంతగా గొంతులు చించుకుని బల్లగుద్ది అవస్థ పడుతున్నారో నాకు తెలియదుకాని—స్త్రీ దౌర్భాగ్యానికి ఈ క్షణంలో ప్రతినిధినయిన నేనేమైపోతున్నానో అంతుబట్టడంలేదు.

వెనుక వస్తున్న వాళ్లేం అమాయకులు కారు నేను ఎస్. ఐ. బంధువునని నమ్మడానికి. నమ్మనట్టు వాళ్లముఖాలే చెప్తున్నాయి. మరి నన్నెక్కడికి, ఏం చెయ్యడానికి తీసుకుపోతున్నారో— భగవాన్—

ఇటీవల గుంటూరు హిందూ కళాశాల హిందీ విభాగంవారు ఏర్పాటు చేసిన 'హిందీ సెమినార్'లో డా. భాను పాల్గొన్న సందర్భంగా తీసిన చిత్రం. ఫోటోలో కళాశాల పాలకవర్గం కార్యదర్శి శ్రీ మాధవపెద్ది రాధాకృష్ణమూర్తి, శ్రీ ఎస్. కె. సిన్హా, శ్రీ జి.కె.ఎస్.ఆర్.కె. శర్మ, డా. భాను గార్లని చూడవచ్చు.



# మీ ఋణం తీర్చుకోలేను

వంతెనమీంచి పోతోంది రిక్షా. అటూఇటూ నల్లగా సాగిపోతున్న ఆ నదిపేరేంటో నాకు తెలీదుకాని ఆ క్షణంలో అది నాకంటికి పవిత్ర నదీమతల్లిలా గోచరించలేదు. ఆ ఊరి పాపాలకు ప్రతినిధిలా ఉంది. అందుకే దానిమీంచి వస్తున్న చల్లగాలి నా చెమటను ఆర్పలేకపోయింది.

వీళ్ళచేతుల్లో అమానుషంగా చచ్చేకంటే గభాలున అందులో దూకితే ??? దూకేలోగా వెనుకవాళ్ళు నన్ను పట్టుకుంటే ?—

గతజలసేతుబంధనమే అయినా ఎంత తెలివి తక్కువపని చేసాను ? ఉన్న ఒక్క ఆడ తోడునూ అనుమానించి వదులుకున్నాను. ఆ రాత్రి ఆమె నన్ను ఏ గూండాలకు అమ్మేస్తుందోనని భయపడి స్వయంగా వీళ్ళ చేతుల్లో ఇరుక్కున్నాను.

'అదే జనార్ధన్ గారిల్లు'—

లావుగా ఉన్నతని గొంతు గరగరలాడింది. నా మనసు క్షణంపాటు ఆనందంతో నాట్యం చేసింది.

రిక్షావాడు గూర్ఖాని లేపి లోపలికి కబురు చెయ్యడంగాని, నిజంగానే నా పాలిట దేవుడిలా జనార్ధన్‌గారు — ఏభయ్యేళ్ళ దృఢ శరీరంతో బయటకు రావడంగానీ నాకు నమ్మశక్యం కాలేదు చిన్న దగ్గుతో వెంట ఆయన భార్య కాబోలు బయటకు వచ్చి నన్ను పరీక్షగా చూస్తూంటే అప్రయత్నంగానే నన్నా యిల్లు చేర్చిన వెనుక నలుగురికీ చేతులు జోడించాను.

అయోమయంగా చూస్తున్న ఆ పోలీసధికారికి క్లుప్తంగా నా స్థితి తెలియజేసాను. ఆయన భార్య నా వణికిపోతున్న చెయ్యి పట్టుకుని దగ్గరకు తీసుకునేవరకు చివురుటాకులా కంపిస్తూనే ఉన్నాను.

ఆమె కళ్ళలో దయ — జాలి వరదలా ప్రవహించాయి.

యాదాలాపంగా బయటకు చూసిన నాకు ఆ నలుగురూ తల పంకిస్తూ అప్పుడే వెనుతిరగడం కనిపించింది.

అంటే వాళ్ళూ నమ్మలేదన్నమాట.

ఈయన కాదు పొమ్మంటే బయట నా పరిస్థితి ? ? ?

ఆ రాత్రి కన్నతల్లికంటె మిన్నగా ఆదరించిన ఆమె ఋణం ఈ జన్మలో తీరదు. అప్పటిదాకా ఎంతో ఉద్వేగాన్ని అనుభవించిన నా బలహీనమైన గుండె ఆగిపోలేదంటే ఆమే కారణం.

తినేందుకు అరటిపళ్ళు, మజ్జిగ ఇచ్చి భయంచాటున అప్పటిదాకా అణగారిపోయి అప్పుడే విజృంభించిన నా ఆకలిని చల్లార్చింది. ఆమెకి ఏమీకాని నామీదంత అవ్యాజానురాగం ఎందుకు కలిగిందో నా కిప్పటికీ తెలీదు.

కిన్నెర ఆర్ట్ థియేటర్స్(హైదరాబాదు)వారు ఇటీవల నిర్వహించిన ఘంటసాల వర్ధంతి సందర్భంగా మిమిక్రీ కళాకారుడు శ్రీ చిల్లర సుధాకర్‌ని సత్కరిస్తున్న డా. సి. నారాయణ రెడ్డి గారిని చిత్రంలో చూడవచ్చు.

'నీకేం భయంలేదు. ఉదయం గుంటూరు పోదువులే' — వెన్ను తట్టిందావిడ.

'ఏం ఆడపిల్లలో ? ఇంకా ఈ అమ్మాయి తెలివిగానే వ్యవహరించింది' — జనార్ధన్‌గారి మాటలకి ప్రాణం లేచొచ్చింది.

దగ్గుతో ప్రాణం కడబట్టిన ఆమె నన్నాగదిలోనే పడుకోమని సైగచేసి వెళ్ళిపోయింది. నాపమీద పడుకున్న నేను — నను గిల్లి చూసుకున్నాను కలా నిజమా అని —

కాని భగవంతుడికి ఆ ఇల్లాలికి నేను మొక్కిన మొక్కులింకా పూర్తికానే లేదు. అలసటతో కన్ను మూద్దామనుకుంటుండగానే అర్ధరాత్రి ఆ గదిలోకి ఎర్రటి కళ్ళతో గుప్పుమన్న వాసనతో ప్రవేశించిన జనార్ధన్‌ను చూసేసరికి తెలిసింది నేను చిక్కుకున్నది పులి బోనులోననీ — జనార్ధన్‌ది పులిపంజా అనీ —

నా కళ్ళకు పట్టిన మైకం వదిలిపోయింది.

నా కంత పిచ్చిబలం ఎలా వచ్చిందో నాకే తెలియదు. అప్పటిదాకా ఆవరించిన నిస్సత్తువ ఎగిరిపోయింది.

అంతే — ఆరడుగుల మనిషిని బలవంతాన ఏదిర్చి అతని చేతిలోని సీసానే పగలగొట్టి దానితోనే హత్య చేసాను.

జరుగుతున్న గొడవకు పిల్లలతో పరిగెత్తుకొచ్చిన ఆమె — ఆయన భార్య స్పృహతప్పి పడిపోయింది.

* * *

కటకటాల వెనుక కూలబడిపోయింది కస్తూరి. చిక్కిపోయిన ఆమె చేతుల్లో నా చేయి. కస్తూరి వణికిపోతోంది. ఆమె కళ్ళ ముందింకా ఆ దృశ్యం కదలాడుతున్నట్టుంది.

కస్తూరి నాకు దక్కాలంటే ?


సినిమా తారలు

G Subba Rama Raju

డా॥ వి. వి. కె. రావ్, B.A.

వైద్య విద్వాన్, వైద్యాచార్య, సెక్స్ స్పెషలిస్ట్

వివాహము వాయిదా వేయనవసరం లేదు. హస్త ప్రయోగం, నరముల బలహీనత, శీఘ్రస్ఖలనములకు ఆయుర్వేద చికిత్స. పోస్టుద్వారా చికిత్స కలదు.

రావూస్ క్లినిక్

టి. బి. రోడ్, తెనాలి.

ఫోన్ : 3700 & 4010.

గొప్ప అవకాశం

ఫొటోగ్రఫీ, కలర్ ఫొటోగ్రఫి మరియు స్క్రీన్ ప్రింటింగ్

పూర్తి సాంకేతిక విజ్ఞానాన్ని సులభమైన పద్ధతిలో నేర్చుకొనండి. పోస్టుద్వారా ఇంగ్లీషు లేదా హిందీ లేదా తమిళంలో నేర్పబడును. ప్రాస్పెక్టసుకొరకు వ్రాయండి.

KALAIMATHI NILAYAM

Nanjai thalaiyur-639 204.

TAMILNADU.

డా. కె.యల్. నారాయణ

వైద్యవిద్వాన్, వైద్యాచార్య

చర్మవ్యాధులకు, స్త్రీల వ్యాధులకు, పక్షవాతం, సుఖ వ్యాధులకు, సెక్సు, నరముల బలహీనతలకు, ఆయుర్వేద చికిత్స.

పోస్టుద్వారా చికిత్స కలదు.

లక్ష్మీ కుమారి క్లినిక్,

మెయిన్ రోడ్, తెనాలి.

చాలరోజుల తర్వాత కస్తూరి విడుదల యింది. రైల్లో నా చేతుల్లో వాలిపోయి భోరుమంది కస్తూరి.

"ఆకలి తీర్చి అక్కున చేర్చుకున్న ఆ అన్నపూర్ణ ఋణం తీర్చుకుందామనుకున్నాను మావయ్యా! నాకా అవకాశం ఇవ్వలేదావిడ. వేళగాని వేళ నా ప్రాణరక్షణకోసం శనిలా వాళ్లింట్లో ప్రవేశించి ఆమె పసుపుకుంకుమలకు మంగళం పాడాను. ఇప్పుడావిడను కూడ పొట్టన బెట్టుకుంటున్నాను.

నేను భయంతో అప్పటికే చచ్చిపోయాను మావయ్యా! చల్లని మాటలతో బ్రతికించిన ఆమెను చంపుకుంటున్నాను నన్నెందుకు విడిపించావు"— మౌనంగా కస్తూరి తల నిమురుతూండిపోయాను.

కోర్టులో జనార్దన్‌గారి భార్య మాటలు నా చెవుల్లో ప్రతిధ్వనిస్తున్నాయి.

"ఆ రాత్రి అడవి మృగాలు చంపి తింటా యనే భయంతో దిక్కులేని ఆ లేడికూన— కంచే చేను మేస్తుందని తెలియక నా యింట్లో ప్రవేశించింది.

ఆ పిల్లను చూస్తే చచ్చిపోయిన నా చెల్లెలు గుర్తొచ్చింది. నా చెల్లెలు ఎలాంటి భయంకరమైన పరిస్థితుల్లో చచ్చిపోయిందో నాకు బాగా గుర్తుంది. అది చచ్చిపోలేదు. చంపేసారు. కామంతో కళ్లు మూసుకుపోయిన పాపిష్టి చేతులకు ఆహుతైపోయింది

పని మనిషి రంగి ఎందుకు హఠాత్తుగా చచ్చిపోయిందో నాకు తెలుసు. అధికార మదంతో నిస్సహాయుల ఉసురు పోసుకోవడం నాకు తెలుసు. కానీ పవిత్ర భారత నారీమణుల ప్రతినిధిని— నా చేతులకు సతీత్వమనే బంగారు సంకెళ్లు

రక్షించవలసినవాడే భక్షకుడవుతూంటే?

శరణుజొచ్చిన పసికూన ఆహుతైపోతుంటే నేను సహించలేకపోయాను. కానీ అనారోగ్యంతో బాధపడుతున్న నేను ఆపద శంకించి వచ్చేలోగానే కన్న కూతురు లాంటి ఆ పిల్ల—పెనుగాలికి లేత తమలపాకులా వణికిపోతూంటే, ఆమె కళ్లల్లో అంతకు ముందున్న నిశ్చింత స్థానంలో విస్మయం, భయం, భీతి ఉరికి వస్తుంటే . .

అందుకే నేనే చంపేసాను.

పట్టంకట్టుకుని బోర్డు తగిలించుకున్న — నీతి బురఖాలో దాక్కున్న—అవినీతిని చంపేసాను.

వెంటనే నేను చేసిన పనికి కుప్పకూలి పోయాను. నా గుండె వేగం పెరిగింది నాకూపిరందనంతగా. స్పృహ తెలిసినా ఆమెను అరెస్ట్ చేసారని తెలియనివ్వలేదు పిల్లలు.

కానీ ఏమైనా జీవిత చరమాంకంలో ఇప్పుడోక్షణంలోనో ఆగిపోనున్న గుండెబలం లేని గుండెతో నున్న నేను ఆ మొగ్గ జీవితాన్ని తుంచలేను."— జీరవోయిందామె కంఠం

అర్ధరాత్రి అందమైన ఆడపిల్ల ఒంటెడు నగలతో ఒంటరిగా నిర్భయంగా నడిచి వెళ్లగల రోజుకోసం కలలుగన్నాడు మహాత్ముడు.

మహాత్ముడు పుట్టిన దేశంలోనే ఒక మహిళ ప్రధానిగా రాజ్యమేలుతున్న ఈ దేశంలో కూడ స్త్రీ ప్రాణంకంటే మిన్నగా చూసుకునే శీలానికి రక్షణ కరువైంది.

అందులోనూ స్త్రీలను హంతకులనుండి, గూండాలనుంచి రక్షించవలసిన సుశిక్షితులైన రక్షకులే భక్షకులుగా తయారైతే — కంచే చేను మేస్తుంటే ఎవరికి చెప్పుకోవాలి?

ఈ సమాజం బాగుపడేదెప్పుడు?

స్త్రీల ఆర్తనాదాలకు అంతం ఎప్పుడు?

ఇదా గాంధీ పుట్టిన దేశం ?

మహాత్ముడే ఈ రోజు బ్రతికిఉంటే ఇలాంటి భక్షకులను చూసి తప్పక ఆత్మహత్య చేసుకునేవాడు.

— నా ఒళ్లో నిద్రలో ఉన్న కస్తూరి మధ్యలో ఉలికిపడుతూ ఇంకా వెక్కుతూనే ఉంది.

ఇన్ని అనర్థాలకు కారణమైన రైలు ఏమీ ఎరగనట్టు, పట్టనట్టు నిర్వికారంగా సాగిపోతూనే వుంది. ★


యద్దనపూడి సులోచనారాణి

వేసవికాలం ఆగమనంతో మల్లెలు గుబాళిస్తాయి

ఆగమనం

వెల రూ. 20

మార్చి 5 విడుదల

క్వాలిటీ పబ్లిషర్స్

రామమందిరం వీధి, విజయవాడ-520002.

అన్ని పుస్తకాల షాపులలోనూ దొరుకుతవి.

తెల్ల మచ్చలకు చికిత్స

తీవ్రమైన ఒక పరిశోధన తరువాత తెల్ల మచ్చలను బాగు చేసేందుకు నాను మా మందు కనిపెట్టబడింది చికిత్సను సరిగా పూర్తిగా పొందుతే మచ్చల రంగు మారి శరీరానికి మునుపటి రంగు తిరిగి వస్తుంది జబ్బు మొదళ్ళలో నుండి కూడా పూర్తిగా నయమౌతుంది మీరు నిరాశ చెందినట్లయితే తప్పకుండా ఈ చికిత్సను పొందండి. మా చికిత్సను పూర్తిగా పొందినట్లయితే ప్రచారానికై ఒక ఫైల్ ఉచితంగా ఇవ్వబడుతుంది. రోగుల వయస్సుతో సహా జబ్బు పూర్తి వివారాలను వ్రాయండి

దాంపత్య జీవితాన్ని ఆనందించండి

బాల్యంలో చేసిన పొరపాట్లకు లేక మరి ఏ ఇతర కారణాలకు గాని లోనై సిగ్గుతో మీ బలహీనతను ప్రదర్శించలేక దాంపత్య జీవితంలో ఎటువంటి ఆనందభరితమైన సుఖాన్ని అనుభవించలేక పోతున్నారా అయితే రహస్యమైన మీ జబ్బు యొక్క పూర్తి వివరాలను వ్రాయండి దాంపత్య జీవితంలో గల నిజమైన సుఖాన్ని అనుభవించేందుకు సలహాలను పొందండి.

తెల్ల వెంట్రుకలు మరియు వెంట్రుకలు రాలిపోవుట

జుట్టును డై చెయ్యనవసరం లేదు మా ఆయుర్వేద చికిత్స (ఆయిల్) వల్ల తెల్ల వెంట్రుకలు మామూలు నలుపు రంగులోనికి మారి స్థిరంగా నిలుస్తాయి జుట్టు రాలిపోకుండా కాపాడి జుట్టు రాలిన ప్రదేశాన కొత్త జుట్టు వస్తుంది. ఇది మెదడును చల్లపరుస్తుంది. ఒక కోర్సులో 3 ఫైల్స్ ధర రూ 35/- పోస్టేజి మరియు ప్యాకింగ్ అదనం.

**SHYAM AYURVED BHAVAN (AP)**

***P.O. KATRI SARAI (GAYA) PIN : 805 105***



ఇటీవల విజయనాడలోని తుమ్మలపల్లి కళాక్షేత్రంలో 'కళారంజని' సంస్థవారి ఆధ్వర్యంలో జరిగిన ఒడిస్సీ నృత్య ప్రదర్శనలో ఒక దృశ్యం.




## భోపాల్‌లో సంక్రాంతి వేడుకలు

భోపాల్ ఆంధ్ర విజ్ఞాన సమితి సభ్యులు, బి. ఎచ్. ఇ. యల్. సాంస్కృతిక భవనంలో సంక్రాంతి వేడుకలు జరుపుకున్నారు.

సభకు బోర్డు ఆఫ్ సెకండరీ ఎడ్యుకేషన్ అధ్యక్షులు (మధ్యప్రదేష్) శ్రీ ఐ. ఎస్. రావు అధ్యక్షత వహించారు. సమితి అధ్యక్షులు శ్రీ ఆర్. సుబ్బారావుగారు, ఉపాధ్యక్షులు శ్రీ పి. వి. కృష్ణారావు, శ్రీ మట్టె సూర్యనారాయణగారు ప్రసంగించారు.

అనంతరం సాంస్కృతిక ప్రదర్శనలలో చిరంజీవులు అంజన, సునాలీ, కిరణ్, సత్య, లక్ష్మి నృత్య ప్రదర్శన, శ్రీ పి. వి. నాయుడు గారి 'నిరుద్యోగి' ఏకపాత్రాభినయము. శ్రీయుతులు ప్రసాద్, తేజేశ్వరరావుచే నిర్వహించబడిన లలిత సంగీతము, వాద్య సంగీతము జరుపబడినవి.

శ్రీ యండమూరి వీరేంద్రనాథ్ రచన "ముష్టియుద్ధం" ఏకాంకిక శ్రీ హరగోపాల్ దర్శకత్వంలో ప్రదర్శింపబడినది. సమితి సభ్యులయిన శ్రీ టి. వి. యస్. శంకరరావుగారిని నాటక కళ యందు సమితికి చేసిన కృషికి దుశ్శాలువతో సత్కరించారు.

శ్రీ ఐ. ఎస్. రావు కళాకారులకు మొమెంటోలను బహూకరించారు.

సహాయ కార్యదర్శి శ్రీ పి. కృష్ణారెడ్డి వందన సమర్పణ చేశారు. (ఒ.వి.)

## నిజామాబాద్‌లో సాహిత్య సభ

ఇటీవల నిజామాబాద్ ప్రభుత్వ సాయం కళాశాల, ప్రభుత్వ గిరిరాజ డిగ్రీ కళాశాలల ఆధ్వర్యంలో సాహిత్య సభ జరిగింది. ప్రిన్సిపాల్ డా॥ ఆదినారాయణ అధ్యక్షత వహించారు.



ఇటీవల విజయవాడ నగరపాలక సంస్థ నిర్వహించిన రాష్ట్రస్థాయి నృత్య పోటీలలో ద్వితీయ బహుమతిని బేబి ఎం. మాధవికి అందజేస్తున్న అం. ప్ర. విద్యామంత్రి శ్రీ ఆనంద గజపతిరాజు. ఈమె శ్రీ ఎం.డి. గిరి శిష్యురాలు.

తెలుగు కవి శ్రీ గుంటూరు శేషేంద్రశర్మగారు, ఇండో ఆంగ్లియన్ కవయిత్రి శ్రీమతి రాజకుమారి ఇందిరాదేవి ధన్‌రాజ్‌గిర్ ముఖ్య అతిథులుగా విచ్చేశారు. రాజారావు, సతీశ్‌లు ప్రార్థనాగీతము ఆలపించారు. రాజరెడ్డి, నీరజ, సాయిప్రసాద్ అతిథులను పూలమాలతో సత్కరించారు. సాయం కళాశాల ఇంచార్జి ప్రిన్సిపాల్ శ్రీ ఆచార్య గారు అతిథులకు సాయం కళాశాల తరుపున మెమెంటోలను అందచేశారు. శ్రీ బాలయ్య వందన సమర్పణ చేశారు.

(ఒ. వి.)

గోల్కొండ కేంద్రీయ విద్యాలయం విద్యార్థి చి. ఎస్. రవిచంద్రరావుకి బాలల చిత్రకళలో సోవియట్‌లాండ్ నెహ్రూ అవార్డుని బహూకరిస్తున్న సోవియట్ సమాచార శాఖ ఉప అధిపతి శ్రీ వి. ఎల్బయేవ్‌ని చిత్రంలో చూడవచ్చు.



## హైదరాబాద్ నోట్‌బుక్

### డాక్టర్ చల్లా రాధాకృష్ణ శర్మ :

మూడు దశాబ్దాల నాటి మాట. మద్రాసులో పరిశోధన అనే పత్రికను నడుపుతున్నాను. చాకలి పేటలోని సర్ త్యాగరాయ కళాశాలలో పని చేసే శ్రీ చల్లా రాధాకృష్ణ శర్మతో పరిచయమయింది. ఉత్సాహం ఉరకలు వేస్తున్న యువకులు. తమిళ సాహిత్యమూ బాగా చదువు కొన్నవారు. కథలు, కవితలు వ్రాసే వారు. అప్పుడు నేనుఆయనకు "కథలు, కవితలు తెలుగులో వ్రాసే వారు చాల మంది ఉన్నారు. తమిళ సాహిత్యం గురించి తెలుగువారికి, తెలుగు సాహిత్యం గురించి తమిళులకు తెలపండి. దీని వల్ల ప్రజలలో ఉభయ సాహిత్యాలపైన గౌరవం పెంచిన వారవుతారు" అని సలహా ఇచ్చాను. ఆయన నా సలహామేరకు తమిళ సాహిత్య చరిత్రను పరిశోధనలో వరుసగా వ్రాశారు. నేడు తెలుగు తమిళ సాహిత్యాలను కలిపే బంగారు కొలికి అయ్యారు. డాక్టర్ శర్మ కృష్ణాజిల్లా సోమవరప్పాడులో 1929 జనవరి 6న జన్మించారు. తండ్రిగారు విద్వత్కవి శ్రీ లక్ష్మీ నారాయణ శాస్త్రి. తండ్రి చాలు కుమారునికి సంక్రమించడం సహజం. డా.శర్మ ఎం.ఎ.పట్టాపుచ్చుకొన్నతర్వాత అధ్యాపకులుగా జీవిత రంగంలో ప్రవేశించారు. కేంద్ర సాహిత్య అకాడెమీలో 24 సంవత్సరాలు ఢిల్లీలోను, చాల కాలం సాహిత్య అకాడెమీ ప్రాంతీయకార్యాలయ కార్యదర్శిగా మద్రాసులోను పనిచేసి, ప్రస్తుతం తమిళనాడులోని మదురైలో మదురై కామరాజ్ విశ్వవిద్యాలయంలో తెలుగు ప్రొఫెసరుగా ఉంటూ, తమిళతెలుగుసాహిత్యాలకు ఎంతోసేవ చేసే మహాభాగ్యం పొందారు. ఇటీవల హైదరాబాద్‌కు వచ్చినపుడు ఆయనను చూడగా నిలువెత్తు ఎదిగారనిపించింది. ఈ మూడు దశాబ్దాలలోను ఆయన ఎం. లిట్, డాక్టరేట్ డిగ్రీలు సంపాదించడమేకాక తెలుగు, తమిళ, ఆంగ్లాలలో 60కి పైగా స్వతంత్ర రచనలు, అనువాదాలు చేశారు. వివిధ పత్రికలలో అనేకానేక వ్యాసాలు, కవితలు, కథలు, మున్నగునవి వ్రాశారు. సాంఘిక నవలతప్ప తక్కిన సాహిత్య ప్రక్రియలన్నిటా ఆయన లేఖిని అపూర్వ విషయాలు వెలయించింది. వ్యాసమంజూష, తెలుగు విందు, ఆర్తి గీతాలు, వేమన సూక్తులు, దళవాయి రామప్పయ్య, చరిత్రకెక్కిన చరితార్థులు, మధురనాయకరాజులు, తమిళ వేదం, తమిళ పంచకావ్య కథలు, తమిళ సాహిత్య చరిత్ర, ఆధునిక తమిళ సాహిత్య నిర్మాతలు, ఆయిరంతలైనాగం (వేయి పడగలు అనువాదం), తెలుంగు ఇలక్కియవ్వగణి (తెలుగు సాహిత్యం గురించి), ది రామాయణ ఇన్ తెలుగు అండ్ తమిళ్ — ఎస్టడీ, టేల్స్ ఫ్రం తెలుగు, పాల్కురికి సోమనాథ, ర్యాంబ్లింగ్స్ ఇన్ తెలుగు లిటరేచర్, ల్యాండ్‌మార్క్స్ ఇన్ తెలుగు లిటరేచర్ — ఆయన రచనలలో కొన్ని. తమిళ వేదమైన తిరుక్కురళ్ నుంచి కొన్ని తెనుగు సేతలు ఉదాహరిస్తాను.

డా. చల్లా రాధాకృష్ణశర్మ



దారిద్ర్యం :—
కను మూయవచ్చును పెనుమంట నడుమ
కనుమూయదరమె లేమిని మ్రగ్గువేళ

మంచి ప్రభుత్వం :—
వినువీధి జూచి జీవించు లోకమ్ము
మనుదురు ప్రభుదండమును జూచి ప్రజలు

తగిన తరుణం :—
అరుదైన ఆకాశమరుదెంచెనేని
అరుదైన కార్యమ్ము నా చరింపవలె

విద్య నేర్వమి :—
చదువనివాడును చతురుడే—అతడు
మెదపగూడదు నోరు చదువరిముందు

రాజు :—
తన విధి తప్పక, తన ప్రజనాదు
కొనెడు నృపతి దైవమని వార్తకెక్కు

ప్రణయ కలహం :—
మధురిమ కూర్చు ప్రేమకు కలహమ్ము
అది మరింత యగును ఆలింగనమున

అనువాదం మూల విధేయమై ఎంత సొంపులు ఒలికిస్తున్నదో సహృదయులే ప్రమాణం. స్వాతి చినుకు యథాలాపంగా ముత్తెపు చిప్పలో పడుతుంది; గొప్ప ఆణి ముత్తెంగా రూపు దిద్దుకుంటుంది. యథాలాపంగా చెప్పిన మంచి మాట డాక్టర్ శర్మను తెలుగు తమిళ సారస్వత సేతువుగా మలచింది. అది మాట మంచితనం కాదు, డా. శర్మ మనసు మంచితనం. ఆంధ్రావళి ఆయన నుంచి ఇంకా చాల ఆశిస్తున్నది.

### ఉపశ్రుతి :

మా చారా, మహారాష్ట్రలో గాడిదలు ప్రదర్శనాలు జరిపాయట—అని నాతో అన్నారు ఒక రాజకీయ కార్యకర్త. వెనుకటికి "గాడిద నీవునున్ కవివి గాదు గదా అనుమానమయ్యెడిన్" అని కవి అన్నాడు. ఇప్పుడు దానిని "గాడిద నీవునున్ పొలిటికల్ గురువా అనుమానమయ్యెడిన్" అని సవరించుకుందామా? — అనడిగాడు మా మాటలు వింటున్న ఒక బాల కవి.

— తిరుమల రామచంద్ర ★

### ఆంధ్రనాటక కళా పరిషత్తు

ఆంధ్ర నాటక కళా పరిషత్తు 29వ వార్షిక మహాసభలను పాలకొల్లులో మే నెల చివరి వారమున జరుపుటకు నిర్ణయిస్తూ ఆ సందర్భముగా నాటక, నాటిక పోటీలు నిర్వహించటానికి, విజేతలకు నగదు బహుమతులు, ఇంకా అనేక శాశ్వత బహుమతులు, ఎన్నికయిన ప్రతి నాటకమునకు రూ. 1000 లు, నాటికకు రూ. 500 లు యివ్వడానికి నిర్ణయించినట్లు కార్యదర్శి రాస్తున్నారు. దరఖాస్తు ఫారములు చేరవలసిన ఆఖరు తేది 15–3–1984.

వివరాలకి కర్యదర్శి, ఆంధ్ర నాటక కళా పరిషత్తు, కేరాఫ్ : శ్రీ వెలిదండ్ల హనుమంతరాయ గ్రంథాలయము, గాంధీనగరం, విజయవాడ — 5000 03. రాయవచ్చును.

### సాహితీ సమితి కథల పోటీ ఫలితాలు

సాహితీ సమితి (రంగారెడ్డిజిల్లా రచయిత సంఘం) వికారాబాదు దశాబ్ద్యుత్సవాల సందర్భంగా నిర్వహించిన "తెలుగు కథానికల పోటీ"లలో మొదటి బహుమతిగా "రక్త సంస్కారం" (శ్రీ జి. బాను, లెక్చరర్ ప్రభుత్వ కళాశాల, కాకినాడ). రెండవ బహుమతిగా "బూర్జువా పెళ్ళికొడుకు" (శ్రీ కప్పగంతుల మల్లికార్జునరావు, లెక్చరర్, రాజమండ్రి). మూడవ బహుమతిగా "మట్టిమనిషి" (శ్రీమతి కె. వీణారెడ్డి, బాగ్‌లింగంపల్లి, హైదరాబాదు). కథలు ఎన్నిక అయినాయి. మార్చి 4వ తేదీన తాండూరులో జరిగే రంగారెడ్డిజిల్లా సాహిత్య సభలలో బహుమతి ప్రదానం జరుగుతుంది.

### కళా సదస్సు నాటక పోటీలు

చిలకలూరిపేట కళా సదస్సువారు మే నెల మొదటి వారంలో అఖిలభారత స్థాయి నాట్య పోటీలు మరియు నాటక పోటీలు నిర్వహించుచున్నారు. భరత నాట్యం సీనియర్స్ జూనియర్స్, కూచిపూడి సీనియర్స్ జూనియర్స్ జానపదం సీనియర్స్ జూనియర్స్ పోటీలు కలవని సంస్థ అధ్యక్షులు తెలియజేశారు. వివరములకు శ్రీ కందిమళ్ల నారాయణమూర్తి, అధ్యక్షులు, కళాసదస్సు, చిలకలూరిపేట—522 616కి రాయాలి. ★

